

కాడ... శ్రీనివాసులు

# కమ్యూనిజం

జూన్, 1984

* దేశ రాజకీయ పరిస్థితి
* ఫ్రెంచి కమ్యూనిస్టు పార్టీ పంథా
* పోర్చుగీసు కమ్యూనిస్టు పార్టీ
* ఫాసిజానికి వ్యతిరేకంగా పోరాటం
* సాహిత్య సమీక్ష

# కమ్యూనిజం

సంపుటి : 10 ★ జూన్ 1984 ★ సంచిక : 2

ఈ సంచికలో....

నోట్ బుక్ —కుడుప్పగంటి నాగేశ్వరరావు

దేశరాజకీయ పరిణామాలు—

పెరాగ్వే ఫాసిస్టు నియంతృత్వానికి వ్యతిరేకంగా పోరాటం —క్యాంపస్, గొంజాలెజ్

నమిబియా —శ్యామ్ నుజోమా

ఫ్రెంచి కమ్యూనిస్టు పార్టీ పంథా —మాగ్జిం గ్రెమెట్జ్

పోర్చుగల్ పార్టీ మహాసభ సమీక్ష —పెలాసో

తరిగిపోని విముక్తి పోరాటశక్తి —ఖలేద్ హమ్మామి

యుద్ధ ప్రచారం నేరం —జాన్ పిడమాన్

ప్రజల విజయం – వారి సాహిత్యపు విజయం

దోపిడీదారుని నిజరూపం —రాఫుల్ పివో

కొరడా రాజ్యం —ఫహాద్

COMMUNISM (Telugu Monthly)

Volume : 10 June 1984 No. 2

## CONTENTS

* War Propaganda is Criminal - john Pittman
* Firm Rebuff to the Policy of Imperialism —*Maxime Gremetz*
* Defending the achievements of April —*Angelo Veloso*
* Promoting Peace —*Pauos Trigazis*
* Inexhaustible Potential of the Liberation struggle —*Khaled Hammami*
* Fighting the fascist Dictatorship —*Hugo Campos*
* Fighting in a Besieged Gunison —*Sam Nujoma*
* Exploit the People, Exploit of their Literature —*Mikhail Alexegev*
* The Aggressor Pilloried —*Raul Vivo*
* Where They rule with the Whip —*Essop Pahad*
* National Council of C. P. I. on Indian situation
* Note Book —*E. Nageswara Rao*

# కారుసాల శ్రీనివాసులు

## వరల్డ్ మార్క్సిస్టు రివ్యూ

అరబిక్, బెంగాలీ, బల్గేరియా, జెక్, డానిష్, ఇంగ్లీష్, ఫినిష్, ఫ్రెంచి, జర్మన్, గ్రీకు, గుజరాత్, హిబ్రూ, హిందీ, హంగేరియన్, ఇండోనీషియన్, ఇటాలియన్, జపనీస్, మళయాళం, మంగోలియన్, నార్వేజియన్, ఒరియా, పర్షియన్, పోలిష్, పోర్చుగీసు, పంజాబ్, రుమేనియన్, రష్యన్, సింగళీస్, స్పానిష్, స్వీడిష్, టాగాలోగ్, తమిళం, టర్కిష్, వియత్నామీస్ భాషలలో కూడ వెలువడుతున్నది.

విడి ప్రతి —రూ. 1–50 పైసలు
సంవత్సర చందా —రూ. 15/-

# కమ్యూనిజం

*సంపాదకవర్గం :*

వై. విజయకుమార్
తమ్మారెడ్డి సత్యనారాయణ
ఈడ్పుగంటి నాగేశ్వరరావు

ఉప్పుగంటి నాగేశ్వరరావు

# ఆధునిక రివిజనిస్టు ధోరణులు

మార్క్సిస్టు తత్వవేత్తలుగా ప్రసిద్ధులయిన కొంతమంది మేధావులలో ఇటీవల విభిన్న రకాల పెడధోరణులు వ్యక్తమవుతున్నాయి. కొంతకాలం క్రితం బ్రిటిష్ మేధావి మారిస్ కారన్ ఫోర్త్ (ఇటీవల చనిపోయాడు) తన గ్రంథం 'ఫిలాసఫీ అండ్ కమ్యూనిజం' లో మార్క్సును అర్థశాస్త్రవేత్తగా, సామాజిక శాస్త్రవేత్తగా, మహా మేధావిగా గౌరవించగలం; ఆ రంగాలలో మార్క్స్ భావాలు శాస్త్రీయమైనవి అని అంటూ అయితే మార్క్సును తత్వవేత్తగా పరిగణించలేం అనే విమర్శకు పూనుకున్నాడు. మార్క్స్ "ప్రపంచ దృక్పథా"న్ని మారిస్‌కారన్ ఫోర్త్ ప్రశ్నించినట్టు సమీక్షకులు రాస్తున్నారు.

మరొక బ్రిటిష్ మేధావి జాన్ లెవిస్, ఫ్రెంచి తత్వవేత్త లూయీ అల్తూజర్ మార్క్సిజంలోని కొన్ని అంశాలను విమర్శిస్తూ గతంలో రాశారు. తత్వశాస్త్రంలో వ్యక్తమయిన ఇట్టి రివిజనిస్టు ధోరణులను ఖండిస్తూ అనేకమంది మార్క్సిస్టు పండితులు విమర్శనాత్మక వ్యాసాలు రాశారు.

ఇపుడు పోలిష్ ప్రముఖుడు ఆడం స్కాఫ్ "భిన్నమార్గాల కూడలిలో కమ్యూనిస్టు ఉద్యమం" అనే గ్రంథంలో సోషలిస్టు విప్లవాలను, సోషలిజం విజయాలను ప్రశ్నించినట్టు సోవియట్ తత్వవేత్త గ్రానోవ్ తెలుపుతున్నాడు.

ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమం సంక్షోభంలో వుందని, ఇప్పటి వరకు వివిధ దేశాలలో వచ్చిన సోషలిస్టు విప్లవాలు, ఆ దేశాలలో సామాజిక, ఆర్థిక, సాంస్కృతిక పరిస్థితులు పరిపక్వత దశకు చేరక మునుపే జరిగాయని, ఇది మార్క్స్ భావనకు విరుద్ధమని స్కాఫ్ విమర్శించాడు. ఈ దేశాలలో సోషలిజం

"తిరోగమన దశ" లో వుంది అని పేర్కొన్నాడు. దీనినే "విప్లవం పరాయీకరణ" గా ఆ ఘనమైన వ్యక్తి వర్ణించాడు.

మార్క్సిజం సమగ్ర సిద్ధాంతం. దీనిలో ప్రధాన విభాగాలు మూడు. తత్వశాస్త్రం, అర్థశాస్త్రం, శాస్త్రీయ సోషలిజం. మార్క్స్ భావాల శాస్త్రీయతకు పునాది రెండు ఆవిష్కరణలు. ఒకటి చారిత్రక భౌతిక వాదం. రెండోది అదనపు విలువ సిద్ధాంతం. మార్క్స్ అనుసరించిన పరిశీలన పద్ధతి శాస్త్రీయ మైనది. మార్క్స్ ప్రధాన రచన అన్నింటిలోనూ స్పష్టమైన "ప్రపంచ దృక్పథం" వున్నది. "జర్మన్ ఐడియాలజీ" "థీసిస్ ఆన్ ఫ్యూర్ బాహ్" "గ్రండ్రిస్" "కాపిటల్" లాంటి గ్రంథాలు మార్క్స్ తాత్విక భావాల సంపదతో నిండివున్నాయి.

మార్క్స్ విప్లవ సిద్ధాంతాన్ని విప్లవకార్యాచరణ నుండి వేరుచేసి చూశలేం. సోషలిస్టు విప్లవం, పెట్టుబడిదారీ వ్యవస్థ అంతర్గత వైరుధ్యాల నుండి ఉద్భవిస్తుందని మార్క్స్ చెప్పాడు; ఆయా దేశాలలో సోషలిస్టు విప్లవం వచ్చే అవకాశాలను గురించి మార్క్స్ ఎన్నడూ పిడివాద ధోరణితో ఆలోచించలేదు. మార్క్స్ చివరి కాలంలో నాటి రష్యాలో వున్న పరిస్థితులను ఆసక్తితో పరిశీలించి సోషలిస్టు విప్లవానికి గల అవకాశాలను పేర్కొన్నాడు.

సోషలిస్టు విప్లవ విజయానికి ఒక స్థాయి "నాగరికత" వుండవలసిన ప్రాధాన్యతను గురించి లెనిన్ పలుమార్లు స్పష్టీకరించాడు. దాని అర్థం పెట్టుబడిదారీ నాగరికత వుచ్ఛదశకు చేరుకున్న దేశాలలో మాత్రమే సోషలిస్టు విప్లవం వచ్చి తీరాలి అని మార్క్స్ లేదా లెనిన్ ఎన్నడూ అనలేదు. ఆ దేశాలలో బూర్జువాజీకి గల అనుభవం శక్తి సామర్థ్యాలను తక్కువ అంచనా వేయరాదని లెనిన్ పదే పదే హెచ్చరించాడు.

పోలెండ్‌లో, చైనాలో సోషలిజం నిర్మాణంలో సంభవించిన తీవ్ర తప్పిదాలను చూపించి, "వెనుకబడిన" దేశాలలో సోషలిస్టు విప్లవం వస్తే అది, నెలలు నిండక ముందే ప్రసవించిన వికృత ఆకారపు బిడ్డగా పోల్చటం అచారిత్రక దృక్పథాన్ని తెలియపరుస్తోంది.

ఆడం స్కాఫ్ ప్రబోధించే నాగరిక "సోషలిజం" లో భిన్న వర్గ రాజకీయ పార్టీల వ్యవస్థ వుంటుంది; శాస్త్ర సాంకేతిక విప్లవం కారణంగా, రాబోయే 20 సంవత్సరాలలో అభివృద్ధి చెందిన పెట్టుబడిదారీ దేశాలలో "పెట్టుబడిదారీ వ్యవస్థ డొల్లిపోతుంది" దాని అర్థం పెట్టుబడిదారీ వ్యవస్థ క్రమంగా సోషలిస్టు వ్యవస్థగా పరిణామం చెందుతుంది. కనుక విప్లవం అవసరం లేదు అనే నిర్ధారణకు వచ్చాడు.

ఆధునిక రివిజనిజంలో ఇది ఒక ధోరణి మాత్రమే.

* * *

# క్షీణిస్తున్న రాజకీయ సిద్ధాంతాలు, విలువలు

ఇటీవల "న్యూస్ టైమ్" పత్రికా విలేకరులు కొంతమంది రాజకీయ ప్రముఖులతో, "మేధావులు : రాజకీయాలు" అనే అంశంపై ఇంటర్‌వ్యూ చేసి వారి అభిప్రాయాలను ప్రకటించారు. ఎమ్. ఎన్. గోవిందన్‌నాయర్ పి. సి. చుందర్, పి. సి. సేన్, మధుదండావతే, ఎమ్. ఎల్. సోంధీ, వావిలాల గోపాలకృష్ణయ్యలు—వీరందరూ రాజకీయాలలో మేధావుల పాత్ర సన్నగిల్లటంపై ఆవేదన వ్యక్తం చేశారు. మహాత్మాగాంధీ ఏ ఉన్నత విలువలకై పోరాడారో, అట్టి ఆదర్శాల ఒరవడిలో ప్రజల మానసిక దృష్టిని మరల్చేందుకు మేధావులు ప్రయత్నించాలని పి. సి. చుందర్ చెప్పగా కారల్‌మార్క్స్, గాంధీ, ఎం ఎన్. రాయ్, జయప్రకాష్‌లు మహనీయులని శ్రీ సి. సి. సేన్ పేర్కొంటూ, పార్టీ రహిత ప్రాతిపదికగా ఎన్నికలు నిర్వహించిననాడే ప్రత్యక్ష ప్రజాస్వామ్యం వేళ్ళూనుతుందని అన్నారు.

కమ్యూనిస్టు ఉద్యమ ప్రముఖుడు ఎం. ఎన్. గోవిందన్‌నాయర్, నిష్కర్షగా చెప్పిన అభిప్రాయాలు యిలా వున్నాయి. "మా తరం తప్పులు చేసింది ఏ పార్టీ, ఏ నాయకుడు సాకులు చెప్పనవసరంలేదు. స్వాతంత్ర్య యోధులలో మొదటితరం వారు ఆదర్శాలకొరకు పోరాడారు. స్వాతంత్ర్యం సాధించారు. మా తరం వారికి స్వాతంత్ర్యం అందించారు. వీరు అధికారం పుచ్చుకున్నారు. ఆదర్శాన్ని విసర్జించారు.

"…. ….స్వాతంత్ర్యానంతరం కాలంలో రాజకీయ సిద్ధాంతం కూడ దెబ్బతింది. వ్యక్తి పూజా ధోరణులు ప్రబలటం, పార్టీలలో వరుసగా చీలికలు రావటం, —యీ కారణంగా సిద్ధాంతప్రేరణ, ఉత్తేజం కోల్పోయాం. …. …. …. …. చిత్తశుద్ధి కలిగినవారు రాజకీయాలనుండి దూరంగా జరిగిపోతున్నారు."

ఈ కుళ్ళునుండి బయటపడేది ఎలా అన్న ప్రశ్నకు
గోవిందన్‌నాయర్ సమాధానం యిలా ఉంది.

"అవును. రాజకీయ సిద్ధాంతాలు నిలదొక్కుకోవాలి. రాజకీయరంగం నుండి అవకాశవాదాన్ని, పదవీకాంక్షను పారద్రోలేందుకు పూనుకోవాలి. అది జరుగుతుంది సిద్ధాంత పునాదిగల కమ్యూనిస్టు ఉద్యమం మాత్రమే, ఇతర స్వార్థరహిత ప్రజాతంత్ర శక్తులతో కలిసి, ప్రస్తుత రాజకీయ జీవితానికి ప్రత్యామ్నాయాన్ని యివ్వగల్గుతుంది."

* * * *

# నూతన ప్రాంతంలో పార్టీ విస్తరణ

పార్టీ నిర్మాణాన్ని విస్తరింప చేయటానికి ఆయా ప్రాంతాల నిర్దిష్ట పరిస్థితులను అర్థం చేసుకుని, సరియైన పోరాటరూపం, పద్ధతులను ఎన్నుకుంటే, దానికి

తగిన కార్యక్రమలను తయారు చేసుకుంటే తక్కువ శ్రమతో ఎక్కువ ఫలితాలను పొందవచ్చు.

నెల్లూరుజిల్లా సూళ్ళూరుపేట తాలూకా, పార్టీ నిర్మాణరీత్యా, ఇతర విధాలా చాల వెనుకబడిన ప్రాంతం. చేనేత కార్మికుల కుటుంబాలు హెచ్చు సంఖ్యలో ఉన్న ప్రాంతం. గత రెండు మూడు సంవత్సరాలుగా, పట్టెమార్పు ఎగుమతి స్తంభించిపోయినందున, ఆర్థికంగా వేలాది చేనేత కుటుంబాలు సమూలం విరిగి పోయినట్లయింది. ఇలా దాగా దెబ్బతిన్న ప్రాంతాలలో సూళ్ళూరుపేట తాలూకా, సత్యవీడు (చిత్తూరుజిల్లా) తాలూకా వగైరాలు వున్నాయి. గత సంవత్సరం యీ ప్రాంతాలలో యీ సంక్షోభ పరిస్థితులపై పార్టీ, చేనేత సంఘాలు పెద్ద ఆందోళన నిర్వహించాయి. అవి మంచి ప్రభావాన్ని కల్గించింది. అలాగే కొంత మంది యువకులు, ప్రజానాట్యమండలి, ఇతర సాంస్కృతిక కార్యక్రమాల ఆకర్షణ ద్వారా ఎర్రజెండాకు దగ్గరయ్యారు. ఇది పూర్వరంగం.

ఈ సంవత్సరం ఆ తాలూకాలో పార్టీ రాజకీయ పాఠశాల నిర్వహించి, పార్టీ కార్యకలాపాలను విస్తృత పరచుకోవాలనే ఆలోచన తాలూకా నాయకత్వానికి కొంతకాలంగా ఉంటూ వచ్చింది. ఆ తాలూకాలో ప్రప్రథమ రాజకీయ పాఠశాల నిర్వహణకు తాలూకా నాయకత్వం పూనుకొంది. జిల్లా నాయకత్వ సహాయంతో సూళ్ళూరుపేట పట్టణంలో నిధి వసూళ్ళకు పూనుకున్నారు. మంచి ప్రోత్సాహం లభించింది.

పాఠశాల జరిపే దేగవారికండ్రిక గ్రామంలో, ఆ చుట్టుప్రక్కల గ్రామాలలో వస్తురూపేణా, ధనరూపేణా ఆశించిన దానికన్నా ఎక్కువ వసూళ్ళు జరిగాయి. దీనికి తోడు ఆ గ్రామంలో మంచినీటి బావి పూడ్చే ప్రయత్నాన్ని నిరోధించటంలో పార్టీ సఫలీకృత మవటంతో పార్టీ ప్రతిష్ట ఇనుమడించింది.

జూన్ 12, 13, 14 తేదీలలో రాజకీయ పాఠశాల జరిగింది. విద్యార్థుల సంఖ్య 70 లేదా 80 వరకు అంచనా వేసుకుంటే, 120 వరకు పెరిగింది. 13 గ్రామాలనుండి హాజరయ్యారు. చివరిరోజు మధ్యాహ్నం చుట్టుప్రక్కల గ్రామాల నుండి 100 మంది యువకులు సైకిళ్ళపై ఆ గ్రామం చేరుకుని సమావేశమయి యువజన సంఘం ఏర్పాటు చేసుకోవాలని నిర్ణయించుకున్నారు. ఇది Spontaneousగా జరిగింది.

ఆ రాత్రి బహిరంగసభకు చుట్టూర వున్న గ్రామాలనుండి పెద్ద సంఖ్యలో ప్రజలు హాజరయ్యారు.

గత 20 సంవత్సరాలుగా ఆ ప్రాంతంలో ఇట్టి బహిరంగసభ జరగలేదు. యువజనసంఘం, రైతుసంఘం నిర్మాణానికి పునాదులు ఏర్పడ్డాయి. పార్టీవైపు యువకులు గణనీయమైన సంఖ్యలో ఆకర్షితులవుతున్నారు.

* * *

# దేశ రాజకీయ పరిణామాలు

## (1984 ఏప్రిల్‌లో జరిగిన జాతీయసమితి, దేశ రాజకీయ పరిస్థితిపై ఆమోదించిన తీర్మానం)

ఇటీవల కాలంలో జాతీయ రాజకీయ పరిస్థితి మరింత ఆందోళనకరంగా తయారయింది. మన దేశ భద్రతకు ప్రమాదం మరింత పెరిగింది. ఈ నివేదికలో మొతకుముందే తీవ్ర ఆందోళనా భరితమైన అంతర్జాతీయ పరిస్థితిని, మన జాతీయ భద్రతకు ముప్పును చర్చించే సమయంలో ఈ విషయం గూర్చి యిప్పటికే చెప్పి ఉన్నాము.

### జాతీయ ఐక్యతకు ప్రమాదం

దేశం లోపల విచ్ఛిన్నకర శక్తులు తమ కార్యకలాపాలను ఉధృతంచేసి దేశ ఐకత్యకు తీవ్ర ప్రమాదం తెచ్చిపెడుతున్నాయి. పంజాబ్ పరిణామాలలో వచ్చిన కొత్త మలుపుపట్ల ఇరుగు పొరుగు రాష్ట్రాలలో ప్రత్యేకించి హర్యానాలో వచ్చిన దాని పర్యవసానాలపట్ల దేశవ్యాపితంగా గల దేశభక్తియుత, లౌకిక, ప్రజాతంత్ర శక్తులు తీవ్రంగా వ్యధ చెందుతున్నాయి. ప్రస్తుతం పంజాబ్ పరిస్థితి అనేక ప్రమాదకర అంశాల కలగూరగా వుంది.

ఒకటి — తీవ్రవాదులు హత్యాకాండను ఉధృతంచేసి ప్రతిచోటా భయోత్పాతం కలుగచేస్తున్నారు. వారు తమ కార్యకలాపాలను ఢిల్లీ వరకు విస్తరించారు. ఢిల్లీ ఎఫ్. డి. పి. సి. అధ్యక్షుడు మాన్‌చంద్ హత్య దీనినే తెలుపుతున్నది. స్త్రీలు, పిల్లలతో సహా ఎన్నో అమాయక ప్రాణాలు బలైనాయి. ప్రసిద్ధ ప్రగతిశీల పత్రిక "ప్రీత్‌లారి" యువ సంపాదకుడు సుజిత్‌సింగ్‌ను వారు హత్య చేశారు. రాజ్యసభ సభ్యుడు విద్యావేత్త అయిన డాక్టర్ తివారీని చండీఘర్‌లో వారు హత్య చేశారు. ప్రజా జీవితంలోని అనేకమంది ప్రముఖులకు, సి. పి. ఐ; సి. పి. ఐ (ఎం) లకు చెందిన పంజాబ్ నాయకులతో సహా అనేకమందికీ బెదిరింపు లేఖలు వ్రాశారు.

రెండు — అకాలీదళ్ నాయకత్వం తీవ్రవాదులను ఖండించకపోగా పవిత్ర స్థలమైన స్వర్ణ దేవాలయంలో వారికి రక్షణ యివ్వకుండా వుండకపోగా భారత రాజ్యాంగంలోని 25 వ ప్రకరణాన్ని తగలబెట్టే ప్రమాదకర మార్గాన్ని చేపట్టింది. ఈ విచ్ఛిన్నకర పద్ధతిని అనుసరించవలదని ప్రతిపక్షంలోని వామపక్ష, ప్రజాతంత్ర పార్టీలు యిచ్చిన సలహాను అంగీకరించడానికి వారు తిరస్కరించారు. తద్వారా వారు ప్రజాతంత్రయుత జాతీయ మనోభావాల నుండి పంజాబ్ సమస్యకు పరిష్కా-

రాన్ని ప్రబోధిస్తున్న వారందరినుండి తమకు తాముగా ఏకాకులయినారు. అకాలీ నాయకత్వం మతతత్వంతో కూడిన అటువంటి వైఖరులను చేపట్టడంద్వారా పంజాబ్ సమస్యను జటిలంచేసి తీవ్రతరం చేసింది.

మూడు—హర్యానాలో రాష్ట్ర ప్రభుత్వ (ముఖ్యమంత్రి భజన్‌లాల్ కవ్వింపు ప్రకటనలతో కూడా) కుమ్మక్కుతో ఆర్. ఎఫ్. ఎస్, బి. జె. పి. ల నాయకత్వంలో మతతత్వ శక్తులు సిక్కు వ్యతిరేక ఘటనలను సృష్టించాయి. కొందరు కాంగ్రెస్ (ఐ) వాదులు కూడా అందులో చేయి కలిపారు. ప్రతీకార చర్యలకు పానిపట్ ప్రధాన కేంద్రమయింది. కర్నాల్, జింద్, యమునానగర్ వంటి మరికొన్ని యితర కేంద్రాలలో కూడా తీవ్రమైన ఘటనలు జరిగాయి.

నాలుగు—పంజాబ్ ఘటనలను తమ మతతత్వ ప్రయోజనాలకు వినియోగించుకునేందుకు బి. జె. పి., ఆర్. ఎస్. ఎస్. లు యిప్పుడు చాలా చురుకుగా పని చేస్తున్నాయి. పంజాబ్ హత్యలకు వ్యతిరేకంగా పంజాబ్, హర్యానా, హిమాచల ప్రదేశ్, ఢిల్లీ, జమ్మూలలో బంద్‌లకు పదేపదే పిలుపులివ్వడం ద్వారా సిక్కు వ్యతిరేక ఉన్మాదాన్ని రెచ్చగొట్టడం ద్వారా మతపరమైన విభజన తీసుకొచ్చేందుకు అది పూర్తి శక్తిని వినియోగిస్తున్నది. 'ఏప్రిల్ 9 న అది అఖిల భారత నిరసన దినం పాటించి దేశంలోని వివిధ ప్రాంతాలలో సభలు జరిపింది. వారు మత మనోభావాలను పెద్ద ఎత్తున రెచ్చగొడుతున్నారు.

అయిదు—పంజాబ్‌లో మినీ ఎమర్జెన్సీ విధించి సి. ఆర్. పి., బి. ఎస్. ఎఫ్ వంటి అర్ధ సైనిక దళాలను ప్రవేశపెట్టినప్పటికీ పాలనా యంత్రాంగం కుప్ప కూలింది. ప్రజలు తమ శక్తి మేరకు తమకు తాము రక్షించుకోవలసి వస్తున్నది. ఇక్కడి తీవ్ర సంక్షోభాన్నుండి రాజకీయ లబ్ధిపొందే ప్రయత్నంలో ఎన్. డి. ఎ. పంజాబ్ సమస్యపై సత్యాగ్రహం నిర్వహిస్తున్నది. ఇది పరిస్థితిని మరింతగా తీవ్రతరం చేస్తుంది.

చివరగా—పంజాబ్ తగలబడుతూంటే శ్రీమతి గాంధీ ప్రభుత్వం వినాశకరమైన తన దిగజారుడు విధానాన్ని కొనసాగిస్తూ విలువైన కాలాన్ని కోల్పోతున్నది; తీవ్రవాదులు, మతతత్వ శక్తుల చేతులలోనికి చొరవ వెళ్ళిపోవడానికి అనుమతిస్తున్నది. పంజాబ్ సమస్య కేవలం శాంతి భద్రతల సమస్యకాదు. చిత్తశుద్ధితో కూడిన రాజకీయ దృక్పథాన్ని, తక్షణ రాజకీయ పరిష్కారాన్ని అది డిమాండ్ చేస్తున్నది. నిర్మాణాత్మక వైఖరిని అనుసరిస్తూ ఒక పరిష్కార మార్గాన్ని ప్రతిపాదించిన (దీనితో అకాలీ నాయకత్వం అంగీకరించింది) వామపక్ష, ప్రజాతంత్ర ప్రతిపక్ష పార్టీల సహాయం తీసుకోడానికి శ్రీమతి గాంధీ తిరస్కరించారు.

దిగజారుడు విధానాన్ని యింకా కొనసాగించడం దేశ ఐక్యత, సమగ్రతలకు వినాశకారి అవుతుందని మన పార్టీ దృఢంగా అభిప్రాయపడుతున్నది. భింద్రన్

వాలేతో, అతని మనుషులతో మెతకగా వ్యవహరించే ప్రయత్నాలన్నీ మానుకోవాలని, అతని టెర్రరిస్టు ముఠాలపై సమర్థవంతమైన తీవ్ర చర్యలు తీసుకోవాలని, అన్నిరకాల మత హింసాకాండను అణచివేయాలని మనం కోరుతున్నాం. ద్వైపాక్షిక చర్చల పునఃప్రారంభాన్ని మనం డిమాండ్ చేస్తున్నాం. అందులో పాల్గొనడానికి అకాలీ నాయకత్వం తిరస్కరించినట్లయితే అపరిష్కృతంగా వున్న భౌగోళిక నదీ జలాల సమస్యకు సంబంధించి ప్రభుత్వం ప్రతిపక్షాల సహాయంలో ఒక అభిప్రాయానికి వచ్చి తన నిర్ణయాలను ప్రకటించాలి.

రాజ్యాంగంలోని 25 వ ప్రకరణాన్ని సవరించే విషయాన్ని పరిశీలించడానికి సిద్ధంగా వున్నామని ప్రభుత్వం ఈ రోజు ప్రకటించింది. అకాలీ నాయకత్వం తమ 'అజాద్ పంత్' ఆందోళనను విరమించడం మంచిదయింది.

పంజాబ్, హర్యానాలలోని మన పార్టీ యూనిట్లు తీవ్రవాదులను, మతోన్మాదులను ఎదుర్కోవడానికి హిందూ-సిక్కు సామరస్యాన్ని పరిరక్షించడానికి ప్రశంసార్హమైన కృషి చేస్తున్నాయి. సి. పి. ఐ; సి. పి. ఐ. (ఎం), జనతాపార్టీ, కాంగ్రెస్ (ఎస్)ల పిలుపుపై ఫిబ్రవరి నెలలో లూధియానాలో జరిపిన బ్రహ్మాండమైన సభకు దాదాపు లక్షమంది ప్రజలు హాజరుకావడం హిందూ, సిక్కు ఐక్యతకు గొప్ప ప్రతీక. ఈ గొప్ప సభ, ప్రదర్శనకు మన పార్టీ చేసిన కృషి అన్నిటికన్నా మిన్నగా ఉంది; ఈ పార్టీల జాతీయ నాయకులు ఆ సభలో ప్రసంగించారు. ఎ. ఐ. టి. యు. సి. ప్రతినిధివర్గం దాని ప్రధాన కార్యదర్శి నాయకత్వాన పంజాబ్‌లో పర్యటించి అనేకచోట్ల పెద్ద పెద్ద సమావేశాలు జరిపింది.

అమృతసర్, జలంధర్, పాటియాలా, భటిండా వగైరాలతోసహా పంజాబ్‌లోని అనేక యితర కేంద్రాలలో సమైక్యంగాను, అలాగే పార్టీ తనకుతాను స్వతంత్రంగాను ప్రదర్శనలు, శాంతి యాత్రలు జరిపింది. వాస్తవానికి, పార్టీ నిర్వహించిన ఐక్య శాంతి యాత్రలు, సమావేశాలు పంజాబ్ అంతటా ఉన్న చిన్న పట్టణాలలో సైతం జరిగాయి. వర్గ ఐక్యతలను, హిందూ, సిక్కు సామరస్యాన్ని పరిరక్షించడంలో పట్టణాలలో కార్మికవర్గం క్రియాశీలంగా పనిచేస్తున్నది. పంజాబ్‌లో మన పార్టీ నిర్వహిస్తున్న పాత్ర విస్తృత హర్షామోదాలను పొందుతున్నది. ఇతరత్రా మనపార్టీ మిత్రులు కానివారు కూడా ఈ కృషిని అభినందిస్తున్నారు. హర్యానాలో కూడా మన పార్టీ యూనిట్ అనేక ప్రాంతాలలో ప్రత్యేకించి కల్లోలిత కేంద్రాలలో సమావేశాలు జరుపుతున్నది. విచ్ఛిన్నకర శక్తులు అత్యంత తీవ్రమైన ప్రతీకార చర్యలకు పానిపట్‌లో పాల్పడినందున పానిపట్‌లోని మన కామ్రేడ్స్ మరింత క్రియాశీలంగా పనిచేస్తున్నారు. పానిపట్ చుట్టుపట్ల పట్టణాలు, గ్రామీణ ప్రాంతాలలో మన కామ్రేడ్స్ చురుకుగా సమావేశాలు, ప్రదర్శనలు జరుపుతున్నారు.

ఢిల్లీనుండి హుస్సేనీవాలాకు (బ్రిటిష్‌వారు అమరజీవి భగత్‌సింగ్‌ను వురి తీసిన తర్వాత దహనం చేసిన ఈ ప్రాంతం పాకిస్తాన్‌కు సరిహద్దుకు చేరువలో వుంది) యువజన, విద్యార్థులు నిర్వహించిన సైకిల్ యాత్ర (ఎ. ఐ. వై. ఎఫ్., ఎ. ఐ. ఎస్. ఎఫ్. దీనిని నిర్వహించాయి) పంజాబ్‌లోని తీవ్ర పరిస్థితి, హర్యానాలో దాని పర్యవసానాల పూర్వ రంగంలో ఒక ముఖ్యమైన ఘటన. పంజాబ్ జిల్లాలనుండి మూడు యువజన యాత్రలు కూడా హుస్సేనీవాలాకు సాగాయి: ఒకటి-కాత్ అల్ కలన్ (సర్దార్ భగత్‌సింగ్ జన్మస్థలం)కు సాగింది. భింద్రన్ వాలే మద్దతుదారులు వీటిలో రెండింటిపై దాడి చేసినప్పటికీ యీ యాత్రలు 200 గ్రామాలను తాకుతూ మొత్తం 1200 కిలో మీటర్లు ప్రయాణించి మార్గ మధ్యంలో 67 సభలు నిర్వహించాయి. భగత్‌సింగ్, రాజగురు, సుఖదేవ్‌ల చిత్ర పటాలను చేబూని సాగిన ఈ యాత్రలు ఐక్యతా సందేశాన్ని వ్యాప్తి చేశాయి; జాతీయ ఐక్యతను విచ్ఛిన్నం చేయడానికి, మతపరమైన మార్గాలలో ప్రజలను విభజించడానికి ప్రయత్నిస్తున్న శక్తులకు వ్యతిరేకంగా ప్రజలను ఉద్బోధ చేశాయి. వీటన్నిటికి పరాకాష్టగా హుస్సేనీవాలాలో చాలా పెద్ద సభ జరిగింది—యిది ఏ రాజకీయ పార్టీ నిర్వహించిన సభకన్నా పెద్దది.

పంజాబ్, హర్యానా రెండింటిలోను తీవ్రవాదులకు, మతతత్వ వాదులకు వ్యతిరేకంగా మనం ప్రజా ఉద్యమాన్ని కొనసాగిస్తూనే, అదే సమయంలో 1983 జూన్ నాటి ప్రతిపక్ష సమావేశాల సూత్రీకరణ ప్రాతిపదికపై సమస్యకు తక్షణ రాజకీయ పరిష్కారం కనుగొనాలని వత్తిడి చేస్తున్నాం. అటువంటి పరిష్కారం లేనిదే తీవ్రవాదులను, మతతత్వ వాదులను ఏకాకులను చేయడం కష్టం. పాలక కాంగ్రెస్ (ఐ) వర్గాలలో ఈ గుర్తింపు కనిపించకపోవడం ఆశ్చర్యంగా వుంది. వారి దిగజారుడు విధానం సమస్యను మరింత జటిలం చేసింది. గత సంవత్సరం సులువుగా వుండేది ఇప్పుడు మరింత కష్టంగా తయారయింది. మరింత జాప్యం జరిగితే అది యింకా కష్టతరమవుతుంది.

జమ్ము, కాశ్మీర్‌లోని డాక్టర్ ఫరూక్ అబ్దుల్లా ప్రభుత్వం పట్ల శ్రీమతి గాంధీ, ఆమె పార్టీవారు చూపుతున్న శత్రుపూరిత వైఖరి లౌకిక, ప్రజాతంత్ర విలువలను అభిలషించే వారందరికీ, మిగతా దేశంతో కాశ్మీర్ ప్రజల సమైక్యతా క్రమం మరింత పటిష్టం కావాలని కోరుకుంటున్న వారందరికీ తీవ్ర ఆందోళన కలిగించే విషయంగా వుంది. కర్నాటకలో లాంటి కాంగ్రెస్ (ఐ) యేతర ప్రభుత్వాలను కూలద్రోసే ప్రయత్నం, లేక పశ్చిమ బెంగాల్ వామపక్ష సంఘటన ప్రభుత్వం పట్ల వివక్ష (ఉదాహరణకు బ్యాంక్ ఓవర్ డ్రాఫ్ట్ విషయంలో) చూపడం చాలా చెడ్డవే. అయితే సున్నితమైన సరిహద్దు రాష్ట్రమైన జమ్ము, కాశ్మీర్ లాంటి దానిలో కాంగ్రెస్ (ఐ) ఇటువంటి ప్రయత్నం చేయడం ప్రమాదకరమైన విషయం; ఈ

రాష్ట్రంలో జమాతే-ఇస్లామి అంజుమన్ తుల్బా, మీర్ వైజ్ ప్లెబిసైట్ ఫ్రంట్ లతో సహా పాకిస్తాన్ లాబీ వుంది; ఇక్కడ తలెత్తే అన్ని రకాల పరిస్థితులను తమ దుర్మార్గపు ప్రయోజనాలకు వాడుకోవడానికి ప్రయత్నిస్తున్నారు.

ఈ ప్రయత్నం కనీసం ప్రస్తుతానికైనా ఓటమి పొందడం హర్షణీయం. ప్రతిపక్ష పార్టీల సమావేశం తీసుకున్న దృఢమైన వైఖరి, అటువంటి వినాశకర వైఖరికి వ్యతిరేకంగా గవర్నర్ బి. కె. నెహ్రూ విజ్ఞతతో యిచ్చిన సలహా ఈ పరిణామానికి ఎంతగానో తోడ్పడ్డాయి. కాంగ్రెస్ (ఐ) ప్రోత్సహించిన ఆందోళనకు కాశ్మీర్‌లోయలో ప్రజల తోడ్పాటు లభించకపోవడం. నేషనల్ కాన్ఫరెన్స్ నుండి ఫిరాయింపులు చేయించడానికి జి. ఎం. షా చేసిన ప్రయత్నాలు ఘోరంగా విఫలంకావడం ఇందుకు తోడ్పడిన యితర అంశాలు.

అయితే ప్రభుత్వం ఈ విధానాన్ని పూర్తిగా విడిచిపుచ్చలేదు. బి. కె. నెహ్రూ స్థానే ఢిల్లీ లెఫ్టినెంట్ గవర్నర్ జగ్‌మోహన్‌ని (చెప్పుచేతలలో నడిచే బ్యూరోక్రాట్) నియమించడం ఈ కూల్చివేత వ్యూహంలో నూతన దశకు సంకేతం.

శ్రీమతి గాంధీ, ఆమె పార్టీ జాతీయ సమగ్రత లక్ష్యానికి తోడ్పడనటువంటి ప్రమాదకరమైన ఆటను జమ్మూ కాశ్మీర్‌లో ఆడుతున్నారని మనం మరోసారి నొక్కిచెప్పదలిచాం. ఇది విచ్ఛిన్నకర మతతత్వ శక్తులకు మాత్రమే తోడ్పడుతుంది. ఈ విధానాన్ని విడనాడేలా ఆమె పార్టీపై వత్తిడి తేవాలి.

అస్సాం సమస్య యింకా అపరిష్కృతంగానే వుంది. వాతావరణంలో సానుకూల మార్పు వచ్చినప్పటికి శ్రీమతి గాంధీ ప్రభుత్వం దానిని పరిష్కరించడానికి ఈ అవకాశాన్ని వాడుకోవడంలేదు. ఇక్కడ కూడా దిగజారుడు విధానం కొనసాగుతున్నది.

ఇటీవల ఎన్నికల ప్రధానాధికారి ఏర్పాటుచేసిన సమావేశంలో ఓటర్ల జాబితాల పునర్వ్యవస్థీకరణ సమస్యపై కొంత స్థూల ఏకాభిప్రాయం వచ్చింది: అదేమంటే 1971 జాబితాలను ప్రాతిపదికగా తీసుకుని వాటిని సరిదిద్దడం. ఒక సి.పి.ఐ. మాత్రమే మినహాయింపును తెలియజేసింది. అస్సాంలోని ప్రతిపక్ష పార్టీలు (సి. పి. ఐ, జనతా, కాంగ్రెస్ (ఎస్), ఆర్. సి. పి. ఐ) ఈ నెల మొదటివారంలో సమావేశమై 1971 ఓటర్ల జాబితాల ప్రాతిపదికగా వాటిని పునర్వ్యవస్థీకరించాలన్న వైఖరిని, అక్రమ కాందిశీకుల ఆర్డినెన్స్, 1983 క్రింద గుర్తించబడిన విదేశీయుల పేర్లను తొలగించాలని ఆమోదించాయి. సంప్రదింపుల ద్వారా పరిష్కారాన్ని అవి డిమాండ్ చేశాయి.

శ్రీమతి గాంధీ ప్రభుత్వం చొరవ తీసుకున్నట్లయితే ఈ వైఖరి ద్వారా అస్సాం సమస్యపై పురోగతి సాధించే అవకాశముంది. అయితే, ఈ వైఖరిని ఆమోదించక పోవడంలో కాంగ్రెస్ (ఐ)కీ స్వార్థప్రయోజనం వున్నట్లు కనిపిస్తున్నది. 1979 ఓటర్ల జాబితాలు ప్రాతిపదికగా వుండాలని అది భావిస్తున్నది. అందువల్ల ప్రస్తుతానికి ప్రతిష్టంభన కొనసాగుతున్నది. ఇది ఈశాన్య ప్రాంతంలోని వేర్పాటువాద శక్తులకు, విదేశీయుల సమస్యపై ఆందోళనను వినియోగించుకుని అస్సాంలో పునాదు లేర్పరచుకున్న ఆర్. ఎస్. ఎస్, బి. జె. పి. లకు మాత్రమే ఉపయోగపడుతుంది.

ఆర్. ఎస్. ఎస్. కు ముసుగు సంస్థ అయిన విశ్వహిందూ పరిషత్ స్పష్టమైన ముస్లిం వ్యతిరేక లక్ష్యంతో (హిందువులను ఐక్యపరచే ముసుగు క్రింద, నిర్వహించిన 'ఏకాత్మత యజ్ఞం", లేదా దేశ సంచార యాత్రలు మన పార్టీకి యితర లౌకిక శక్తులకు తీవ్ర ఆందోళన కలిగించాయి. దేశంలో రాజకీయ వాతావరణాన్ని బరితెగించి మతపరం గావించే యీ యత్నం గూర్చి ముందుగా హెచ్చరిక చేసిందీ, లౌకిక ప్రజాతంత్ర శక్తులను అప్రమత్తం చేసిందీ మనమే. దీనికి ప్రారంభంలో దురదృష్టవశాత్తు శ్రీమతి గాంధీ, ఆమె పార్టీ వారి ఆశీర్వచనాలు వున్నాయి. తమ ప్రమాదకర పథకంలో ముందుకు వెళ్ళడానికి విశ్వహిందూ పరిషత్‌కు ఇది ధైర్యాన్ని యిచ్చింది.

అయితే ఆర్. ఎస్. ఎస్. ప్రోద్బలం వున్నటువంటి విశ్వహిందూ పరిషత్‌కు పెద్ద ఆశలే వున్నాయని, ఆ పథకాలలో అది సఫలీకృతమయితే దేశ లౌకిక ప్రజాతంత్ర భవితవ్యం ముక్కచెక్కలవుతుందని ఆ తదుపరి గుర్తించబడింది. తదుపరి దశలో శ్రీమతి గాంధీ, కాంగ్రెస్ (ఐ)కి చెందిన మరికొందరు ముఖ్యులు, అలాగే లౌకిక ప్రతిపక్ష పార్టీల నాయకులు కొందరూ, యాత్ర పథకాలకు వ్యతిరేకంగా బహిరంగ ప్రకటనలు చేయడం మంచిదయింది. కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు ఈ యాత్రకు ఆదరణ చూపడాన్ని యివి నిరోధించింది. బి. జె. పి ఈ యాత్రను పూర్తిగా బలపరిచి అందులో చురుకుగా పాల్గొన్నది.

తద్వారా ప్రమాదకర పరిస్థితి నివారించబడింది. ఈ ప్రమాదాన్ని నివారించడంలో మన పార్టీ, మరికొన్ని యితర లౌకిక శక్తులు (కాంగ్రెస్ (ఐ) లోని కొందరితో సహా) గణనీయమైన దోహదం చేశాయి.

ముందుడుకు వాదులైన హిందూ మతతత్వవాదులు ముస్లింలకు వ్యతిరేకంగా విచ్ఛిన్నకర ప్రచారం సాగిస్తున్నారు. హిందూ, ముస్లిం మూఢ మతవాదులు మత విభజన తీసుకురావడానికి ప్రయత్నిస్తున్నారు. తద్వారా దేశ ఐక్యతకు జరిగే ప్రధాన పోరాటాన్ని, మెరుగైన జీవితం కొరకు ప్రజలు జరిపే పోరాటాలను విచ్ఛిన్నం చేస్తున్నారు.

అయినప్పటికి, విశ్వ హిందూ పరిషత్ హిందూమత పునరుద్ధరణ పథకాలతో ముందుకు సాగుతూనే వుంది; ఆర్. ఎస్. ఎస్. మత కలహాలను ప్రోత్సహించేందుకు పరిస్థితులను వాడుకుంటున్నది. లౌకిక ప్రజాతంత్ర శక్తులందరనీ,—వారు ఏ పార్టీలో వున్నప్పటికీ—సమీకరించడం ద్వారా దీనిని ఎదుర్కొనవలసి వుంది.

మత రంగంలో మరోవైపున జమాతే–ఇస్లామి, దాని యువజన, విద్యార్థి విభాగమైన ఎస్ ఐ ఎం ఐ (స్టూడెంట్స్ ఇస్లామిక్ మూవ్‌మెంట్ ఆఫ్ ఇండియా)ల నాయకత్వాన గల ముస్లిం మతతత్వ శక్తులు ముస్లింలతో తమ లౌకిక వ్యతిరేక, ప్రజాతంత్ర వ్యతిరేక కార్యకలాపాలను ఉధృతం చేశాయి. అదే సమయంలో ఇండియన్ యూనియన్ ముస్లింలీగ్, ముస్లింమజ్లిస్, ఇత్తేహాద్–వుల్ – ముస్లిమీన్‌లతో కూడిన ఒక ముస్లిం ఐక్య సంఘటన యిప్పుడు ఏర్పడింది. ముస్లిం మతతత్వ శక్తుల కలయికతో ఏర్పడిన యీ ఫ్రంట్ ముస్లింలలోని కాంగ్రెస్ వ్యతిరేక అసంతృప్తి (వివక్ష మతకలహాల కారణంగా) ఉపయోగించుకుని ఎన్నికలలో కాంగ్రెస్ (ఐ)తో బేరసారాలాడటంతో సహా ఆ మతస్తుల ప్రతినిధి అవుతున్నది. ముస్లిం యునైటెడ్ ఫ్రంట్ అలాగే జమాయత్ – ఎ – ఇస్లామిలు చేస్తున్న యీ ప్రయత్నమంతా వామపక్ష, ప్రజాతంత్ర జాతీయ ప్రధాన స్రవంతి నుండి ముస్లింలను దూరంగా వుంచడానికి ఉద్దేశించబడింది.

పెరుగుతున్న మతతత్వం జాతీయ ఐక్యతకు, సమగ్రతకు మరొక సవాలుగా పరిణమిస్తున్నది. అయితే, ప్రధాన ప్రమాదం ఆర్. ఎస్ ఎస్; బి జె పి లు నాయకత్వం వహిస్తున్న హిందూమత పునరుద్ధరణ శక్తులనుండే వస్తున్నది. అయితే ముస్లింలలో మతతత్వ శక్తులు చేస్తున్న కార్యకలాపాలను మనం విస్మరించజాలము.

మన పార్టీ రాజకీయంగా, సైద్ధాంతికంగా దీనిని ఎదుర్కోవాలి. దీనికి వ్యతిరేకంగా పోరాడాలి. ఇందుకుగాను, మన దేశ లౌకిక, ప్రజాతంత్ర స్వరూపాన్ని కాపాడుకోవాలని ఆకాంక్షించే ఆరోగ్యకర, లౌకిక శక్తులందరితో చేయి, చేయి కలుపడానికి మనం సిద్ధం కావాలి.

## కాంగ్రెస్ (ఐ) పాత్ర, దాని విధానాల ప్రభావం

కాంగ్రెస్ (ఐ) అతి పెద్ద రాజకీయ పార్టీగా, కేంద్రంలో, అత్యధిక రాష్ట్రాలలో పాలక పార్టీగా వున్నందున దేశ అంతరంగిక దుర్గతులకు ప్రధాన బాధ్యత కలిగివున్నది. పంజాబ్, జమ్మూ, కాశ్మీర్, అస్సాంల విషయంలో కాంగ్రెస్ (ఐ) వైఫల్యాలను, హిందూ మతతత్వం పట్ల, దాని మెతక వైఖరిని గూర్చి–యిదంతా వచ్చే ఎన్నికల పై చూపుతోనే – ఈ నివేదికలో యింతకు మునుపు భాగంలో మేము చెప్పివున్నాం.

జాతీయ భద్రత, జాతీయ ఐక్యత సెక్యులరిజం పరిరక్షణ సమస్యలపై జాతీయ ఏకాభిప్రాయ సాధన కొరకు వామపక్ష ప్రజాతంత్ర శక్తులు సుముఖతను వ్యక్తం చేశాయి. బొంబాయి ఎ ఐ సి సి సమావేశంలో ఈ విషయం గూర్చి మాట్లాడిన శ్రీమతి గాంధీ, ఆమె పార్టీ, తదుపరి దానినుండి వెనక్కు వెళ్ళి తన విధానాలే (ఆంతరంగిక, విదేశాంగ విధానాలు రెండూ) జాతీయ ఏకాభిప్రాయంగా వుంటాయని ప్రకటించింది ; ఆమె దేశీయాంగ విధానాలను వ్యతిరేకించేవారు. ఆమె విదేశాంగ విధానానికి మాట మాత్రపు తోడ్పాటు మాత్రమే యిస్తున్నారని ఆమె భావన. జాతీయ ఏకాభిప్రాయం సాధ్యమయ్యే సమస్యలపై సైతం జాతీయ ఏకాభిప్రాయాన్ని శ్రీమతి గాంధీ కోరుకోవడంలేదు.

శ్రీమతి గాంధీతోసహా పాలక పార్టీ నాయకులు ప్రదర్శిస్తున్న అనుసరించరాని తలబిరుసుతనానికి 1983 డిసెంబరులో కలకత్తాలో జరిగిన కాంగ్రెస్ (ఐ) ప్లీనరీ సమావేశం మరో తార్కాణం. (కాంగ్రెస్ పార్టీ నూరు సంవత్సరాల చరిత్రలో ప్రతినిధులు ఎన్నుకోబడకుండా నామినేట్ చేయబడిన మొట్టమొదటి ప్లీనరీ సమావేశం యిదే !) దేశీయ రంగంలో అంతా అద్భుతంగా వున్నట్లు చిత్రించారు. కాంగ్రెస్ గతంలో సాధించిన దాని గురించి చాలా గొప్పలు చెప్పుకొని భవిష్యత్‌కు సంబంధించి గొప్పగొప్పగా కనిపించే వాగ్దానాలు చేశారు. ప్రతిపక్షాలపై వామపక్ష, ప్రజాతంత్ర ప్రతిపక్షంతో సహా దుర్మార్గపు దాడిని ప్రారంభించారు.

అయితే, తానొక్కటే (ప్రస్తుత రూపంలోని కాంగ్రెస్ (ఐ)) దేశానికి స్వాతంత్ర్యం తీసుకొచ్చాననీ, తానొక్కటే స్వాతంత్ర్యానంతరం దేశాన్ని అభివృద్ధి చేశాననీ, దేశాన్ని కాపాడగల,ఐక్యంగా వుంచగల సామర్థ్యం తానొక్కరికే వున్నదని గొప్పలు చెప్పుకోవడం అత్యంత అభ్యంతరకరమైన విషయం : అట్టి అహంకార వాదనలు చారిత్రకంగా అవాస్తవికమైనవి. స్వాతంత్ర్య పోరాటంలో యితర ధోరణులకు ప్రాతినిధ్యం వహిస్తున్న చిట్టగాంగ్ తిరుగుబాటు, హెచ్ ఆర్ ఎస్ ఎ అన్నిటికీ పతాక ఘటనగా జరిగిన ఆర్ ఐ ఎన్ తిరుగుబాటు, దానికిముందు జరిగిన అనేకానేక వీరోచిత ఘటనలు, సంఘటిత రైతు, కార్మిక, విద్యార్థి ఉద్యమం నిర్వహించిన పాత్రలను విస్మరించే ప్రయత్నం జరుగుతున్నది. భారతదేశ ఐక్యత కొరకు, దాని భద్రతకొరకు ప్రజలలోగల ఆకాంక్షను తన ఎన్నికల ప్రయోజనాలకు వాడుకోవాలని కాంగ్రెస్ వాంఛిస్తున్నది; అయితే, మరో వైపున అది అధికారంలో వున్న రాష్ట్రాలలో రాజకీయ సమస్యలను పరిష్కరించడంలో అది విఫలమయింది; వాటిని విచ్ఛిన్నకర శక్తులు ఉపయోగించుకుంటున్నాయి.

అటువంటి అహంభావం రానున్న లోక్‌సభ ఎన్నికలకు సన్నాహంగా, అవి ఎప్పుడు జరిగినప్పటికీ, కాంగ్రెస్ (ఐ) నాయకత్వం ప్రారంభించిన తీవ్రమైన ప్రచారంలో భాగం మాత్రమే కాదు, కాంగ్రెస్ (ఐ) దుష్పరిపాలన క్రింద బాధ

లనుభవిస్తూ పెద్ద పోరాటాలతో సహా వివిధ రూపాలలో తమ అసంతృప్తిని వ్యక్తం చేస్తున్న ప్రజా బాహుళ్యం దృష్టిని మరల్చడానికి గూడా అవి ఉద్దేశించ బడింది.

ప్రజలను వేధిస్తున్న ఏ ఒక్క సమస్యను పరిష్కరించడంలో కూడా కాంగ్రెస్ (ఐ) స్థూలంగా వైఫల్యం చెందింది. ఆహారధాన్యాల ఉత్పత్తి, రికార్డు స్థాయిలో జరిగిన సంవత్సరంలో కూడా ధరలు పెరుగుతూనే వున్నాయి; దొంగ నిల్వదారులు, లాభతృష్ణాపరులపై గట్టి చర్యలు తీసుకోవడానికీ, శక్తివంతమైన ప్రభుత్వ పంపిణీ వ్యవస్థను నిర్మించడానికి ప్రభుత్వం తిరస్కరించడమే యిందుకు కారణం. సంక్షోభంతో కొట్టుమిట్టాడుతున్న పెట్టుబడిదారీ ఆర్థిక వ్యవస్థకు నిరుద్యోగులకు ఉపాధిచూపే సమర్థత లేనందున ఎంప్లాయిమెంట్ ఎక్స్ఛేంజీలలో పేర్లు నమోదు చేసుకునే నిరుద్యోగుల (విద్యాధిక నిరుద్యోగులతో సహా) సంఖ్య నిరంతరం పెరుగుతూనే వుంది భారతీయ పెట్టుబడిదారీ వ్యవస్థ చరిత్రలో మున్నెన్నడూ లేనంతటి స్థాయిలో రిట్రెంచ్‌మెంట్‌లు, లాకౌట్‌లు, లే ఆఫ్‌లకు పెట్టుబడిదారులు పాల్పడుతున్నారు. పెట్టుబడిదారీ వర్గ ఈ చట్ట విరుద్ధ చర్యలపై, చర్య తీసుకోవడానికి ప్రభుత్వం చేసింది నామమాత్రమే.

వాస్తవానికి, ప్రభుత్వ ప్రస్తుత విధానం కార్మికులను నిరాశా నిస్పృహలకు గురి చేసేదిగా దీర్ఘకాలంపాటు సమ్మెలు చేయవలసి వచ్చేట్లు చేసేదిగా వుంది. కాంగ్రెస్ (ఐ) ప్రభుత్వ కార్మికవర్గ వ్యతిరేక వైఖరి కఠినమవుతున్నది.

వ్యవసాయ సంస్కరణలను పూర్తిగా విడనాడి 25 అంశాల కార్యక్రమం గూర్చి పటాటోప ప్రచారం చేస్తున్నారు. అయితే, సమాజంలోని బలహీన వర్గాలకు అందిస్తున్న సహాయాన్ని వాస్తవిక దృష్టితో చూస్తే గణనీయమైన పురోభివృద్ధి ఏదీ వున్నట్లుగా కాంగ్రెస్ (ఐ) ప్రభుత్వం చెప్పుకోజాలదు. దాని అమలు యంత్రాంగం నిరంకుశాధికార వ్యవస్థపై ఆధారపడి ఉన్నందున అవినీతి పుష్కలంగా పెరిగింది; మధ్య దళారులు చాలా సొమ్ము తినేస్తున్నారు.

ప్రభుత్వ రంగాన్ని అభివృద్ధి చేసే విధానాన్ని భారత ప్రభుత్వం బలహీనపరచుతున్నది. టెలి కమ్యూనికేషన్ సామాగ్రి ఉత్పత్తి యిప్పటివరకూ ప్రభుత్వ రంగంలో వుంటూండగా ఇటీవలనే ప్రయివేట్ రంగానికి బహుళజాతి కంపెనీలకు దాని ద్వారాలు తెరచింది. విద్యుదుత్పాదన రంగంలో కూడా ప్రయివేట్ రంగాన్ని అనుమతించాలని భారత ప్రభుత్వంపై వత్తిడి పెరుగుతున్నది. ఇది ప్రమాదకర ధోరణి. దీనికి వ్యతిరేకంగా పోరాడవలసి వుంది.

ఉన్నత స్థానంలో అవినీతి పెరుగుతున్నది. అంతూలే వ్యవహారం సముద్రంలో నీటిబొట్టు మాత్రమే. కాంగ్రెస్ (ఐ) లోని అనేకమంది వ్యవహారం

పటు అవుతుందని (అగ్రస్థానాలలోని కొందరితో సహా) భయపడిన పాలక పార్టీ కేంద్ర నాయకత్వం అత్యంత సిగ్గుమాలిన పద్ధతిలో అంతూలేని (మహారాష్ట్ర అసెంబ్లీలో సవరణ తీసుకురావడం ద్వారా అతనిని రక్షించాలని) బయట పడవేయాలని ముందు నిర్ణయించింది. అయితే, ఆ తరువాత, ప్రజలు దీనిని మ్రింగడం దుర్లభమని, ప్రతిపక్షాలకు మందుగుండు దొరకుతుందని గుర్తించి వెనుకడుగు వేసింది. ఇప్పుడు కోర్టులో కేసు నడుస్తున్నది. కాంగ్రెస్ (ఐ) లోని ఒక ముఠా మరో ముఠాను ఏ విధంగా ఎండగడుతున్నదో ఈ విచారణ సందర్భంగా బయట పడుతున్నది. చివరి మాట యింకా చెప్పబడలేదు.

కాంగ్రెస్ (ఐ) ఏ రాష్ట్ర శాఖ కూడా ముఠా తగాదాలకు దూరంగా లేదు. ఆ మాటకొస్తే పాలక పార్టీలో ముఠా కుమ్ములాటలు అత్యంత తీవ్రమైనాయి. శక్తివంతమైన శ్రీమతి గాంధీ కూడా దానిని అదుపు చేయలేక పోతున్నది. కాంగ్రెస్ (ఐ) ముఠా తగాదాలకు విధాన సంబంధమైన విభేదాలేవీ కారణం కావని గుర్తించుకోవాలి. ఈ ముఠాలకు కారణం అధికార దాహం, ధనదాహం.

కాంగ్రెస్ (ఐ) ఏతర ప్రభుత్వాల పట్ల అసహనం, కొన్ని బూర్జువా ప్రజాస్వామ్య సూత్రాల ప్రకారం కూడా నడచుకోవటానికి తిరస్కరించడం కాంగ్రెస్ (ఐ) పాలనలో మరొక గమనార్హమైన లక్షణం అవుతున్నది. ప్రజాతంత్రయుతంగా ఎన్నికైన కాంగ్రెస్ (ఐ) యేతర ప్రభుత్వాలను కూలదోసే యత్నాలను యింకా విడనాడలేదు. ఒకసారి విఫలమైన కాంగ్రెస్ (ఐ) నాయకులు కొత్త ఎత్తుగడలకు పాల్పడుతున్నారు. ప్రజాతంత్ర శక్తులు అప్రమత్తంగా వుండాలి.

రాజకీయ, ఆర్థిక రంగాలు రెండింటిలోను వైఫల్యాలు, ప్రజలకు పెరుగుతున్న కడగండ్లు, కార్మికవర్గ వ్యతిరేక విధానాల తీవ్రత పెరుగుతూ వుండటం, ఉన్నత స్థానాల్లో అవినీతి తదితరాలు—ఇవన్నీ ప్రజలనుండి కాంగ్రెస్ (ఐ) మరింతగా దూరం కావడానికి దారితీస్తున్నాయి. వాస్తవానికి, పాలక కాంగ్రెస్ (ఐ) ప్రజా పలుకుబడి క్షీణించడం నిరంతర క్రమంగా వుంది. ఇటీవల కొన్ని రాష్ట్ర శాసనసభలకు, లోక్‌సభకు జరిగిన ఉప ఎన్నికల ఫలితాలు కాంగ్రెస్ (ఐ) ఓట్లలో మరింత తగ్గుదలను సూచిస్తున్నాయి. కీలకమైన హిందీ ప్రాంత రాష్ట్రాలైన ఉత్తరప్రదేశ్, బీహార్‌లలో యిది మరీ కొట్టొచ్చినట్లు వుంది.

అల్పసంఖ్యాక తరగతులు ప్రత్యేకించి ముస్లింలు కాంగ్రెస్ (ఐ) నుండి అధికాధికంగా వేరుపడుతున్న విషయాన్ని కూడా గమనించవలసి వుంది.

రాజ్యసభ ద్వైవార్షిక ఎన్నికల ఫలితాలు కాంగ్రెస్ (ఐ)కి తరగుతున్న పలుకుబడికి సరైన సూచికకాదు. రాష్ట్ర శాసనసభలలో దానికున్న బలానికి కుడి ఎడంగా అది సీట్లను గెలుచుకున్నది.

కాంగ్రెస్ (ఐ)కి పరిస్థితి అస్థిరంగా వున్న కారణంగా వచ్చే లోక్‌సభ ఎన్నికలను ఎప్పుడు జరపాలనే విషయంలో శ్రీమతి గాంధీ ఒక నిర్ణయానికి రాలేక పోతున్నారు. ఏది ఏమైనా, వూహాగానాల చదరంగంలో మన పార్టీ ప్రమేయం పెట్టుకోరాదు. మనకు ముఖ్యమైన విషయం బలమైన ప్రజా ఉద్యమాలను నిర్మించడం, ఏ పరిస్థితినైనా ఎదుర్కొనగల స్థితిలో వుండే రీతిలో పార్టీ నిర్మాణాన్ని పటిష్టం చేసుకోవడం.

## ప్రత్యామ్నాయం సమస్య

మెజారిటీ ప్రజలు మార్పును కోరుతున్నారు. కేంద్రంలోని ప్రస్తుత ప్రభుత్వం స్థానే మరొకటి కావాలని ఆకాంక్షిస్తున్నారు. అయితే మరే యితర రకాలైన ప్రత్యామ్నాయం కాకుండా కేవలం వామపక్ష ప్రజాస్వామిక ప్రత్యామ్నాయం మాత్రమే ప్రస్తుత పరిస్థితులలో అవసరాలను తీర్చగలదని గుర్తించాల్సి వుంది.

అయితే వామపక్ష ప్రజాస్వామిక దృక్పథంతో కూడిన ఒక సుస్థిరమైన ప్రత్యామ్నాయం యింకా ఆవిర్భవించలేదు. ఈ పరిస్థితిపై ప్రజలలో గందరగోళాన్ని సృష్టిస్తుంది. అది ఇందిరా కాంగ్రెస్‌కు ప్రయోజనకరమవుతుంది.

ప్రత్యామ్నాయం సమస్యపట్ల మన పార్టీ వైఖరి సుస్పష్టమే. మితవాద ప్రత్యామ్నాయాన్ని మనం కోరుకోము. మనం కృషి చేస్తున్న వామపక్ష ప్రజాస్వామిక ప్రత్యామ్నాయం యింకా ఆవిర్భవించాల్సి వుంది. అందువల్ల మనం సామ్రాజ్యవాద వ్యతిరేక వైఖరులను తీసుకునే, మన దేశ ప్రగతిశీల విదేశాంగ విధానాన్ని కొనసాగించే, బి.జె.పి. వంటి సామ్రాజ్యవాద అనుకూల మతతత్వ పార్టీలకు స్థానంలేని, మన ప్రజల తక్షణ సమస్యల పరిష్కారానికి జనామోద యోగ్యమైన చర్యలు తీసుకునే పార్టీల కలయికకు తోడ్పాటునిస్తాము.

అయితే వామపక్షేతర ప్రతిపక్ష పార్టీలు వచ్చే లోక్‌సభ ఎన్నికలను దృష్టిలో వుంచుకొని వివిధ రకాల మార్పులు, కలయికల కోసం ప్రయత్నిస్తున్నాయి.

ఈ పరిస్థితిలో వామపక్ష ప్రజాస్వామ్య శక్తుల ఐక్యతకు రాజకీయ ప్రాతిపదికగా వామపక్ష పార్టీలన్నీ కలిసి ఒక అంగీకృత కనీస కార్యక్రమాన్ని ప్రతిపాదించేందుకు వీలుగా మన పార్టీ ఒక కనీస కార్యక్రమాన్ని ప్రతిపాదించి ఈ ఐక్యత కోసం కృషి చేయాలి. వామపక్ష పార్టీలు యిలాంటి చొరవ తీసుకోవడం, దానికితోడు వివిధ ప్రజా డిమాండ్లపై, విధాన సమస్యలపై ప్రజా కార్యాచరణ, పోరాటాలు నిర్వహించడం ఎన్నికలకు ముందుగా ప్రస్తుతం సాగుతున్న వివిధ శక్తుల పునః పొందికకు మరింత సానుకూల ధోరణి నిచ్చేందుకు దోహదపడుతుంది.

సామ్రాజ్యవాద అనుకూల మరియు మితవాద అభివృద్ధి నిరోధక బి.జె.పి. విధానం, కమ్యూనిస్టులు మినహా మిగిలిన అన్ని ప్రతిపక్ష పార్టీలనూ ఐక్యం చేయడం వారి "జాతీయ ప్రజాస్వామిక ఫ్రంట్" అని చెప్పబడేది అదే. అంతిమంగా అలాంటి ఫ్రంట్‌పై తమ పెత్తనం సంపాదించుకోవడం బి.జె.పి. విధానం అన్నది అందరికీ తెలిసిందే. ఇది సాధ్యం కాకపోవడంతో ఆ పార్టీ ఎన్.డి.ఏ.ను ఏర్పరిచేందుకు లోక్‌దళ్‌తో పొత్తు కుదుర్చుకొన్నది. అయితే అది తన ప్రయత్నాలను మాత్రం వదులుకోలేదు. ఇండోర్‌లో, ఇటీవల అహ్మదాబాద్‌లో జరిగిన ఆ పార్టీ నాయకత్వం సమావేశాలు యిదే వైఖరిని మరోసారి పునరుద్ఘాటించాయి. వామపక్షేతర ప్రతిపక్ష పార్టీల మధ్య నెలకొనివున్న గందరగోళాన్ని ఈ దిశగా ఆ పార్టీ చక్కగా ఉపయోగించుకుంటున్నది.

అయిదు ప్రతిపక్ష పార్టీలతో (జనత, కాంగ్రెస్-ఎస్, డిఎస్‌పి, జనవాది పార్టీ, రాష్ట్రీయ కాంగ్రెసు) యునైటెడ్ ఫ్రంట్ ఏర్పడటం, ఆ తర్వాత రిపబ్లికన్ పార్టీకి చెందిన మూడు గ్రూపులు అందులో చేరడం ఒక సానుకూల పరిణామం ఈ ఫ్రంట్ పట్ల మనం మిత్ర ధోరణినే ప్రదర్శించాం.

విజయవాడలో జరిగిన మొదటి ప్రతిపక్షాల సమావేశం తర్వాత జరిగిన సమావేశాలు (ఢిల్లీ, శ్రీనగర్, కలకత్తా) కూడా ఈ కాలంలో జరిగిన ప్రాముఖ్యత కల్గిన పరిణామమే.

యునైటెడ్ ఫ్రంట్ ఏర్పాటు, ప్రతిపక్ష పార్టీల మూడు సమావేశాలలోని ముఖ్యమైన అంశాలేమంటే వాటిలో బి.జె.పి. మినహాయించబడటం, ప్రతిపక్షాలలోని లౌకిక, ప్రజాస్వామిక, భావాలుగల శక్తులనుండి కమ్యూనిస్టులను వేరు చేయాలని, తమ స్వంత ప్రయోజనాల కోసం ఈ శక్తులను ఉపయోగించుకోవాలని ప్రయత్నిస్తున్న బి జె పి యింతవరకు తానే (బి జె పి) ఏకాకి అయింది. ఈ పరిణామం ఏర్పడటానికి మన పార్టీ ముఖ్యమైన పాత్ర వహించింది. మనం ఈ విధానాన్ని మరింత ముమ్మరంగా అప్రమత్తంగా కొనసాగించాలి. బి.జె.పి. తిరిగి పుంజుకోకుండా చూడాలి.

అయినప్పటికీ రెండు ఎత్తుగడల మధ్య కమ్యూనిస్టులను వేరుచేయాలని బి.జె పి. ప్రయత్నిస్తుండటం, బి.జె.పి.ని ఏకాకిని చేయడానికి మన పార్టీ ప్రయత్నిస్తుండటం పోరాటం కొనసాగుతుందని మేము చెప్పగలుగుతున్నాం. యిది యింకా ఒక నిర్ణయాత్మక దశకు చేరలేదు.

ప్రతిపక్షాల ఐక్యత సమస్య యింకా అస్పష్టమైన స్థితిలోనే వున్నది. మొదటి విషయం-యునైటెడ్ ఫ్రంట్ యింకా అస్తిత్వంలోనే కొట్టుమిట్టాడుతున్నది. ఇది యింతవరకూ ఒక కార్యక్రమాన్ని కూడా రూపొందించుకోలేకపోయింది. ఇటీవలి

రాజ్యసభ, విధానపరిషత్‌ల ద్వైవార్షిక ఎన్నికల అభ్యర్థుల విషయంలో ఒక ఉమ్మడి అవగాహనకు రాలేకపోవటం యునైటెడ్ ఫ్రంట్ బలహీనతను బహిర్గతం చేశాయి.

మరో అంశం–జనతాపార్టీ యిటీవల పాట్నాలో జరిగిన ఆ పార్టీ ప్లీనరీ సమావేశంలో ప్రతిపక్షాల—ఐక్యత, త్రిముఖ వ్యూహం ఎ) జనతాపార్టీలో కొన్ని పార్టీల విలీనానికి ప్రయత్నించడం. బి) ఎన్నికల కోసం భావసారూప్యత గల పార్టీలలో ఐక్యత, సి) వామపక్షాలు, మితవాద పార్టీలతో సహా అన్ని యితర ప్రతిపక్ష పార్టీలతో ఎన్నికల సర్దుబాట్లు అన్న సిద్ధాంతాన్ని ముందు పెట్టింది.

మూడవది : కొన్ని బూర్జువా ప్రతిపక్ష పార్టీలు యిప్పటికీ "అన్ని ప్రతిపక్షాల ఐక్యత" అన్న భావనను కలిగి వున్నాయి. ఈ భావనను గత ఏడాది మేలో విజయవాడలో జరిగిన మొదటి ప్రతిపక్ష పార్టీల సమావేశంలోనే మన పార్టీ తిరస్కరించింది.

ఇవన్నీ ప్రజల మనస్సులలో గందరగోళాన్ని సృష్టిస్తాయి.

మన పార్టీ వామపక్ష లౌకిక ప్రజాస్వామిక శక్తుల ఐక్యత నిర్మాణం అన్న స్పష్టమైన లక్ష్యంతో ముందుకు వెళుతున్నది. దానికనుగుణంగానే పార్టీ రాజకీయ ఎత్తుగడలను రూపొందించుకోవడం జరుగుతున్నది. మొదటి అంశం : ప్రతిపక్షంలోకెల్లా అత్యంత అభివృద్ధి నిరోధక పార్టీ అయిన బి.జె.పి.ని ఏకాకిని చేయాలని, కమ్యూనిస్టులు మినహా మిగిలిన అన్ని ప్రతిపక్షాలను తన పథకాలలో భాగస్వాములను చేసుకోవాలని ఆ పార్టీ చేస్తున్న ప్రయత్నాలను బలహీనపర్చేందుకు మనం కృషి చేస్తున్నాం. రెండవది : మనం పట్టుదలతో సాగిస్తున్న కృషి వల్ల యిప్పటివరకు ఎన్.డి.ఎ. పార్టీలను ప్రతిపక్ష సమావేశాలకు దూరంగా వుంచటంలో మనం కృతకృత్యులయ్యాం. శ్రీనగర్ సమావేశం నాటికి మిగిలిన ప్రతిపక్షాలు కూడా ఈ విషయంలో దాదాపుగా మంచి వైఖరినే తీసుకున్నాయి.

మూడవది : ప్రజా సమస్యలపై ఐక్య ఉద్యమాలకుగాను మనం ప్రతిపక్ష పార్టీల నాయకులతో, కార్యకర్తలతో మంచి సన్నిహిత సంబంధాలను ఏర్పరచుకొంటున్నాం. అలాంటి ఐక్యత నిర్మాణంలో గత ఫిబ్రవరి 13 న దేశవ్యాపితంగా జరిగిన ఐక్య సమావేశాలు ఒక ముఖ్యమైన ముందడుగు.

నాలుగవది : విదేశాంగ విధాన సమస్యలపై కూడా మనం ఎనిమిది వామపక్ష ప్రజాస్వామిక పార్టీలను ఒకచోటుకు తీసుకురాగలిగాం. (ఉదా : ఈ ఏడాది మార్చి 8–9 తేదీలలో అణుయుద్ధ ప్రమాదానికి వ్యతిరేకంగా మన దేశ భద్రతకు ఏర్పడుతున్న ముప్పుకు వ్యతిరేకంగా జరిగిన జాతీయ సదస్సు) ఈ నివేదికలో యింతకుముందు చెప్పినట్లుగా ఈ సదస్సు ఒక స్పష్టమైన సామ్రాజ్యవాద వ్యతిరేక

వైఖరిని, రీగన్ ప్రభుత్వాన్ని, దాని మిత్ర దేశాలైన నాటో కూటమి దేశాలను ఖండించడం, అణుయుద్ధాన్ని నివారించడానికి సోవియట్ యూనియన్, వార్సాసంధి దేశాలు చేస్తున్న కృషిని బలపరచడం అన్న వైఖరి తీసుకొన్నది.

ఈ సదస్సు తర్వాత ఈ పార్టీల ఆధ్వర్యాన దేశమంతటా వివిధ ప్రాంతాలలో ఏప్రిల్ 13 న ఐక్య ప్రదర్శనలు సభలు జరిగాయి.

ఈ పంథా సరైనదని జీవితానుభవం రుజువు చేసింది. ముందుమార్గం సుగమంగా ఉంటుందనే భ్రమలేమి మాకు లేవు. ఇంతకుముందే వివరించినట్లుగా వివిధ రకాల ప్రతిఘటనలు ఒడుదుడుకులు ఉంటాయి. అందువల్ల భవిష్యత్తులో ఎన్నో ఒడుదుడుకులు ఎదురు కావచ్చు. సడలింపులతో కూడిన ఎత్తుగడలతో ఈ పంథాను కొనసాగిస్తాం. కాని లక్ష్యం (కనీస కార్యక్రమం ప్రాతిపదికగా వామపక్ష ప్రజాస్వామిక ఐక్యత నిర్మాణం) మాత్రం స్పష్టం.

## ప్రతిపక్షాల సమావేశాలు

సమీక్షా కాలంలో ప్రతిపక్ష పార్టీల సమావేశాలు రెండు జరిగాయి. ఒకటి శ్రీనగర్‌లో, రెండవది కలకత్తాలో. శ్రీనగర్ వరకూ ఈ సమావేశాలలో పాల్గొంటున్న పార్టీలు ముఖ్యమైన జాతీయ రాజకీయ సమస్యలను చర్చించి ఆ సమస్యలపై ఉమ్మడి వైఖరిని నిర్ణయించుకొంటూ వుండేవి. ఢిల్లీ ప్రతిపక్ష సమావేశంలో హాజరైన పార్టీలు పంజాబ్ సమస్య పరిష్కారానికి ఒక సూత్రాన్ని రూపొందించ గలిగాయి. (దానికి అకాలీదళ్ ప్రతినిధులు కూడా అంగీకరించారు) దానిని ప్రధాన మంత్రికి పంపించి, పంజాబ్ సమస్యకు పరిష్కారమార్గాన్ని కనుగొనేందుకు ప్రభుత్వానికి ప్రతిపక్షాల సహాయం వుంటుందని హామీ యివ్వడం జరిగింది. అయితే దానికి ప్రధాని నుండి ప్రతికూల సమాధానమే వచ్చింది.

శ్రీనగర్‌లో ఈ పార్టీలు కేంద్ర-రాష్ట్ర సంబంధాల పునర్వ్యవస్థీకరణను చర్చించాయి. వారొక ఏకగ్రీవ నిర్ధారణలకు వచ్చి ఒక పత్రాన్ని ఆమోదించారు. దానిని ప్రచురించటం కూడ జరిగింది. శ్రీనగర్ సమావేశం ఆమోదించిన పత్రం యొక్క ప్రాధాన్యత యేమంటే అది జాతీయ ఐక్యత, సమగ్రతలను నొక్కి చెప్పడమే. ఆ చట్రంలోనే కేంద్ర-రాష్ట్ర సంబంధాలను పునర్వ్యవస్థీకరించాలని ప్రతిపాదించబడింది. రెండవది : రాష్ట్రాలకు మరిన్ని అధికారాలను డిమాండ్ చేస్తూనే (ఎక్కువ ఆర్థికాధికారాలు, గవర్నర్ల అధికారాలపై ఆంక్షలు, ప్రజాస్వామ్యయుతంగా ఎన్నికైన రాష్ట్ర ప్రభుత్వాలను నిరంకుశంగా బర్తరఫ్ చేసే అధికారాలపై ఆంక్షలు, వగైరా) శ్రీనగర్ పత్రం బలమైన కేంద్రం వుండాల్సిన ఆవశ్యకతను కూడా నొక్కి చెప్పింది.

శ్రీనగర్ సమావేశంలో ప్రాంతీయ పార్టీల వైఖరి (కేంద్రానికి నాలుగు అంశాలు మాత్రమే వుండాలి. మిగిలిన అధికారాలన్ని రాష్ట్రాలకివ్వాలనే వైఖరి) అంగీకరించబడలేదు. యిక్కడ పేర్కొనాల్సి వుంది దానికి బదులు (ప్రాంతీయ పార్టీలు) జాతీయపార్టీలు ప్రతిపాదించిన వైఖరిని ఆమోదించాయి దాని ప్రాతిపదిక పైనే శ్రీనగర్ ఏకాభిప్రాయం వచ్చింది. ప్రాంతీయ తత్వవాదులను కొన్ని జాతీయ ప్రతిపక్ష పార్టీలు బలపరుస్తున్నాయని ఆరోపిస్తున్న వారికి యిది స్పష్టమైన చెంప పెట్టు.

కలకత్తా సమావేశం అంతకుముందు జరిగిన సమావేశాలకంటె ఎంతో ముఖ్యమైన పురోగతిని సాధించింది. ప్రజలెదుర్కొంటున్న లక్షణ సమస్యలపై (ధరల పెరుగుదల, నిరుద్యోగం, లేఆఫ్‌లు, లాకౌట్‌లు, వ్యవసాయ కార్మికులకు కనీస వేతనాలు, రైతాంగానికి వారి ఉత్పత్తులకు గిట్టుబాటు ధరలు వగైరా) కలకత్తా సమావేశం ఒక సామాజికార్థిక డిమాండ్ల పత్రాన్ని ఆమోదించింది. ఈ కోర్కెల పత్రం ప్రాతిపదికగా దేశవ్యాపిత ఐక్య ప్రజా ఉద్యమాన్ని నిర్మించాలని నిర్ణయించబడింది. ఈ డిమాండ్లను సభల-సమావేశాల ద్వారా ప్రజలముందుకు తీసుకు వెళ్ళేందుకు దేశవ్యాపిత నిరసనదినం పాటించుటకు ఫిబ్రవరి 13 ను ఎంచుకోవటం జరిగింది. ఫిబ్రవరి 13 న అన్ని రాష్ట్ర, జిల్లా కేంద్రాలలో, అనేక రాష్ట్రాలలో తాలూకా, స్థానిక స్థాయిలలో కూడా ఈ పిలుపును పాటించడం జరిగిందన్న విషయాన్ని గమనించడం అవసరం. ఐక్య ప్రజా ఉద్యమం నిర్వహణకు యిన్ని పార్టీలు సన్నిహితం కావడం యిదే మొదటిసారి.

అంతేగాక అనేక రాష్ట్రాలలో యిప్పటికే రాష్ట్రస్థాయి ఐక్య సదస్సులు జరిగాయి. ఆ సదస్సులలో మరికొన్ని స్థానిక డిమాండ్లను జోడించి కలకత్తా కోర్కెల పత్రాన్ని ఆమోదించారు.

ఏప్రిల్ 17 న ఢిల్లీలో అఖిలభారత సదస్సు జరిగింది. కలకత్తా సమావేశం డిమాండ్ల ప్రాతిపదికగా తర్వాతి దశ ఐక్యఉద్యమాన్ని సదస్సు చర్చించింది.

మన దృక్పథం నుండి ఈ సమావేశాలు వామపక్ష ప్రజాస్వామిక లౌకిక శక్తులను సన్నిహితంచేసే లక్ష్యాన్ని కొంత నెరవేర్చాయి. ఢిల్లీలో కానీ, శ్రీనగర్‌లో కానీ, లేదా కలకత్తాలో గానివ్వండి ఈ సమావేశాలలో పాల్గొన్న పార్టీలు దేశం ఎదుర్కొంటున్న సమస్యలపై ఏకాభిప్రాయానికి వచ్చాయి. ఈ ఏకాభిప్రాయం మరింత ఉన్నతమైన రాజకీయ వైఖరుల ప్రాతిపదికగా ఏర్పడింది. ఇది ముఖ్యమైనది.

మద్రాసు సమావేశానికి మనపార్టీ, సి. పి. ఐ. (ఎం) లు జాతీయఐక్యత, జాతీయ సమగ్రతలకు ఏర్పడుతున్న ముప్పును చర్చనీయాంశంగా సూచించాయి. కొన్ని యితర పార్టీలు కూడా దీనికి అంగీకరించాయి.

ఈ లోగా ఐక్య ప్రజా ఉద్యమాలు, రాజకీయ సంప్రదింపుల ద్వారా పసం అనుసరిస్తున్న పంథాను కొనసాగిస్తాము.

## ఆర్థిక పరిస్థితి

1984-85 సంవత్సర బడ్జెట్‌ను ప్రతిపాదించడంతో ఆరవ పంచవర్ష ప్రణాళికకు కేటాయింపులు పూర్తయ్యాయి. ఆరవ ప్రణాళికా పెట్టుబడులు ముందు అనుకున్న రు. 97,500 కోట్లకు బదులు రు. 110,000 కోట్లకు పైగా వుంటాయని అర్థికమంత్రి గొప్పగా చెప్పుకున్నారు. "ప్రస్తుత ప్రణాళికా కాలంలో అభివృద్ధి కార్యక్రమాలను వేగిర పరచడంలో విజయానికి ప్రతీక"గా దీనిని ఆర్థికమంత్రి చెప్పుకున్నారు.

ఇది అతిగా చెప్పుకోవడం మాత్రమే. గత ఏడాదిలో పార్లమెంట్‌కు సమర్పించిన ఆరవ ప్రణాళిక మధ్యంతర సమీక్ష పెట్టుబడుల వ్యయసూచీ పెరిగిందని అంగీకరించింది. ఇది 1980-81 లో 11 శాతం. 1981-82 లో 14 శాతం వున్నదని. ఆ రెండు సంవత్సరాలూ ఆంతరంగిక ద్రవ్యోల్బణం రేటు ఎక్కువగా వున్నందున యిది సంభవమైందని మధ్యంతర సమీక్ష పేర్కొంది. అందువల్ల వాస్తవ అంచనాలపై (అంటే 1979-80 ధరల ప్రాతిపదికగా) చూస్తే ప్రణాళికా పెట్టుబడి 25 నుండి 30 శాతానికి తగ్గినట్లు బోధపడుతుంది. మధ్యంతర సమీక్షా పత్రమే యిలా పేర్కొంది :"ప్రణాళికలోని మొదటి మూడు సంవత్సరాలలో పెట్టుబడుల తగుదల విద్యుత్, రైల్వేలు, ఇరిగేషన్, బొగ్గు, ఉక్కువంటి కొన్ని ప్రధానమైన ప్రాతిపదిక సౌకర్యాల కల్పనారంగాలలోనే కనిపిస్తున్నది." ఆ తర్వాతి సంవత్సరాలలో కూడా ఈ ధోరణిలో మార్పు వుంటుందని చెప్పడానికి తగిన పరిస్థితులు కనిపించలేదు.

ఆర్థిక వ్యవస్థ కీలక రంగాలలో ప్రభుత్వరంగ పెట్టుబడులు అంత ఎక్కువగా తగ్గిపోతే పురోగతి గణనీయంగా వుండడం ఏమాత్రం సాధ్యంకాని విషయం. ఆరవ ప్రణాళికా కాలంలో జాతీయాదాయంలో పురోగతి రేటు సరాసరి 5 4 శాతం వుంటుందనే అధికార ప్రకటనకు ఎలాంటి ప్రాతిపదిక లేనేలేదు. తీవ్ర దుర్భిక్షం వల్ల స్థూల జాతీయ ఉత్పత్తి 5.1 శాతం, వ్యవసాయోత్పత్తి 15.2 శాతం తగ్గిన 1979-80 సంవత్సరాన్ని ప్రాతిపదిక సంవత్సరంగా తీసుకున్న తప్పుడు పద్ధతి వల్ల ప్రభుత్వం ఈ లెక్కలను చూపెడుతుంది. ఉదాహరణకు స్థిర ధరల (1970-71) వద్ద స్థూల జాతీయోత్పత్తి సూచిక 1978-79 లో 277.3 పాయింట్ల వద్ద వుండగా అది 1980-81 లో 282.8 పాయింట్లకు, 1981-82 లో 296.7 కి 1982-83 లో 301.8 కి పెరిగింది. దుర్భిక్షంలేని అంతకుముందు సంవత్సరం—1978-79 ని ప్రాతిపదిక సంవత్సరంగా తీసుకున్నట్లయితే అప్పుడు ఆరవ పంచవర్ష ప్రణా

ళిక లోని మొదటి నాలుగు సంవత్సరాలలో జాతీయాదాయంలో పెరుగుదల రేటు దీర్ఘకాల ధోరణి రేటు 3.5 శాతానికి సమానంగా వుండి వుండేది.

ఈ ఏడాదిలో ఉత్పత్తి కాగలదని అంచనా వేస్తున్న 142-149 మిలియన్ల టన్నుల ఆహారధాన్యాల ఉత్పత్తికి ప్రభుత్వం ఎంతో గొప్పలు చెప్పుకుంటోంది. ఒకవేళ ఈ అంచనా సరైనదే అయినా 1984-85 సంవత్సరానికి 154 మిలియన్ల టన్నుల ఉత్పత్తిని లక్ష్యంగా నిర్ణయించిన ఆరవ ప్రణాళికా లక్ష్యానికంటె యిది ఎంతో తక్కువే. అంతేగాక కోయిల కూయగానే వసంతం వచ్చినట్లు కాదన్న రీతిన ఒక ఏడాది పంట బాగా ఉన్నంత మాత్రాన అది ఎలాంటి ఉత్పత్తి ధోరణిని నిర్ణయించదు. ఆరవ ప్రణాళికా పత్రం ప్రకారం దీర్ఘకాల ధోరణి పెరుగుదల రేటు 1950-51 మరియు 1978-79 ల మధ్య సంవత్సరానికి 2.7 శాతం మాత్రమే వున్నది. 1978-79 నుండి వ్యవసాయ ఉత్పత్తి సూచీ పాయింట్లు 1981-82 లో 142.7 మరియు 1979-80 లోని 116.9 పాయింట్ల మధ్య ఊగులాడుతున్నది. అందువల్ల పురోగతి రేటు ఈ ఏడాది పంటెలాగున్నప్పటికీ అదేవిధంగా (దాదాపు 2.7 శాతం) నిలచి వున్నది.

భారత వ్యవసాయక ఆర్థిక వ్యవస్థ యొక్క విలక్షణమైన స్వభావం ఏమిటంటే అదనంగా ఉపకరణాలను గుప్పించినకొద్దీ ఆ దామాషాలో ఉత్పత్తి పెరగకపోవడం. జాతీయ వ్యవసాయ కమిషన్ రూపొందించిన సూత్రం ప్రకారం 1985 లో ఆహారధాన్యాల ఉత్పత్తి మొత్తం దాదాపు 150 మిలియన్ టన్నులకు చేరాలి. ఈ లక్ష్యాన్ని చేరుకున్నట్లు చెప్పుకుంటున్న ప్రభుత్వ వాదన నిజమే అయినట్లయితే అది తలసరి లభ్యత పెరగడంలో, ప్రభుత్వం నిర్ణయించిన స్థాయికి బహిరంగ మార్కెట్ ధరలు తగ్గడంలో ప్రతిబింబించాలి. అంతేగాక యిక దిగుమతులు కూడా వుండరాదు. కానీ యివేవీ నిజమైనట్లు సూచించే ధోరణులు ఎక్కడా కనిపించడంలేదు.

జనాభా పెరుగుతున్న పూర్వరంగంలో వ్యవసాయ ఉత్పత్తులు ఈ మందకొడి పురోగతి యొక్క సహజ పర్యవసానమే. దిగుమతులు చేసుకొంటున్నప్పటికీ, పప్పులు, ఆహారధాన్యాల తలసరి లభ్యత 1979 లో ఉన్న 476.6 గ్రాముల నుండి 1983 లో 430 4 గ్రాములకు తగ్గింది. అందువల్లనే అధికార ప్రచారానికి భిన్నంగా గ్రామీణ ప్రాంతాలలో దారిద్ర్యం, ఆకలిచావులు పెరుగుతున్నాయి. వ్యవసాయార్థిక వ్యవస్థలో తీవ్రమైన వ్యవస్థాగత సంక్షోభం యొక్క ప్రతిబింబమే యిది. "హరిత విప్లవం" వల్ల కూడా యిది బాగుపడలేదు.

వ్యవసాయోత్పత్తులలో దాదాపుగా మాంద్యం ఏర్పడిన ఈ పరిణామాన్ని ఆర్థిక సలహాదారుల మండలి గుర్తించింది. బీహార్‌లో, కేంద్ర, తూర్పు భారత్ లోని యితర రాష్ట్రాలలో ఎక్కువగా అమలులో వున్న గైర్‌హాజరీ భూస్వామ్య విధానం, దాని సంబంధిత రూపాలైన పీడనకు గురిచేసే కౌల్దారీ విధానం యిప్పటికీ

దేశంలో ప్రధానం పంట అయిన ధాన్యం దిగుబడి ఉత్పత్తులలో మాంద్యానికి ఒక ప్రధాన కారణంగా ఈ మండలి విమర్శించింది. ఈ అనాగరిక పీడనకు గురిచేసే భూస్వామ్య విధాన పద్ధతికి భూ గరిష్ట పరిమితి చట్టాలు, భూసంస్కరణ చట్టాలను ఉద్దేశపూర్వకంగా పథకం ప్రకారం తూట్లు పొడిచే అధికార విధానం కొండంత అండగా వుంటున్నది. ఈ చట్టాల అమలుకు ఆరవ పంచవర్ష ప్రణాళిక మరియు "కొత్త" 20 అంశాల కార్యక్రమము ఒక నిర్ణీత తేదీని (మార్చి 31, 1985) లక్ష్యంగా నిర్ణయించాయి. కానీ ఆరవ ప్రణాళికలో నాలుగేళ్ళు, నూతన 20 అంశాల కార్యక్రమం రెండేళ్ళు గడిచిన తర్వాత 1978 లోనే మిగులు భూమిగా తేలుతుందని ప్రణాళికా సంఘం అంచనా వేసిన 215 లక్షల ఎకరాలలో పంచినది కేవలం 4.43 లక్షల ఎకరాలు మాత్రమే.

పారిశ్రామిక రంగంలో పరిస్థితి మరింత ఆందోళనకరంగా వుంది. ప్రాతిపదిక సంవత్సరం (1979-80) లో వ్యతిరేక పెరుగుదల రేటు (0.4 శాతం) వున్నప్పటికీ ఆ తర్వాతి సంవత్సరాలలో పెరుగుదల రేటు వరుసగా 4 శాతం 8.6 శాతం, 3.9 శాతం, 4.2 శాతం (ఏప్రిల్—డిసెంబరు 1983) వున్నది. పారిశ్రామిక ఆర్థిక వ్యవస్థలో అయిదింట నాలుగు వంతులకు ప్రాతినిధ్యం వహించే వస్తువుల తయారీ రంగంలో ఉత్పత్తి రేటు మరీ తక్కువగా 1982-83 లో 2.5 శాతం, 83-84 లో 4 శాతం మాత్రమే వున్నది. గత మూడేళ్ళలో మిగతా వాటి కంటే కొద్దిగా ఎక్కువ పురోగతి రేటు సాధించినది గనులు, క్వారీల త్రవ్వకలోనే ఇది వరుసగా గత మూడేళ్ళలో 15. 8, 10.8, 9 7 శాతం వున్నది. ఈ పురోగతిరేటు పెరుగుదలలో కూడా ఎక్కువ భాగం పెట్రోలియం క్రూడ్ ఉత్పత్తి బాగా పెరగడంవల్ల సాధించబడింది. క్రూడ్ ఉత్పత్తి 1979-80 లో వున్న 10 రి మిలియన్ టన్నులనుండి 1983-84 లో 26 మిలియన్ టన్నుల అంచనాకు చేరింది. బొగ్గు ఉత్పత్తి 1979-80 లో వున్న 104 మిలియన్ టన్నుల నుండి 1983-84 లో 139 మిలియన్ టన్నులకు చేరినప్పటికీ అది యింకా ఆరవ పంచవర్ష ప్రణాళికా లక్ష్యానికి 165 మిలియన్ టన్నులు తక్కువగానే వుంది. రైల్వేలు ఆదాయాన్ని ఆర్జించే సరుకుల రవాణా లక్ష్యం 309 మిలియన్ టన్నులకు చేరుకోవడంలో విఫలమైంది. దాదాపు 140 వేల మెగావాట్ల విద్యుదుత్పాదన శక్తిని ఏర్పాటుచేసి (ప్రస్తుతమున్న 28000 మెగావాట్ల ఉత్పాదక శక్తికి అదనంగా) గొప్ప విజయం సాధించినట్లు ప్రభుత్వం చెప్పుకుంటున్నప్పటికీ 1982-83 లో వాస్తవంగా ఉత్పత్తి అయిన విద్యుత్ కేవలం 130 వేల కోట్ల కిలోవాట్లు మాత్రమే. ఆ సంవత్సరానికి నిర్ణయించుకొన్న లక్ష్యం 191 వేల కోట్ల కిలోవాట్లు. ప్లాంట్ లోడ్ కూడా ఆరవ ప్రణాళికా కాలంలో 45-49 శాతానికి తగ్గింది. ఆరవ ప్రణాళికాంతానికి విద్యుత్ ఉత్పత్తి డిమాండ్ కంటే 10 శాతం తక్కువగా వుంటుందని అంచనా.

పారిశ్రామిక రంగం అధిక ప్రాజెక్టు వ్యయం. ఉత్పాదక శక్తిని తక్కువగా వినియోగించుకోవడం, నాణ్యతలేని, ఎక్కువ ధర పెట్టిన ఉత్పత్తులు, స్వదేశీ మార్కెట్ సక్రమంగా లేకపోవడం, రక్షణలతో బిగింపబడిన విదేశీ పెట్టుబడిదారీ మార్కెట్లలో పోటీకి నిలవలేకపోవడం, వీటన్నింటిపై ఉత్పత్తి పెంపు పేరుతో గుత్తాధిపతులకు, బహుళజాతి సంస్థలకు ఉదారంగా యిచ్చే "ప్రోత్సాహకాలు" నిరంతరం పెరుగుతూండడం మొదలైనటువంటి వ్యవస్థాగత [illegible] గురై వున్నది. ఫలితంగా పరిశ్రమలు ఎక్కువగా ఖాయిలా పడుతుండడం, మూసివేతలు, లాకౌట్లు, నిరుద్యోగం, నల్లడబ్బు వ్యాప్తి పెరుగుతున్నాయి. పారిశ్రామిక ఆర్థిక వ్యవస్థపై గుత్తాధిపతుల పట్టు పెరుగుతున్నది. ఉత్పత్తివల్ల పెరుగుతున్న విలువలో కార్మికుని వాటా తగ్గుతున్నది. ద్రవ్యోల్బణం వల్ల వేతనాలు హరించుకుపోకుండా రక్షించుకొనేందుకు కార్మికులు తీవ్రమైన దీర్ఘకాల పోరాటాలు జరపాల్సి వస్తున్నది.

ప్రభుత్వ అభివృద్ధి నిరోధక, దివాళాకోరు ఆర్థిక ద్రవ్య విధానాలకు ఒక స్పష్టమైన నిదర్శనం ద్రవ్యోల్బణం. 1980 జనవరిలో "పనిచేసే ప్రభుత్వం" అధికారానికొచ్చిన తర్వాత టోకు ధరలు 1980–81 లో 16.7 శాతం పెరిగాయి. 1981–82 లో మరో 2. 4 శాతం, 1982–83లో మరో 6.2 శాతం, 83–84 లో యింకా 10 7 శాతం పెరిగాయి. 1980 జనవరి–1984 జనవరి మధ్య కాలంలో టోకు ధరల పెరుగుదల మొత్తం సుమారు 43 శాతం. చిల్లర దుకాణాల స్థాయిలో ధరల పెరుగుదల యింకా ఎక్కువగా వున్నది. 1984–85 లో ద్రవ్యోల్బణం "ఒక్క అంకెలో మాత్రమే" (10 శాతానికి లోపు) వుండేలా చూస్తానని ఈ ప్రభుత్వం హామీ యిచ్చింది.

అమెరికా డాలర్‌తో మారకానికి సంబంధించి రూపాయి విలువ సుమారు 40 శాతం తగ్గడం, ద్రవ్యోల్బణంలో కూరుకుపోయివున్న పాశ్చాత్య పెట్టుబడిదారీ దేశాలనుండి ఎక్కువ ధర గల యంత్రాలను, ముడి పదార్థాలను దిగుమతి చేసుకోవడం, బాధ్యతా రహితంగా లోటు బడ్జెట్ విధానాన్ని అనుసరించడం (ఫలితంగా గత నాలుగేళ్ళలో ద్రవ్య చెలామణీ 60 శాతం పెరగడం, అదే కాలంలో స్థూల దేశీయ ఉత్పత్తి కేవలం 16 శాతం మాత్రమే పెరగగా..) బడ్జెట్‌తో సంబంధం లేకుండా పన్నుల సమీకరణకు విధాన చర్యగా అత్యవసర ఉపకరణాల ధరలను పదే పదే పెంచడం, అన్ని రకాల చట్టావ్యాపారులకు, లాభాకాంక్షపరులకు ఉదారంగా బ్యాంక్ ఋణాలు అందజేయడం, అన్నిటికీ మించి గ్రామీణ, పట్టణప్రాంతాలలోని అవసరమున్న వినియోగదారులకు సహేతుకమైన ధరలను నిర్ణయించి నిత్యావసర వినిమయ వస్తువులను సరఫరా చేయలేకపోవడం, మొదలైనవి ద్రవ్యోల్బణం విపరీతంగా పెరగడానికి దోహదం చేస్తున్న కారణాలు.

జాతీయాదాయాన్ని ధనికులకు తిరిగి పంపిణీ చేస్తూ ద్రవ్యోల్బణం భారత ఆర్థిక వ్యవస్థ సంక్షోభాన్ని మరింత తీవ్రతరం చేసింది. ఫలితంగా బాగా పెరిగిన అగ్రశ్రేణి గుత్తాధిపతుల ఆస్తులను ఒక వైపు సామాన్య మానవుల, పేదరికాన్ని మరో వైపు పెంచుతున్నది. ద్రవ్యోల్బణం స్వదేశీ మార్కెట్‌ను మరింతగా కుదింప జేస్తున్నది. లాకౌట్లు, మూసివేతల సంఖ్యను పెంచుతూ దారిద్ర్యాన్ని, నిరుద్యోగాన్ని తీవ్రతరం చేసింది. మూసివేయబడిన ఫ్యాక్టరీల సంఖ్య 2800 దాటింది. నమోదు చేసుకున్న నిరుద్యోగుల సంఖ్య 1979 డిసెంబరులోని 14 మిలియన్ల నుండి 21 మిలియన్లకు చేరింది.

ఆదాయపు పన్ను రేట్లలో 5 శాతం తగ్గింపు ద్వారా జీతాలపై బ్రతికే మధ్యతరగతి ప్రజల యిబ్బందులను తొలగించాలని ఆర్థిక మంత్రి అనుకున్నారు. కానీ లోతుగా పరిశీలిస్తే యిది కూడా ఎక్కువగా అధిక ఆదాయ వర్గాలకే ప్రయోజనకరంగా కనిపిస్తుంది. ఆదాయపు పన్ను చెల్లించే సామాన్య మధ్యతరగతి ఉద్యోగికి జరిగిన ప్రయోజనం కేవలం ఊహాజనితమైనదిగానే మిగులుతున్నది. సంపన్నవర్గాలు వినియోగించే కొన్ని వస్తువులపై(ఉదా: రిఫ్రిజిరేటర్లు, ఎయిర్ కండిషనర్లు, కలర్ టెలివిజన్ సెట్లు, ట్రెడెక్ టెక్స్‌టైల్స్) ఎక్సైజ్ సుంకంలో రిబేటు యివ్వడంకూడా నిజంగా మధ్యతరగతి ప్రజల జీవన పరిస్థితులను మెరుగుపరచడాని కుద్దేశించబడినది కాక, ఈ పరిశ్రమలలోని మాంద్యాన్ని తొలగించడాని కుద్దేశించి నది మాత్రమే. 1960 లోని 100 పైసలతో పోల్చిచూస్తే రూపాయి కొనుగోలు శక్తి 12.88 పైసలకు పడిపోయిన ప్రస్తుత పరిస్థితులలో ఈ చర్యలు పాక్షిక, పరిమితి చికిత్సగా మాత్రమే ఉపయోగపడగలవు.

దారిద్ర్య నిర్మూలన కార్యక్రమాలని చెప్పబడే వాటిని ద్రవ్యోల్బణం ఒట్టి బూటకంగా మార్చివేసింది. పేదలకు ఒక చేతితో యివ్వదలచుకున్న దానిని, పదే పదే మోపుతున్న భారం ద్వారా మరో చేతితో చక్రవడ్డీతో సహా గుంజుకోవడం జరుగుతుంది. ఫలితంగా ఈ దారిద్ర్య నిర్మూలన కార్యక్రమాల పెరుగుదలతో పాటే ప్రజల దారిద్ర్యం కూడా అతి వేగంగా పెరుగుతోంది.

వాస్తవానికి ప్రతి ఉత్పత్తి వ్యవస్థలోనూ పంపిణీ వ్యవస్థ కూడా యిమిడి వుంటుంది. ప్రజల దారిద్ర్యం మనదేశ సంక్షోభ భరిత ఆర్థిక వ్యవస్థలో అంతర్గత భాగంగా వుంది. ఆర్థిక వ్యవస్థను సమూలంగా సంస్కరించకుండా దానిని తొలగించడం సాధ్యం కాదు.

ఈ సైద్ధాంతిక నిర్ధారణల వెల్లుబడి యిటీవల దారిద్ర్య నిర్మూలన కార్యక్రమాల "విజయాల"కు సంబంధించిన ఒక వివాదం సందర్భంగా రుజువైంది. ఆరవప్రణాళికలోని మొదటిరెండు సంవత్సరాలలో 57 మిలియన్ల మంది ప్రజలను దారిద్ర్య రేఖ దిగువనుండి పైకి తీసుకు వచ్చినట్లు ప్రణాళికా మధ్యంతర సమీక్ష

పత్రం చెప్పుకున్నది. ఐ ఆర్ డి పి, ఎన్ ఆర్ ఇ పి, ఉపాధి గ్యారంటీ పథకాలు, ప్రత్యేకాభివృద్ధి పథకాలు వగైరాల ద్వారా పెద్ద మొత్తంలో ఖర్చుచేసిన నిధుల ద్వారా యిది సాధ్యమైందని సమీక్షా పత్రం పేర్కొంది. ప్రధానమంత్రి మరో అడుగు ముందుకువెళ్ళి 120 మిలియన్ల మంది ప్రజలను దారిద్ర్యరేఖ ఎగువకు చేర్చినట్లు చెప్పుకున్నారు. ప్రణాళికా శాఖ మంత్రి ఆ తర్వాత ఈ వైరుధ్యాన్ని వివరించేందుకు గాను పార్లమెంటులో 120 మిలియన్ల మందిని రెండేళ్ళలో దారిద్ర్య రేఖపైకి తీసుకురాలేదని, అది ఆరవ ప్రణాళికలోని అయిదేళ్ళ లక్ష్యమని చెప్పారు. ఈ పథకాలకు ఖర్చుచేసిన మొత్తాలను జాగ్రత్తగా లోతుగా పరిశీలించి చూస్తే ఈ డబ్బు నిజంగా ఎవరికుద్దేశింపబడిందో వారికి చేరితే ఈలోగా వారి దారిద్ర్యం వ్యవస్థా స్వభావం వలన మరింత పెరగకుండా ఉంటే దీనితో కేవలం 7 7 మిలియన్ల మందిని మాత్రమే (57 మిలియన్లు కాదు, 120 మిలియన్లు కాదు) దారిద్ర్యరేఖ పైకి చేర్చినట్లు సైద్ధాంతికంగా భావించవచ్చునని తేలింది. వాస్తవంగా జరిగింది యిది కాదని అందరికీ తెలుసు. అందువల్ల యీ గొప్పలన్నీ ఒట్టి బూటకాలు తప్ప మరేమీకాదు.

తమ విదేశీ వాణిజ్య విధానాలు, విదేశీ ఆర్థిక సహాయ విధానాలు బ్రహ్మాండమైన విజయాలను సాధించాయని ఫలితంగా విదేశీ వాణిజ్యంలోని లోటు తగ్గిందని, విదేశీ మారక ద్రవ్య నిల్వలు మెరుగు పడ్డాయని, అందువల్లనే ఐ ఎం ఎఫ్ రుణం లోని చివరి వాయిదాను తీసుకోకుండా స్వల్పవిధంగా వదులుకొన్నామని ప్రభుత్వం చెప్పుకున్నది.

1979–80 లో చెల్లింపుల సమతూకం పరిస్థితి బాగా క్షీణించిన తర్వాత దానిని అదుపులో పెట్టడానికి తాము అనుసరించిన వ్యూహం ఎంతో విజయవంతమై ప్రయోజనకారి అయిందని ఆర్థికమంత్రి చెప్పుకున్నారు. ఐ ఎం ఎఫ్ సూచించిన "సర్దుబాటు విధానాల" వల్ల ఆర్థిక వ్యవస్థ బలోపేతమైందని కూడా ఆయన చెప్పుకున్నారు. "మా కళ్ళు తెరిచే మేము ఐ ఎం ఎఫ్ రుణాన్ని తీసుకొన్నాం. మా తలలు పైకెత్తి బయటకు వచ్చాం" అని ఆయన పార్లమెంట్‌లో గర్వంగా చెప్పుకొన్నాడు.

అయితే వాస్తవాలు ఈ గొప్పల నన్నింటినీ తల్లక్రిందులు చేస్తున్నాయి. మొదటిది : చెల్లింపుల సమతూక సంక్షోభం "నూనె దిగుమతి వ్యయం పెరగడం" వల్ల వచ్చిందికాదు. ఎందుకంటే 1976–77 లో కూడా మొత్తం నూనె దిగుమతి బిల్లు చెల్లించిన తర్వాత కూడా స్వల్పంగా వాణిజ్య సమతూకం భారత్ వైపు మొగ్గుతున్నది. రెండవది : చెల్లింపుల సమతూక సంక్షోభం 1979–80 లోనే బద్దలు కాలేదు. ఆ ఏడాది మొత్తం వాణిజ్యంలో లోటు (2563 కోట్లు) మొత్తం నూనె దిగుమతి వ్యయం (3269 కోట్లు) కంటె తక్కువగానే వుంది. మూడవది :

చెల్లింపుల సమతూక సంక్షోభం తీవ్రతరమైనది. 1980-81 లో ఆ ఏడాదిలో ఐ. ఎం. ఎఫ్ - ప్రపంచ బ్యాంక్‌లు ఆదేశించిన 'ఉదార' దిగుమతి విధానం వల్ల వాణిజ్యంలో లోటు (రు. 5829 కోట్లు) ఆ ఏడాదిలోని నూనె దిగుమతి వ్యయాన్ని (రు. 5224 కోట్లు) మించిపోయింది. నాల్గవది : స్వదేశీ క్రూడ్ ఆయిల్ ఉత్పత్తి గణనీయంగా పెరిగినప్పటికీ (1980-81 లోని 10.5 మిలియన్ టన్నుల నుండి 1983-84 లోని 26 మిలియన్ టన్నుల అంచనావరకు) భారత్‌కు ఇంకా విదేశీ వాణిజ్యంలో లోటు తప్పడంలేదంటే దానికి కారణం "సడలించబడిన" దిగుమతి విధానం. ఉదాహరణకు స్వదేశీ క్రూడ్ ఉత్పత్తి బాగా పెరిగినప్పటికీ వాణిజ్యలోటు 1981-82 లో రు. 588 కోట్లు, 82-83 లో రు. 5626 కోట్లు వున్నది. 1982-83 లో అదనంగా మరో 15.5 మిలియన్ టన్నుల క్రూడ్ ఉత్పత్తి కావటంవల్ల నూనె దిగుమతి వ్యయం రు. 3200 కోట్లు ఆదా కావాలి. కానీ వాణిజ్యలోటు యింకా సుమారు 5 వేల కోట్ల వరకూ వుంటుందని అంచనా వేస్తున్నారు. అంటే దిగుమతి చేసుకొన్న అన్ని యితర పెట్రోలియం ఉత్పత్తుల వ్యయం (రు. 3600 కోట్లు) కంటె రు. 1400 కోట్లు ఎక్కువ. అయిదవది : "సడలించిన" దిగుమతి విధానం ఆశించినట్లుగా "బ్రహ్మాండమైన" ఎగుమతుల పెరుగుదలకు దారితీయలేదు. 1982-83 లో ఎగుమతులు కేవలం 2.3 శాతం మాత్రమే పెరిగాయి. క్రూడ్ దిగుమతులను ప్రక్కన పెడితే ఉక్కు, ఎరువులు, రసాయనాలు, యంత్ర పరికరాలు, కృత్రిమవంటి అనేక వస్తువుల అనవసర దిగుమతులు "బ్రహ్మాండంగా" పెరిగాయి. వీటి దిగుమతి ఫలితంగా స్వదేశీ పరిశ్రమలలో - ప్రభుత్వ రంగంలో, ప్రైవేట్ రంగంలో ఉత్పత్తి కోత విధింపుకు దారితీసింది. ఆరవదిగా : రూపాయి వనరుల కొరత పెరుగుతున్న పూర్వరంగంలో ఐ. ఎం. ఎఫ్. రుణం రూపంలో స్వేచ్ఛగా విదేశీ మారక ద్రవ్యం లభ్యంకావడంతో అనేక యంత్రపరికరాలను, యంత్రాలను దేశంలో తయారుచేసే అవకాశాలున్నప్పటికీ ఆర్డర్లను విదేశీ సంస్థలకు బదిలీ చేయడం జరిగింది. ఈ విధానం వల్ల బి హెచ్ ఇ ఎల్, హెచ్ ఎం టి వంటి ప్రతిష్ఠాకరమైన ప్రభుత్వ రంగ సంస్థలు బాగా దెబ్బతిన్నాయి.

ఈ విమర్శ సరైనదనేది యిప్పుడు ప్రణాళికా సంఘమే అంగీకరించింది. "ఉదారమైన" దిగుమతి విధానం సులభితరమైన పద్ధతిలో వుండాలని, స్వదేశీ ఉత్పత్తికి అంతరాయం కలగడాన్ని నిరోధించేందుకు ఎప్పటికప్పుడు అవసరమైన విధంగా దిగుమతులపై కొన్ని ఎంపిక చేయబడిన ఆంక్షలను అనుమతించాలని ప్రణాళికాసంఘం సిఫార్సు చేసింది (మధ్యంతర సమీక్ష, పేజి-16).

ఐ ఎం ఎఫ్ రుణంలో కొంత భాగాన్ని వదులుకోవలసి రావడానికి కారణం ఏమంటే ఆ రుణం "షరతుల" క్రింద ఎక్స్‌టెండెడ్ ఫైనాన్సింగ్ ఫెసిలిటీ ఏర్పాటు అమలులో వున్నంతకాలం "దిగుమతులపై ఎలాంటి ఎంపిక చేయబడిన

ఆంక్షలను" విధించడానికి వీలులేదు. అయితే ఐ ఎం ఎఫ్ రుణంలో కొంత భాగాన్ని దేశం సులభంగా వదులుకోగలిగిందన్న వాస్తవమే ఆ రుణం అసలు అనవసర మన్న విషయాన్ని రుజువు చేస్తున్నది. వాస్తవానికి ఐ ఎం ఎఫ్ నుండి రుణం తీసు కోవడానికి ఒప్పందం చేసుకోవడమే ప్రభుత్వం అనుసరిస్తున్న బాధ్యతారహిత ఆర్థిక విధానాలను బహిర్గతం చేసింది.

మొత్తం ఎగుమతుల ఆదాయంలో 50 నుంచి 60 శాతం వరకూ వాణిజ్య లోటును అధికాధిక హానికరమైన షరతులతో నిరంతరం విదేశీ రుణాలపై ఆధారపడి వుంటే తప్ప ఏమాత్రమూ భరించలేము. ఇప్పటికే గత నాలుగేళ్ళలో భారత ప్రభుత్వ విదేశీ రుణభారం 1979–80 లో వున్న రు. 9900 కోట్ల నుండి 1984–85 లో రు. 17 105 కోట్లకు పెరిగింది. ఇదే కాలంలో వార్షిక విదేశీ రుణ చెల్లింపుల భారం కూడా రు. 800 కోట్ల నుండి రు. 1025 కోట్లకు పెరిగింది. వచ్చే ఏడాది నుండి ఐ ఎం ఎఫ్ రుణం కూడా తిరిగి తీర్చడం ప్రారంభమైతే యిది రు. 2000 కోట్లకు లేదా అంతకంటె ఎక్కువ అవుతుంది. అంతేగాక పత్రికా వార్తలను బట్టి మరో రు. 5 వేల కోట్ల రుణాలను యూరో–డాలర్ మార్కెట్‌లో యింకా ఎక్కువ వడ్డీకి సేకరించినట్లు తెలుస్తున్నది. ఈ రుణాలను కూడా దాదాపు ఐ ఎం ఎఫ్ రుణాన్ని తిరిగి చెల్లించే కాలంలోనే చెల్లించాల్సి వస్తుంది. ఈ రుణాల తిరిగి చెల్లింపు, చెల్లింపుల సమతూకాన్ని మరింతగా దెబ్బతీస్తుంది.

ఈ విదేశీ వాణిజ్య పరిస్థితిలో ఒకేఒక ఆశాకిరణం భారత వాణిజ్యం సోవియట్ యూనియన్‌తో, యితర యూరోపియన్ సోషలిస్టు దేశాలతో బాగా పెరగడం. వాణిజ్య మంత్రిత్వశాఖ తాజా నివేదిక ప్రకారం "1982–83 లో భారత ఎగుమతులలో 24.6 శాతం తూర్పు యూరప్ దేశాలకు ఎగుమతి చేయబడు తున్నాయి. తూర్పు యూరప్ దేశాలు భారత వస్తువులకు అతి పెద్ద మార్కెట్‌గా రూపొందాయి. ఆ తర్వాత ఇ ఎస్ సి పి కి 24 శాతం, ఇ సి ఎం కు 19 శాతం, ఉత్తర అమెరికాకు 13 శాతం భారత వస్తువులు ఎగుమతి చేయబడుతున్నాయి...." అయినప్పటికీ మన ప్రభుత్వం ఈ దేశాలనుండి యంత్ర పరికరాలు మొదలైన ప్రధానమైన దిగుమతులు చేసుకొంటున్నది. ఫలితంగా ఆ దేశాలతో వాణిజ్యంలో లోటు ఏర్పడుతున్నది. వాణిజ్య మంత్రిత్వశాఖ నివేదిక యిలా పేర్కొంది: "1984 సంవత్సరంలో వాణిజ్యానికి సోవియట్ యూనియన్‌తో చేసుకున్న ఒప్పందం ప్రకారం 1983 కంటె ఈ ఏడాదిలో సోవియట్‌కు ఎగుమతులు గణ నీయంగా పెరుగనున్నాయి. దీనివల్ల వాణిజ్యంలో సమతూకం ఏర్పడుతుంది. సోవియట్ యూనియన్‌తో, యితర సోషలిస్టు దేశాలతో పరస్పరం లాభదాయకమైన వాణిజ్యం అభివృద్ధి మన దేశానికి సామ్రాజ్యవాద శక్తులనుండి వస్తున్న వివిధ

రకాల వత్తిళ్ళు, బ్లాక్ మెయిలింగ్‌లను ప్రతిఘటించడానికి ఒక శక్తివంతమైన ఆయుధం కాగలదు."

విదేశీ రుణాలతోపాటు దేశంలో సేకరించిన అప్పులుకూడా 1979-80 లోని రు. 24839 కోట్ల నుండి 1984-85 లో రు. 56802 కోట్లకు పెరిగాయి. ఈ రుణాలపై వడ్డీ చెల్లింపు కేంద్ర బడ్జెట్‌లో రెండవ పెద్ద ఖర్చు. సంవత్సరానికి రు. 5600 కోట్లు ఈ రుణాలపై వడ్డీ చెల్లింపుకే పోతున్నది. కేంద్ర ప్రభుత్వ ఆదాయంలో మూడవ వంతు దీనినుండి వస్తున్నది. నూనె ధరలు అధికంగా నిర్ణయించడం మొత్తం ఆర్థిక వ్యవస్థలో అన్ని వ్యయాలను పెంచుతుంది. లెక్కకురాని నూనె డబ్బు ద్రవ్యోల్బణాన్ని మరింత తీవ్రతరం చేస్తుంది.

ఆరవ ప్రణాళికకు దేశంలో వనరుల సమీకరణ లక్ష్యానికంటే ఎక్కువే సేకరించినప్పటికీ, బాధ్యతా రహితంగా లోటు బడ్జెట్ విధానానికి పాల్పడినప్పటికీ రూపాయి వనరుల సంక్షోభం ఎంత తీవ్రతరమైనదంటే అనేక ప్రాజెక్టులను వదులు కోవాల్సి వచ్చింది.

ఐ ఎం ఎఫ్ అధికారి ఒకరు యిటీవల ఒక వ్యాసంలో యిలా వ్యాఖ్యానించారు: ఆరవ ప్రణాళికా కాలంలో "వనరులను సమీకరించే ప్రధాన బాధ్యత ప్రభుత్వ రంగంపై పడింది. అది సబ్సిడీలను తగ్గించి, ప్రభుత్వ రంగ సంస్థల ఉత్పాదక శక్తిని, సామర్థ్యాన్ని పెంచడానికి ప్రయత్నిస్తున్నది. మరోవైపు గణనీయంగా వనరుల సమీకరణకు, పన్నుల విధింపుకు తక్కువ అవకాశాలే వున్నవి."

ఆరవ ప్రణాళికలో వనరుల సమీకరణ కృషిని, వనరుల సమీకరణ అవకాశాలను అలా నిర్వచించడంలో ఏడవ పంచవర్ష ప్రణాళికలో కూడా ఆర్థిక వ్యవస్థ పుంజుకొనే అవకాశాలు గొప్పగా ఏమీలేవు ఏడవ ప్రణాళికకు యింత వరకూ విధాన పత్రంకూడా తయారు కాలేదంటే ఆశ్చర్యంలేదు.

ఆరవ పంచవర్ష ప్రణాళికా కాలంలోని పరిణామాలు భారత ఆర్థిక వ్యవస్థలోని వ్యవస్థాగత సంక్షోభాన్ని మరోసారి బయట పెట్టాయి. ఈ సంక్షోభం ఆర్థిక వ్యవస్థలోని అన్ని రంగాలనూ— వ్యవసాయం, పరిశ్రమలు, వాణిజ్యం, అన్నింటికీ మించి ప్రణాళికా క్రమాన్ని కూడా చుట్టుముట్టింది.

అవసరమైన ప్రాథమిక సంస్కరణలు చేసేందుకు రాజకీయ సంకల్పం కొరవడడంలో అధికార పార్టీ ప్రజలపై కోల్పోతున్న పలుకుబడిని నిలబెట్టుకోవడానికి ఈ సరిక్రొత్త సంక్షోభ పరిస్థితులను పలు జనాకర్షణ చర్యలద్వారా పరిష్కరించడానికి ప్రయత్నిస్తోంది. అదే సమయంలో ఉత్పత్తిని, ఎగుమతులను పెంచేందుకు ఆర్థిక వ్యవస్థ పూర్తిగా కుప్పకూలకుండా చూసేందుకు బడా పారిశ్రామిక,

వాణిజ్య బూర్జువావర్గానికి, భూస్వాములకు అధికాధికంగా "ప్రోత్సాహకాలను" యిస్తోంది.

గత జనవరిలో జరిగిన కేంద్ర కార్యవర్గం ఆమోదించిన తీర్మానం పేర్కొన్నట్లుగా "సోషలిజం" గురించి వాగాడంబర నినాదాలిస్తున్నప్పటికీ అధికార కాంగ్రెస్ పార్టీ కొన్ని మౌలికమైన, జాతి ఆమోదం పొందిన విధానాలు కొన్నింటి నుండి వైదొలగడం ప్రారంభించింది. ఉదాహరణకు "ఎగుమతి దృక్పథంతో ప్రగతి" మరియు "దిగుమతుల సడలింపు" అన్న వ్యూహాన్ని ప్రపంచ బ్యాంక్ ఐ.ఎం.ఎఫ్. ల వత్తిడితో ఆమోదించడం మన దేశ మౌలిక విధానమైన జాతీయ స్వావలంబన లక్ష్యాన్ని దెబ్బతీస్తున్నది. మన ఆర్థిక వ్యవస్థను సంక్షోభాలలో కూరుకుపోయివున్న ప్రపంచ పెట్టుబడిదారీ ఆర్థిక వ్యవస్థతో అధికాధికంగా ముడివేస్తున్నది. అలాగే, పారిశ్రామిక లైసెన్సులు, పెట్టుబడులు; ఉత్పత్తిపై గల వివిధ ఆంక్షలను పదే పదే సడలిస్తూ ఉండడం వల్ల ప్రభుత్వ రంగం ఆధిక్యతను కోల్పోతున్నది. ప్రభుత్వ రంగాన్ని అధికాధికంగా ప్రైవేట్ రంగం, గుత్తాధిపతులు, బహుళ జాతి కంపెనీల ప్రయోజనాలు తీర్చేందుకు వుపయోగించడం జరుగుతుంది. చివరిగా దేశ రక్షణ అవసరాలతో ముడిపడివున్న కమ్యూనికేషన్లు, ఎలక్ట్రానిక్స్, కంప్యూటర్ల వంటి ఆర్థిక వ్యవస్థలోని కీలక రంగాలలోకి ప్రైవేట్ రంగాన్ని ఆహ్వానించడం ద్వారా ప్రభుత్వం ప్రైవేట్ గుత్తాధిపతుల పెట్టుబడులు చివరకు యిలాంటి కీలక పరిశ్రమలలో కూడా చొరబడడానికి ద్వారాలు తెరిచింది.

ఇవన్నీ జాతి అంగీకృత విధానమైన స్వావలంబనకు పెద్ద ప్రమాదాన్ని తెచ్చిపెడుతున్నాయి. వామపక్ష, ప్రజాతంత్ర శక్తులు వీటి రక్షణకు అప్రమత్తంగా వ్యవహరించాల్సిన అవశ్యకతను సూచిస్తున్నాయి.

ఈ విధానం ఆర్థిక వ్యవస్థ సంక్షోభ పర్యవసానాలను కార్మికవర్గం, శ్రామిక రైతాంగం, వ్యవసాయ కార్మికులు, యితర శ్రామిక ప్రజలపై మోపడానికి బూర్జువావర్గానికి, భూస్వాములకు సహాయపడుతుంది. ఫలితంగా శ్రామిక ప్రజలు అధికాధికంగా ఉద్యమాలు పోరాట మార్గాన నడవాల్సి వస్తుంది.

## ప్రజా ఉద్యమాలు మరియు పోరాటాలు

ఈ కాలంలో అనేక రాష్ట్రాలలో పార్టీ యూనిట్లు ధరల పెరుగుదల, నిరుద్యోగం, రైతులకు గిట్టుబాటుధరలు, వంటి సమస్యలపై, కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాల ప్రజాస్వామ్య వ్యతిరేక, కార్మిక వ్యతిరేక విధానాలకు వ్యతిరేకంగా పెద్ద ప్రజా కార్యాచరణలను నిర్వహించాయి. ఆంధ్రప్రదేశ్, ఒరిస్సాలలో ప్రకృతి వైపరీత్యాలవల్ల నష్టపోయినవారికి విస్తృత సహాయం చర్యల కోసం కూడా ఆయా పార్టీ శాఖలు కార్యాచరణలను చేపట్టాయి.

ఈ కార్యాచరణలలో ముఖ్యమైన వాటిని ఈ దిగువ పొందుపరుస్తున్నాము.

ఒరిస్సాలో 1933 అక్టోబరు 23 నుండి 30 వరకు "గణ సత్యాగ్రహం" ఈ కార్యాచరణ కార్యక్రమంలో 75 వేల మంది మహిళలతో సహా 25 వేల మంది అరెస్టయ్యారు. దీని తర్వాత కార్యక్రమంగా కూడా ఉద్యమాలు నిర్వహించ బడ్డాయి. చివరగా బ్రహ్మాండమైన సభ జరిగింది.

తమిళనాడులో అక్టోబర్ 20 న 14 ప్రతిపక్ష పార్టీల పిలుపుపై రాష్ట్ర మంతటా వేలాది మంది ప్రదర్శనలు జరిపారు. మరోసారి డిసెంబర్ 15 న 435 కేంద్రాలలో 1,15,000 మందికి పైగా పికెటింగ్ చేశారు. ఈ పికెటర్లలో ఎక్కువ మంది డి. ఎం. కె, సి. పి. ఐ., సి. పి. ఐ. (ఎం) లకు చెందినవారు

మహారాష్ట్రలో మూడు వామపక్ష పార్టీల పిలుపు మేరకు 40 వేల మంది నవంబర్ 22 న అరెస్టయ్యారు. ఈ కార్యక్రమం దాదాపు ప్రతి తాలూకా కేంద్రం లోనూ జరిగింది. మన పార్టీ ఈ ఆందోళనలో ప్రధాన పాత్ర వహించింది.

మహారాష్ట్రలో బొంబాయి సమీపంలోని ఉరన్ వద్ద రైతాంగం జరిపిన ఆందోళన చెప్పుకోదగ్గది. నవ - షివ హార్బరు కోసం సేకరించిన తమ భూము లకు అంతకుముందు యిచ్చిన హామీపై 1500 సహేతుకమైన నష్టపరిహారం చెల్లించాలని రైతాంగం డిమాండ్ చేశారు. ఎలాంటి కవ్వింపు లేకుండా పోలీసులు జరిపిన కాల్పులలో ఆరుగురు రైతులు మరణించారు. ప్రభుత్వానికి వ్యతిరేకంగా ప్రజలలో అసంతృప్తి ప్రబలింది. ఉరన్ రైతాంగానికి తోడ్పాటుగా అన్ని ప్రతి పక్ష పార్టీలూ, ట్రేడ్ యూనియన్లు ఐక్యమయ్యాయి. జనవరి 31 న బొంబాయి - బేలాపూర్ ప్రాంతాలు అలాగే అనేక యితర కేంద్రాలలో మున్నెన్నడూ లేని విధంగా జయప్రదంగా బంద్ జరిగింది. మహారాష్ట్ర అంతటా వేలాదిమంది అరెస్ట య్యారు. ఐక్యఉద్యమం శక్తిని గుర్తించి ప్రభుత్వం అంతిమంగా దిగిరావాల్సి వచ్చింది. ఈ పోరాటం పూర్తిగా విజయవంతంగా ముగిసింది. ఈ ఆందోళన సందర్భంగా రైతాంగం - కార్మికవర్గం ఐక్యత ప్రస్ఫుటంగా వ్యక్తమైంది.

బీహార్‌లో నవంబర్ 15 న ప్రజా సమస్యలపై సి. పి. ఐ. పిలుపు మేరకు సుమారు 1 లక్ష మంది పాట్నాలో ప్రదర్శన జరిపారు. ఆ తర్వాత కలకత్తాలో సి. పి. ఐ. ఆధ్వర్యాన పెద్ద ప్రజా ప్రదర్శన, సభ జరిగాయి.

పంజాబ్‌లో ప్రత్తి, యితర వ్యవసాయ ఉత్పత్తుల ధరల సమస్యపై సి.పి.ఐ., సి.పి. యం. నాయకత్వాన గల రైతు సంఘాలు, అకాలీదళ్‌ల సంయుక్త ఆధ్వర్యాన రైతాంగ ఉద్యమం నిర్వహించబడింది. తర్వాత యితర రైతు సంఘాలు కూడా ఈ సమస్యలపై పోరాటాలు నిర్వహించాయి. ప్రభుత్వం నుండి గణనీయమైన రాయితీలను రైతాంగం పొందగలిగింది.

అస్సాంలో మన పార్టీ 10 అంశాల కోర్కెల పత్రంపై 1983 నవంబర్‌లో రాజకీయ వుద్యమాన్ని నిర్వహించింది. నవంబర్ 15 న, జిల్లా సబ్ డివిజనల్ కేంద్రాలలో సామూహిక సత్యాగ్రహంతో ఈ వుద్యమం ముగిసింది. ఈ సత్యాగ్రహంలో సుమారు 2 వేల మందికి పైగా పాల్గొన్నారు. ఇది ప్రజలలో మంచి ప్రభావాన్ని కలిగించింది. ఈ వుద్యమం రెండవదశ కార్యక్రమాన్ని 1984 మార్చి-ఏప్రిల్‌లో నిర్వహించారు. బ్లాక్ స్థాయిలో, హెడ్ క్వార్టర్ పట్టణాలలో బహిరంగ సభలు జరిగాయి. కొన్ని పట్టణాలలో పెద్ద బహిరంగ సభలు జరిగాయి. వీటికి ప్రజల తోడ్పాటు ప్రోత్సాహకరంగా వుంది.

ఈ కాలంలో రెండున్నర లక్షల మంది జూట్ కార్మికులు ఐక్య పోరాటాన్ని నిర్వహించారు. ఈ పోరాటంలో ఐ ఎన్ టి యు సి తో సహా అన్ని ట్రేడ్ యూనియను పాల్గొన్నాయి. 86 రోజులపాటు సమ్మె జరిగిన తర్వాత యజమానులు దిగివచ్చి కొన్ని కార్మికుల డిమాండ్లను అంగీకరించాల్సి వచ్చింది. పీస్ రేటు పద్ధతి సాధ్యమా కాదా అన్న విషయాన్ని పశ్చిమ బెంగాల్ కార్మికులంతా నియమించే ఒక కమిటీ పరిశీలిస్తుంది

ముఖ్యంగా టెక్స్‌టైల్ కార్మికులు, అలాగే యితర పరిశ్రమల కార్మికులు మూసివేతలు, రిట్రెంచ్‌మెంట్‌లు, లాకౌట్‌లకు వ్యతిరేకంగా పోరాటం సాగిస్తున్నారు. 1983 లోనే 21 మిల్లులు మూసివేయబడ్డాయి. ఇండోర్, హిస్సార్, పుదుచ్చేరి, ఢిల్లీ, అహ్మదాబాద్, బొంబాయిలలో మూసివేయబడిన మిల్లుల పునఃప్రారంభాన్ని కోరుతూ దీర్ఘకాల పోరాటాలు జరిగాయి. కొన్ని సందర్భాలలో ప్రభుత్వం వాటిని స్వాధీనం చేసుకోవాల్సి వచ్చింది. కానీ యిది తీవ్రతరమవుతున్న పెట్టుబడిదారీ పంథా యొక్క దుష్ఫలితాలకు వ్యతిరేకంగా పోరాటం. 1984 జనవరి 20 న లాకౌట్లు, మూసివేతలు, రిట్రెంచ్‌మెంట్లు యూనిట్ల పై నోటిఫికేషన్లకు వ్యతిరేకంగా కేంద్ర ట్రేడ్ యూనియన్ల జాతీయ వుద్యమ కమిటీ (ఎన్ సి సి) ఈ సదస్సు జరిగింది. ఈ సమస్యపై ఈ సదస్సు ఒక ప్రత్యామ్నాయ పంథాను ప్రతిపాదించింది. కార్మికుల ఐక్య ఉద్యమానికి పిలుపు నిచ్చింది.

ఈ కాలంలో మరో ముఖ్యమైన పోరాటం 26 రోజులు జరిగిన 3 లక్షల మంది రేవు కార్మికుల సమ్మె. 26 రోజుల తరువాత ప్రభుత్వం దిగివచ్చి వేతనాలు, ఇంటి అద్దె అలవెన్సులలో గణనీయమైన పెరుగుదలను, కోరిన కార్మికుల డిమాండ్లను ఆమోదించాల్సి వచ్చింది.

రెండు రాష్ట్రాలలో కేరళ, మహారాష్ట్రలలో విద్యుత్ కార్మికులు సమ్మె చేశారు. కేరళ విద్యుచ్ఛక్తి బోర్డు కార్మికులు 22 వేల మంది మన యూనియన్, సి ఐ టి యు యూనియన్, పాలక పార్టీకి చెందిన కొందరి నాయకత్వాన గల

యూనియన్‌లతో కూడిన ఐక్య కార్యాచరణ కమిటి నాయకత్వంలో గత 35 రోజులు సమ్మెలో వున్నారు. 2 వేల మందికి పైగా కార్మికులను జైళ్ళలో కుక్కారు. వందలాది మందిని సర్వీసు నుంచి తొలగించారు. విద్యుచ్ఛక్తి కార్మికులపై బురద చల్లటానికి ప్రభుత్వం బూర్జువా పత్రికలు ప్రయత్నాలు చేస్తున్నప్పటికీ వారికి ఇతర రంగాల కార్మికుల, ప్రజల తోడ్పాటు సంఘీభావం ఉన్నది. మార్చి 23 న విద్యుత్ కార్మికులకు తోడ్పాటుగా కేరళలో పారిశ్రామిక సమ్మె జరిగింది. ఈ సార్వత్రిక సమ్మె దాదాపు కేరళ బంద్‌లా మారింది. ఇవన్నీ కేరళ ప్రభుత్వం తన మొండి వైఖరిని వదులుకొని కార్మికులతో సంప్రదింపులు జరిపేలా వత్తిడి తెచ్చాయి. అంతిమంగా ఒక ఒప్పందం కుదిరింది. 1984 జనవరిలో కేరళలో రెండు వారాలపాటు జరిగిన ఎన్.జి.ఓల, టీచర్ల సమ్మె పాక్షికంగా విజయవంతమైంది. ఉద్యోగులందరికీ రాష్ట్ర ప్రభుత్వం నెలకు రు. 35-15 తాత్కాలిక భృతిని ప్రకటించింది.

మహారాష్ట్రలో సుమారు 75 వేల మంది విద్యుత్ కార్మికులు మొదట మూడు రోజులు తరువాత ఏడు రోజులు సమ్మె చేశారు.

బెంగాల్‌లో పింగాణీ కార్మికులు గత మూడు నెలలుగా (ఫిబ్రవరి 13 నుండి) మెరుగైన వేతనాల కోసం, పని పరిస్థితుల కోసం ఐక్యంగా సమ్మె చేస్తున్నారు.

సింగరేణి ఇతర గనులలో బొగ్గుగని కార్మికులు ఒకరోజు సమ్మెకు వేతనంలో 8 రోజులు కోత విధించే యత్నానికి వ్యతిరేకంగా పోరాడి విజయం సాధించారు. వారు యిటీవలనే ఒక సదస్సు జరుపుకొని త్రైపాక్షిక ఒప్పందం అమలు కోసం సమ్మెతో సహా కార్యాచరణకు దిగాలని పిలుపు నిచ్చారు.

ఒరిస్సాలోని భోజ్‌నగర్‌లోని బిర్లాకు చెందిన ఓరియంట్ పేపర్‌మిల్స్‌లోని 10 వేల మంది కార్మికుల వీరోచిత సమ్మె పోరాటం యీ కాలంలో జరిగిన మరో ముఖ్యమైన కార్మిక పోరాటం. ఈ సమ్మె దాదాపు ఒక సంవత్సరం కొనసాగింది. చివరకు విజయవంతంగా ముగిసింది. బిర్లాలు దిగివచ్చి కార్మికుల ప్రధాన డిమాండ్లను ఆమోదించారు. వేతనాలను పెంచటానికి, రిట్రెంచ్‌మెంట్‌లు లేకుండా చేయడానికి అంగీకరించారు. ఈ సందర్భంలో ఒక విషయం గమనించాలి. బిర్లాలు తమ యాజమాన్యంలోనే వున్న ఇతర పేపర్ మిల్లులలో కార్మికుల డిమాండ్లను అంగీకరిస్తూ ఈ బిర్లా కార్మికుల పట్లనే వివక్షతతో వ్యవహరిస్తున్నారు. దీనికి కారణం యిక్కడి కార్మికులు ఎ ఐ టి యు సి నాయకత్వంలో వుండడమే.

కేంద్ర ప్రభుత్వోద్యోగులు తమకు రావల్సిన కరువుభత్యం వాయిదాలకోసం దేశవ్యాపితంగా నిరాహార దీక్షలు, ధర్నాలు, ప్రదర్శనలు చేశారు. ప్రభుత్వం

కేవలం మూడు డి ఎ. వాయిదాలను చెల్లింపుకు మాత్రమే వుత్తర్వు చేసినందున ఈ ఆందోళన కొనసాగుతున్నది. బ్యాంకు ఉద్యోగులు కూడా ఎ ఐ బి ఇ ఎ, ఎస్ బి ఐ ఫెడరేషన్‌ల నాయకత్వాన సాగ్గవ ద్వైపాక్షిక సంప్రదింపుల్లో చాలా డిమాండ్లపై చర్చల కోసం ఆందోళన కార్యక్రమాన్ని చేపట్టారు. ఎల్ ఐ సి ని విభజించ తలపెట్టిన బిల్లుకు వ్యతిరేకంగా, తమ జీతాలలో కోత విధించడానికి జరుగుతున్న ప్రయత్నాలకు వ్యతిరేకంగా ఎల్ ఐ సి వుద్యోగులు తాముగా ఒక గంట పని నిలుపుదల, ప్రదర్శనలు చేశారు. తమ సమిష్టి బేరసారాల హక్కుపై చట్టపరమైన ఆంక్షల తొలగింపుకు ఆందోళన చేస్తున్న జి ఐ సి వుద్యోగులు యిటీవల సుప్రీంకోర్టు అనుకూల తీర్పు యివ్వడంతో పెద్ద విజయం సాధించారు.

ఆంధ్రప్రదేశ్‌లో సెకండరీ స్కూలు టీచర్లు, జూనియర్ కాలేజీ లెక్చరర్ల ఆందోళనలు పాక్షికంగా విజయవంత మయ్యాయి.

హిమాచల్‌ప్రదేశ్‌లో కొన్ని రూట్లను తిరిగి ప్రైవేట్ ఆపరేటర్లకు అప్పగించడాన్ని నిరసిస్తూ రవాణా కార్మికులు రెండు గంటలు సమ్మె చేశారు. అంతకు ముందు హిమాచల్‌ప్రదేశ్ శాసనసభ ఎదుట ఏప్రిల్ 11 న ఎ ఐ టి యు సి నాయకత్వానగల యూనియన్ల ఆధ్వర్యాన పెద్ద ప్రదర్శన జరిపారు.

ఇంఫాల్‌లో 150 మంది యువజన విద్యార్థి కార్యకర్తలు ఏప్రిల్‌లో సత్యాగ్రహం చేసి అరెస్టయ్యారు.

ఈ కాలంలో కార్మికులు నిర్వహించిన పలు పోరాటాలు పరాకాష్ఠగా ఏప్రిల్ 18 న పార్లమెంట్ ముందు ఎన్ సి సి ఆధ్వర్యాన పెద్ద ప్రదర్శన జరిగింది. ఈ ప్రదర్శనలో విశేషమేమంటే సంఘటిత కార్మికులు వ్యవసాయ కార్మికులు కలసి పాల్గొనడం. ఇది 1984 లో "అసంఘటిత కార్మికులను సంఘటితం" చేయాలన్న ఎ ఐ టి యు సి నినాదం యొక్క ప్రాధాన్యతను నొక్కిచెబుతున్నది.

బెంగుళూరులో ఎంతో విజయవంతంగా జరిగిన ఎ ఐ టి యు సి 32వ మహాసభ వివరాలను 1984 జనవరి కేంద్ర కార్యవర్గ సమావేశం నివేదికతో పొందుపరిచినందున మళ్ళీ యిక్కడ యివ్వడంలేదు.

ఇటీవలి రేవు కార్మికుల సమ్మె, జూట్, విద్యుత్ కార్మికులు, యితర కార్మిక శ్రేణుల (కేరళలో) ఆందోళనలలో కొత్త అంశాలేమంటే ఐ ఎన్ టి యు సి మద్దతుదార్లు కూడా పాల్గొనడం. కార్మికవర్గ ఐక్య కార్యాచరణకు యిది దోహదపడుతుంది.

పైన పేర్కొన్న వాటిని గమనించి ఎ ఐ టి యు సి బెంగుళూరు మహాసభ నిర్దేశించిన వివిధ కర్తవ్యాల పరిపూర్తికి, ముఖ్యంగా అసంఘటితరంగ కార్మికులను సంఘటిత పరచడానికి కృషి చేయడంపై కేంద్రీకరించాల్సి వుంటుంది.

## యువజన విద్యార్థులు

సమీక్షా కాలంలో ఎ ఐ వై ఎఫ్, ఎ ఐ ఎస్ ఎఫ్ లు కొన్ని ఉద్యమాలను, ఆందోళనలను నిర్వహించాయి. వాటిలో పేర్కొనదగినవి జాతీయ ఐక్యత, సమగ్రతల పరిరక్షణ పక్షోత్సవంగా భగత్‌సింగ్ వర్ధంతిని పాటించడం. కేంద్రానికి అందిన అసంపూర్తి సమాచారం ప్రకారం వివిధ గ్రామాలు, ప్రాంతాలలో పెద్ద సంఖ్యలో బహిరంగ సభలు, కాగడాల ప్రదర్శనలు నిర్వహించబడ్డాయి. ఈ పక్షోత్సవాలలో గమనించదగిన అంశం వివిధ కేంద్రాలలో ఎ ఐ వై ఎఫ్ భగత్ సింగ్ క్లబ్‌ల ఆధ్వర్యంలో సాంస్కృతిక ప్రదర్శనలు, ఆటల పోటీలు నిర్వహించడం.

ఎ ఐ వై ఎఫ్, ఎ ఐ ఎస్ ఎఫ్‌లు ఢిల్లీలోని ఖూనిదర్వాజా నుండి హుస్సేనివాలాలోని భగత్‌సింగ్ సమాధి వద్దకు సైకిల్ ర్యాలీ కాగడాల యాత్ర నిర్వహించాయి. ఈ యాత్రను కాంతికాముక ప్రజానీకం, పత్రికలు ప్రశంసించాయి. ఈ యాత్ర మార్గ మధ్యంలో అనేకచోట్ల సభలు జరిగాయి. సి పి ఎం., ఇందిరా కాంగ్రెస్‌తో సహా వివిధ రాజకీయ పార్టీల కార్యకర్తలు పలుచోట్ల ఈ ప్రదర్శకులకు స్వాగతం పలికారు. హుస్సేనీవాలాలో భగత్‌సింగ్ ఆయన సహచరుల వర్ధంతి రోజున — మార్చి 23 న మూడు, నాలుగువేల మందితో పెద్ద సభ జరిగింది. ఢిల్లీలో ప్రారంభమైన ఈ యువజన విద్యార్థుల యాత్ర హింసాయుత ఘర్షణలు, అల్లర్లతో అట్టుడికిపోతున్న పంజాబ్‌లోని అన్ని ప్రాంతాలగుండా హుస్సేనీవాలాకు చేరింది. భగత్‌సింగ్ సోదరి బీబీఅమర్‌కౌర్ వృద్ధాప్యాన్ని కూడా లెక్కచేయకుండా ఈ సభలో ప్రసంగించేందుకు హుస్సేనీవాలా వచ్చారు. యువజన విద్యార్థి దళంపై మార్గ మధ్యంలో తీవ్రవాదులు రెండుచోట్ల — బాగ్‌ఫరానా, నోపార్‌లవద్ద దాడిచేశారు. బాగ్‌ఫరానా వద్ద దాడిచేసిన వారికి సంత్ భింద్రన్‌వాలే సోదరుడు జగ్‌జిత్‌సింగ్ స్వయంగా నాయకత్వం వహించారు.

## ఉద్యోగం లేదా జైలు

నిరుద్యోగానికి వ్యతిరేకంగా ఎ ఐ వై ఎఫ్ సాగిస్తున్న నిరంతర పోరాటంలో భాగంగా ఏప్రిల్ 3 నుండి 5 వరకు మూడు రోజులపాటు పార్లమెంట్ ముందు యువజనుల పికెటింగ్‌ను నిర్వహించడం జరిగింది. దేశ వ్యాపితంగా సాగించిన ముమ్మర ప్రచారోద్యమం అనంతరం ఈ పికెటింగ్ నిర్వహించారు. పికెటింగ్‌కు ముందు బహిరంగ సభలు, పెద్ద ఎత్తున పోస్టర్లు, గోడలపై వ్రాయడం

వంటి కార్యక్రమాలు జరిగాయి. ఢిల్లీ చుట్టుప్రక్కల రాష్ట్రాలలో పంటల కోతల సమయమైనప్పటికీ దాదాపు ఏడు వేలమంది యువతీ యువకులు ఈ పికెటింగ్‌లో పాల్గొన్నారు. వారిలో 3300 మంది అరెస్టయ్యారు. చివరి రోజున పోలీసులు అకారణంగా ఎలాంటి కవ్వింపులేకుండా పికెటింగ్ చేస్తున్న వాలంటీర్లపై అమానుషంగా లాఠీఛార్జి చేశారు. సుమారు 200 మంది లాఠీఛార్జిలో గాయపడ్డారు. వారిలో 20 మందికి ప్రమాదకరమైన గాయాలు తగిలాయి.

తొలిదినాలలో ఫిబ్రవరి 3 న జిల్లా కేంద్రాలలో పికెటింగ్ సందర్భంగా మూడువేలమంది యువజన కార్యకర్తలు అరెస్టయ్యారు.

మహారాష్ట్రలో ఏప్రిల్ 5 న 3 వేల మంది బొంబాయిలో శాసనసభ ఎదుట పికెటింగ్ జరిపి అరెస్టయ్యారు. రాష్ట్రంలోని 14 జిల్లాల నుండి వలంటీర్లు ఈ పికెటింగ్‌లో పాల్గొనేందుకు బొంబాయి వచ్చారు.

మణిపూర్‌లో కూడా ఏప్రిల్ 5 న ఎ ఐ వై ఎఫ్ ఆధ్వర్యాన సచివాలయం ఎదుట (ఇంఫాల్) ప్రదర్శన పికెటింగ్ జరిగింది.

హిమాచల్‌ప్రదేశ్‌లో కూడా యువతీ యువకులు మార్చి 23 న రాష్ట్ర విధానసభ ఎదుట ప్రదర్శన జరిపి పికెటింగ్ జరిపారు.

ఆంధ్రప్రదేశ్, పశ్చిమబెంగాల్ రాజధానులలో మార్చి 30, 31 తేదీలలో పెద్ద ప్రదర్శనలు జరిగాయి. హైదరాబాద్ ప్రదర్శనలో సుమారు 20 వేల మందికి పైగా యువజనులు పాల్గొనగా కలకత్తాలో 10 వేల మంది పాల్గొన్నారు. బెంగాల్‌లో 2 వేల మంది అరెస్టయిన రాష్ట్ర వ్యాపిత ఆందోళన అనంతరం చివరగా కలకత్తా ప్రదర్శన జరిగింది.

## మహిళారంగం

మహిళారంగంలో వరకట్నపు చావులు, మహిళలపై అత్యాచారాలకు వ్యతిరేకంగా ఎన్ ఎఫ్ ఐ డబ్ల్యు శాఖలు నిత్యం నిర్వహించే స్థానికస్థాయి కార్యాచరణచే కాక ఈ కాలంలో జరిగిన పెద్ద కార్యక్రమం – 1984 ఫిబ్రవరి 15 నుండి 18 వరకు గుంటూరులో విజయవంతంగా నిర్వహించిన ఎన్ ఎఫ్ ఐ డబ్ల్యు 11 వ మహాసభ. ఈ మహాసభకు అన్ని రాష్ట్రాలనుండి ప్రతినిధులు హాజరయ్యారు. మహాసభ ప్రారంభంనాడు 30 వేల మహిళలతో బ్రహ్మాండమైన ప్రదర్శన జరిగింది. మహిళాసమాఖ్య సభ్యత్వం 6 లక్షల నుండి 7 లక్షలకు పెరిగింది. వరకట్నచావులకు వ్యతిరేకంగా, మహిళలపై అత్యాచారాలకు వ్యతిరేకంగా, మహిళలకు శిక్షణా అవకాశాల పెరుగుదలకు, ఉపాధి అవకాశాల పెంపునకు, అలాగే గ్రామీణ మహిళలలో సమాఖ్య పలుకుబడిని పెంచేందుకుగాను సమాఖ్యను పటిష్టవంతం చేసేందుకు

మహాసభ ఒక నిర్దిష్టమైన కార్యక్రమాన్ని రూపొందించింది. తమ ప్రాథమిక స్థితిగతులను మెరుగుపరచుకునేందుకు వివిధ వర్గాల ప్రజలు సాగించే పోరాటాలలో ప్రజాస్వామిక హక్కులు, ప్రపంచ శాంతిపరిరక్షణకు జరిగే పోరాటాలలో చురుకుగా, క్రియాశీలంగా పాల్గొనాల్సిందిగా ఎన్ ఎఫ్ ఐ డబ్ల్యు శాఖలకు మహాసభ పిలుపు నిచ్చింది.

## వ్యవసాయ కార్మికులు

వ్యవసాయ కార్మికులకు ఒక సమగ్ర కేంద్ర శాసనం కోసం వ్యవసాయ కార్మికరంగంలో జరుగుతున్న పోరాటం ఈ కాలంలో మరింత ఐక్యకార్యాచరణల రూపంలో కొనసాగింది. బి కె ఎం యు, అఖిలభారత వ్యవసాయ కార్మిక సంఘం ఇండియన్ నేషనల్ రూరల్ అండ్ అల్లయిడ్ వర్కర్స్ ఫెడరేషన్ హింద్ ఖేత్ మజ్దూర్ పంచాయత్‌లు సంయుక్తంగా యిచ్చిన పిలుపుమేరకు వ్యవసాయ కార్మికులు 1984 జనవరి 20 న దేశమంతటా జిల్లాకలెక్టర్ల కార్యాలయాల ఎదుట సమైక్యంగా పెద్ద ఎత్తున ధర్నా కార్యక్రమాలను నిర్వహించారు. వ్యవసాయ కార్మికులకు త్వరగా ఒక సమగ్రమైన కేంద్ర శాసనాన్ని చేయాలని కోరుతూ ఐక్యంగా నిర్వహించబడిన ఈ ధర్నా కార్యక్రమం విజయవంతమైంది. కేరళ, తమిళనాడు, ఆంధ్రప్రదేశ్, పంజాబ్, బీహార్, పశ్చిమ బెంగాల్‌లలో అనేక జిల్లాలలో ధర్నాలు పెద్ద ఎత్తున జరిగాయి. జనవరి 20 కార్యక్రమానికి వ్యవసాయ కార్మికులను సమీకరించడంలో బి కె ఎం యు అగ్రభాగాన నిలిచింది.

జనవరి 20 వ తేదీ కార్యక్రమం అంతకుముందు జులై 15 న బి కె ఎం యు, ఎ ఐ ఎ ఎం యు ల సంయుక్త ఆధ్వర్యాన విజయవంతంగా జరిగిన వ్యవసాయ కార్మికుల దేశవ్యాపిత ఒక రోజు సమ్మెకు కొనసాగింపుగా నిర్వహించబడింది. సమగ్ర కేంద్ర శాసనం డిమాండ్‌ను సాధించుకునేందుకు మరింత ఉన్నతమైన ఐక్య పోరాటాలు అవసరం. వ్యవసాయ కార్మిక సంఘాల కేంద్ర సమన్వయ కమిటీ నిర్ణయానుసారం సమగ్ర కేంద్ర శాసనంకోసం తర్వాత తమ పోరాట కార్యక్రమాలను రూపొందించుకునేందుకు 1984 ఏప్రిల్ 17 న న్యూఢిల్లీలో వ్యవసాయ కార్మికుల జాతీయ సదస్సును నిర్వహించేందుకు సన్నాహాలు జరిగాయి; కానీ కొన్ని అనివార్యకారణాలవల్ల ఈ సదస్సును వాయిదావేయాల్సి వచ్చింది. ఈ సదస్సు మళ్ళీ సాధ్యమైనంత త్వరలో జరుగుతుంది. కేంద్ర శాసనం కోసం సాగించే ఆందోళన భవిష్యత్ కార్యక్రమాన్ని గురించి ఒక నిర్ణయం తీసుకోబడుతుంది

ఈ కాలంలో రాజకీయ, ప్రజాకార్యకలాపాలు పెరిగాయన్నది వాస్తవం. అయితే కార్మికరంగంలో మినహా మిగిలిన రంగాలలో ముఖ్యంగా గ్రామీణ

ప్రాంతాలలో ఈ కార్యకలాపాలు ప్రధానంగా ప్రజల సాధారణ సమస్యలకే పరిమితమయ్యాయి. మనం ప్రదర్శనలు నిర్వహించడం, అందరికీ సంబంధించిన ఉద్యమాలను నిర్వహించటంతో పాటు ప్రజల జీవన సమస్యలపై కేంద్రీకరించి స్థానిక స్థాయిలలో ప్రజా పోరాటాలు నిర్వహించడం, ప్రజాసంఘాలను నిర్మించడం అవసరం. మనం ఈ పని చేయకపోతే మన ప్రజా పలుకుబడిని సంఘటితపరుచుకోలేము. శక్తివంతమైన పోరాటపటిమ గల్గిన సంఘాలను నిర్మించుకోలేము. ఇందుకోసం అన్ని స్థాయిలలోని ముఖ్య కార్యకర్తలంతా గ్రామాలకు మళ్ళి మాటలు చెప్పడం కాకుండా ఆచరణద్వారా స్థానిక పార్టీ శాఖలకు ఆదర్శప్రాయంగా ఉండాలి.

## రానున్న కాలంలో లక్ష్యాలు

1. ఈ పత్రంలో వివరించినట్లుగా రీగన్ ప్రభుత్వ ఆయుధపోటీ, దురాక్రమణదారీ విధానాలు, ఇతర దేశాలలో జోక్యం, అస్థిరీకరణ యత్నాలు ప్రపంచాన్ని గతంలో ఎన్నడూ లేనంతగా అణు మారణహోమం అంచులకు నెడుతున్నాయి. భారతదేశ జాతీయ భద్రతకు కూడా గతంలో ఎన్నడూ లేనంత ప్రమాదం ఏర్పడింది. అందువల్ల రీగన్ ప్రభుత్వ విధానాలకు వ్యతిరేకంగా, అణుయుద్ధాన్ని నివారించేందుకు, భారత భద్రత, సమైక్యతల పరిరక్షణకు జరిపే పోరాటాన్ని మరింత ఉధృతం చేయాల్సిఉన్నది. విస్తృతంగా ప్రజలలోకి తీసు కెళ్ళాల్సి ఉంది.

మన పార్టీ ఈ విషయంలో స్వతంత్రంగా ఉద్యమాన్ని నిర్వహిస్తూనే యితర సామ్రాజ్యవాద వ్యతిరేక శక్తులతో, శాంతికాముక శక్తులతో ఐక్య కార్యాచరణ కోసం ప్రయత్నిస్తుంది.

మన పార్టీ, ప్రజా సంఘాలు అన్ని స్థాయిలలో అఖిల భారత శాంతి సంఘీభావ సంఘం (అయిప్సో) కార్యక్రమాలకు ఎక్కువగా తోడ్పాటునిస్తూ ఆ కార్యక్రమాలలో పాల్గొంటూ, సామ్రాజ్యవాద వ్యతిరేక, శాంతి శక్తులన్నింటి ఐక్యతా వేదికగా అయిప్సోను రూపొందించేందుకుగాను శాంతి, సామ్రాజ్యవాద వ్యతిరేకత, అలీనవిధానం, భారత భద్రత, జాతీయ సమగ్రతలకోసం నిలబడే యితర అన్ని పార్టీలకు, సంఘాలకు, వ్యక్తులకు నచ్చజెప్పడానికి ప్రయత్నించాలి.

"రీగన్‌ను నిలువరించండి" అనే నినాదంతో మే 9 వ తేదీని యుద్ధ వ్యతిరేక శాంతి దినంగా పాటించాలన్న శాంతి స్నేహ సంఘాల పిలుపును జయప్రదం చేయడంలో, ఈ ఏడాదిలో అన్ని స్థాయిలలో జరిగే అయిప్సో మహాసభలలో నూతన అంతర్జాతీయ ఆర్థిక వ్యవస్థ కొరకు అయిప్సో నిర్వహించే ఉద్యమంలో

(ఎ. ఐ. టి. యు. సి కూడా యిందుకు పిలుపు నిచ్చింది) మన పార్టీ శాఖలు ట్రేడ్‌యూనియన్లు క్రియాశీలంగా పాల్గొనాలి.

యుద్ధానికి వ్యతిరేకంగా శాంతికోసం జరిగే పోరాటంలో విడదీయరాని భాగంగా వున్న నూతన అంతర్జాతీయ ఆర్థిక వ్యవస్థకై సాగే పోరాటంలో పాల్గొనాల్సిన ఆవశ్యకతను గురించి శ్రామిక ప్రజలకు తెలియచెప్పేందుకు పార్టీ ప్రజా వుద్యమాన్ని నిర్వహిస్తుంది.

భారత భద్రతకు, శాంతికి ఏర్పడుతున్న ప్రమాదం ఈ ఏడాది ఆగస్టులో భారత-సోవియట్ స్నేహ సహకార ఒప్పంద మాసోత్సవం సందర్భంగా పెద్ద ఎత్తున ప్రజలను సమీకరించాలన్న ఇస్కస్ పిలుపుకు మన పార్టీ శాఖలు ప్రత్యేక శ్రద్ధ తీసుకొని తోడ్పాటునివ్వాల్సిన ఆవశ్యకతను నొక్కిచెప్తున్నది.

2. ఈ పత్రంలో చెప్పినట్లుగా పంజాబ్ పరిస్థితి అత్యంత ప్రమాద కరంగా తయారైంది. యిది సాంప్రదాయకమైన హిందూ-సిక్కు ఐక్యతకు తీవ్ర మైన ముప్పు తెచ్చిపెట్టడమే కాకుండా మన దేశ భద్రత, ఐక్యతలకు ప్రమాద కారిగా పరిణమించింది. భారత్‌ను అస్థిరీకరించాలని, ముక్కలు చేయాలనే తమ వ్యూహంలో భాగంగా అమెరికా సామ్రాజ్యవాదులు, జియా సైనిక ప్రభుత్వం పంజాబులోని తీవ్రవాదులకు సహాయం చేస్తూ ప్రోత్సహిస్తున్నాయి.

చిరకాలంగా వస్తున్న హిందూ-సిక్కు ఐక్యతను విచ్ఛిన్నం చేయడానికి జరుగుతున్న యత్నాలు సఫలీకృతం కానడానికి అనుమతిస్తే దేశంలోని యితర ప్రాంతాలపై దాని పర్యవసానాలు తీవ్రంగా వుంటాయి.

ఈ పరిస్థితులలో మన తక్షణ, అత్యంత ముఖ్యమైన కర్తవ్యం ఏమంటే జాతీయ ఐక్యత మత సామరస్యాలకు కట్టుబడివున్న శక్తులన్నింటి సాధ్యమై నంత విస్తృత ఐక్యలను నిర్మించడానికి ప్రయత్నించడం, సిక్కు తీవ్రవాదుల ప్రమాదకర కార్యకలాపాలకు, అలాగే పచ్చి హిందూ మతతత్వ శక్తులకు వ్యతి రేకంగా ఈ ఉద్యమం ఎక్కుపెట్టబడాలి.

స్వర్ణ దేవాలయం నుండి, యితర గురుద్వారాల నుండి సంఘ వ్యతిరేక శక్తులను, తీవ్రవాదులను వెళ్ళగొట్టడానికి చర్యలు తీసుకోవాల్సిందిగా ఎస్. జి. పి. సి.పై, అకాలీదళ్ నాయకత్వంపై వత్తిడి తెచ్చేందుకు పంజాబులోని సిక్కుల, అలాగే దేశంలోని యితర ప్రాంతాలలో ఉన్న సిక్కుల ప్రజాభిప్రాయాన్ని సమీక రించేందుకు ప్రత్యేక చర్యలు తీసుకోవడం అవసరం. స్వర్ణదేవాలయం ఆవరణలో ఎస్ జి పి పి కి చెందిన లైసెన్సు వున్న ఆయుధాలు మినహా మరే ఆయుధాలు అనుమతించరాదని అన్ని జీవనరంగాలలోని ప్రముఖులైన సిక్కుల తరఫున ఒక డిమాండ్‌ను ముందు పెట్టించాలి.

పంజాబ్ సమస్యకు వెంటనే ఒక పరిష్కారం కనుగొనకపోతే, తీవ్ర వాదుల కార్యకలాపాలను ఆపకపోతే పరిస్థితి అదుపుతప్పి, ఒక్క పంజాబులోగాక యితర ఉత్తరాది రాష్ట్రాలలో కూడా మత ఘర్షణలను రెచ్చగొట్టే ప్రమాదకర పరిణామాలు ఏర్పడటానికి అవకాశాలున్నాయి.

హర్యానా, ఢిల్లీ, ఉత్తరప్రదేశ్ వంటి రాష్ట్రాలలో యింకా యితర రాష్ట్రా లలోని పార్టీ హిందూ మతోన్మాదులకు వ్యతిరేకంగా, "ప్రతీకారం"వంటి నినాదా లను ప్రచారంచేసే యితరులకు వ్యతిరేకంగా ప్రజాభిప్రాయాన్ని సమీకరించడం ఎంతో అవసరం. అలాంటి నినాదాలు వేర్పాటువాదులు, తీవ్రవాదులకే ఉపయోగ పడతాయనే వాస్తవాన్ని సామాన్య ప్రజలు గుర్తించేలా మన పార్టీ సహాయ పడాలి. ఈ కర్తవ్య నిర్వహణలో పార్టీ యితర అన్ని ప్రగతిశీల, ప్రజాస్వామిక లౌకిక శక్తుల సహకారాన్ని స్వీకరించాలి.

మన ప్రచారోద్యమంలో మనం సాచివేత విధానాన్ని విడనాడవలసిందిగా కేంద్ర ప్రభుత్వాన్ని డిమాండ్ చేయాలి. 1983 జూన్ 30 న జరిగిన లౌకిక ప్రజా స్వామ్య ప్రతిపక్ష పార్టీల సమావేశం ఆమోదించిన తీర్మానం ప్రాతిపదికగా లేదా గరిష్ఠ స్థాయిన ఏకాభిప్రాయం సాధించగలిగే మరే యితర పరిష్కారమార్గం ప్రాతి పదికగా అయినా పంజాబ్ సమస్యకు ఒక పరిష్కారాన్ని కనుగొనేందుకు త్రైపా క్షిక సమావేశాన్ని ఏర్పాటుచేయాలని మనం కోరాలి.

తీవ్రవాదుల హత్యాకాండ, విద్రోహ చర్యలను నిలుపుచేసేందుకు సమర్థ వంతమైన చర్యలు తీసుకోవాలని కూడా మనం ప్రభుత్వాన్ని డిమాండ్ చేయాలి. తీవ్రవాదుల విధ్వంసకాండ మారణకాండలను నిర్ద్వంద్వంగా ఖండిస్తూ ముందుకు రావాలని, జాతి వ్యతిరేక, సంఘ వ్యతిరేకశక్తులు తమ నీచమైన కార్యకలా పాలకు గురుద్వారాలను ముఖ్యంగా స్వర్ణదేవాలయాన్ని ఉపయోగించుకోకుండా నిరో ధించాలని మనం అకాలీదళ్ నాయకత్వాన్ని కోరాలి. పంజాబ్ పరిస్థితిని తమ స్వంత సంకుచిత ప్రయోజనాలకోసం ఉపయోగించుకుంటూ, దేశంలోని యితర రాష్ట్రాలకు మత విద్వేషాలను వ్యాపింపజేస్తున్న బి. జె. పి.,యితర హిందూ మత తత్వ శక్తుల కార్యకలాపాలను మనం బహిర్గతం చేయాలి.

ఈ విషయంలో ఎ. ఐ. వై. ఎఫ్. యితర లౌకిక ప్రజాస్వామిక యువజన సంఘాలు నిర్వహించాలని తలపెడుతున్న ఐక్య ఉద్యమానికి మన పార్టీ శాఖలు పూర్తి తోడ్పాటు నందించాలి.

3. మన పార్టీ శాఖలు తమ జాతీయ ఉద్యమంలో భాగంగా అస్సాంలోని విదేశీయుల సమస్యకు ఎలాంటి జాప్యంలేకుండా సంప్రదింపులద్వారా ఒక పరిష్కా రాన్ని సాధించాలని, ఎన్నికల కమిషన్ సిఫార్సు మేరకు ఓటర్ల జాబితాలను

సవరించాలని, వాటి ప్రాతిపదికగా రానున్న సార్వత్రిక ఎన్నికలు జరపాలని కూడా డిమాండ్ చేయాలి.

4. ట్రేడ్‌యూనియన్ రంగంలో ధరల పెరుగుదల, లాకౌట్లు, మూసి వేతలు వంటి సమస్యలపై, యితర కార్మికవర్గ డిమాండ్లపై మనం కార్మికవర్గ పోరాటాలను బలపరచడంతోపాటు ట్రేడ్ యూనియన్ ఐక్యత కోసం ఎ ఐ టి యు సి బెంగుళూరు మహాసభ యిచ్చిన పిలుపును మనం చిత్తశుద్ధితో కార్మికుల సమీకరణ, వారిని విద్యావంతులను చేయడం ద్వారా ముందుకు తీసుకుపోవాలి.

లక్షలాదిమంది అసంఘటిత కార్మికులను సంఘటితపరచేందుకు, వారి దుర్భర జీవన స్థితిగతులను మెరుగుపరిచేందుకు పోరాడాలని ఎ. ఐ. టి. యు. సి బెంగుళూరు మహాసభ యిచ్చిన పిలుపు ఎంతో రాజకీయ ప్రాధాన్యత కల్గినది. పార్టీ యూనిట్లు ఈ సమస్యను తీసుకొని శక్తివంచన లేకుండా ట్రేడ్ యూని యన్లకు సహాయపడాలి.

గ్రామీణ ప్రాంతాలలో మన పార్టీ యూనిట్లు వ్యవసాయ కార్మికులకు సహేతుకమైన వేతనాలకోసం, వారి యితర డిమాండ్ల సాధనకు బి. కె. ఎం. యు నిర్వహించిన ఉద్యమాలను బలపరచాలి.

భూసంస్కరణల చట్టాల కళ్ళుగప్పి, భూస్వాములు ఎంతో భూమిని అక్రమంగా తమ ఆక్రమణలో ఉంచుకున్న విషయం తెలిసిందే. వారు తమ నీచ ప్రయోజనాల సాధనకై కొత్త ఎత్తుగడలకు పాల్పడుతున్నారు. సాయుధ గూండా లను, ప్రభుత్వ యంత్రాంగాన్ని ఉపయోగించుకోవడంతోపాటు కొన్ని సందర్భా లలో వ్యవసాయ కార్మికులకు వ్యతిరేకంగా రైతులను, మరికొన్ని సందర్భాలలో వ్యవసాయ కార్మికులలోని ఒక వర్గాన్ని మరో వర్గంపై రెచ్చగొడుతున్నారు.

మన రాష్ట్ర పార్టీ శాఖలు మిగులుభూముల భూస్వాముల అక్రమ ఆక్ర మణలలో నున్న కేసులను గుర్తించి, బి. కె. ఎం. యు. కిసాన్ సభల సహకారంతో భూ పోరాటాలు నిర్వహించాలి.

ఎన్. ఆర్. ఇ. పి, ఆర్. ఎల్. ఇ. జి. పి అలాంటి యితర సంక్షేమ పథ కాలక్రింద సహాయం ఏ మేరకు సాధ్యమైనా దానిని పొందేందుకు మన పార్టీ పోరాడాలి.

7. కట్టుబానిస విధానాన్ని రూపుమాపాలని ఇందిరాకాంగ్రెస్ ప్రభుత్వం పదే పదే చెప్పుకుంటున్నప్పటికీ అన్ని రాష్ట్రాలలో వెనుకబడిన, గిరిజన ప్రాంతా లలో మధ్యయుగాలనాటి ఈ అమానుష పద్ధతి యింకా అమలులోనే ఉన్నది. కట్టు బానిసలుగా క్రమ్గుతున్న ఈ దురదృష్టవంతులైన ప్రజల హృదయవిదారక గాథలు

పత్రికలలో ప్రచురించబడుతూనే ఉన్నాయి. దీనికి సంబంధించి యిటీవల ఆసియాడ్ కార్మికులు, మరియు క్వారీ. రాళ్ళుకొట్టే కార్మికులకు అనుకూలంగా సుప్రీంకోర్టు రెండు ముఖ్యమైన తీర్పులు యిచ్చింది. కట్టుబానిసల పోరాటంలో ఈ తీర్పులను ఆయుధాలుగా ఉపయోగించుకోవచ్చు.

మన పార్టీ యూనిట్లు చిత్తశుద్ధితో ఈ సమస్యను చేపట్టి అమానుష జీవన పరిస్థితులనుండి కట్టుబానిసలను విముక్తి చేయాలి.

అదేవిధంగా ఆదివాసుల సమస్యలను కూడా మన పార్టీ చేపట్టాలి. వారు కాంట్రాక్టర్ల నుండి మెరుగైన వేతనాలకోసం, అటవీశాఖ అధికారుల పీడనకు వ్యతిరేకంగా, అటవీ సంపదపై వారికి హక్కుకోసం, ఎంతోకాలంగా వారు సాగు చేసుకుంటున్న భూమిపై వారికి హక్కుకోసం పార్టీ యూనిట్లు కృషి చేయాలి.

8 గుత్తాధిపతులు, బడా వ్యాపారులు ఇందిరాకాంగ్రెస్ ప్రభుత్వ సహాయంతో మార్కెట్‌లోని అవకతవకలను ఉపయోగించుకుంటూ రైతుల ఉత్పత్తులకు గిట్టుబాటు ధరలు చెల్లించడానికి నిరాకరిస్తూ రైతులను దోచుకుంటున్న సంగతి తెలిసిందే. అందువల్ల మన పార్టీ యూనిట్లు గిట్టుబాటు ధరలకోసం, ఇరిగేషన్ సౌకర్యాల పెంపుకోసం, యితర డిమాండ్లపై కిసాన్ సభ నిర్వహించే పోరాటాలను బలపరచాలి.

9. మహిళా సంఘం మహిళలపై సామాజిక పీడనకు వ్యతిరేకంగా, వరకట్న చావులకు వ్యతిరేకంగా, కఠినమైన వరకట్న నిషేధ చట్టంకోసం, దేశవ్యాపితంగా గొప్ప ఆందోళన సాగిస్తున్నది. ఈ లక్ష్య సాధనలో మహిళా కామ్రేడ్స్‌కు మన పార్టీ యూనిట్లు అన్నిరకాల సహాయాన్ని అందజేయాలి. ★

# ఫాసిస్టు నియంతృత్వానికి వ్యతిరేకంగా పోరాటం

హ్యూగో క్యాంపస్
(పెరాగ్వా కమ్యూనిస్టు పార్టీ కేంద్ర కమిటీ రాజకీయ కమిషన్ సభ్యుడు)
రొగెలియో గొంజాలెజ్
(పెరాగ్వా కమ్యూనిస్టు పార్టీ కేంద్ర కమిటీ సభ్యుడు)

ఈ సంవత్సరం మా జాతీయ రాజకీయాల్లో జరిగిన ఒక సంఘటన ప్రాముఖ్యతను అధిక అంచనావేయడం కష్టమే. చాలాకాలం క్రితం పాశవిక ఫాసిస్టు నియంతృత్వం అధికారంలోకి వచ్చింది లగాయతు, మొట్టమొదటిసారిగా ప్రతిపక్ష సభ్యులు రాజధానిలో గొప్ప రాజకీయ సభ నిర్వహించారు. పౌర జీవనాన్ని ప్రజాతంత్రీకరించాలనీ ఆర్థిక వ్యవస్థకు గట్టి పునాది కల్పించాలనీ ఇందుకవసరమైన నిర్దిష్టమైన చర్యలను వెంటనే తీసుకోవాలనీ సభ డిమాండ్ చేసింది. గత మూడు దశాబ్దాలుగా కొనసాగుతున్న అత్యవసర పరిస్థితిని ఉపన్యాసకులు ఖండించారు. సభ జరిగిన చౌకు వద్దకు పోలీసు బలగాలను పెద్ద సంఖ్యలో పంపారు కానీ వారు సభను చెదరగొట్టే సాహసం చేయలేకపోయారు. సభలో పాల్గొన్నవారు, "సైనిక నియంతృత్వం అంతం కావాలి" అని నినాదాలు చేశారు.

ఎంతగా భయోత్పాతం, దమనకాండలకు పాల్పడినప్పటికీ లాటిన్ అమెరికాలోని కెల్లా దీర్ఘ వయసుగల క్రూరపాలన, శ్రామిక ప్రజల సంకల్పాన్ని చెదరగొట్టలేకపోయింది. (పెరాగ్వాలో 1954 లో స్ట్రోస్నర్ అధికారంలోకి వచ్చాడు)

పెరాగ్వా ఫాసిస్టు సైనికపాలన అవిచ్ఛిన్నంగా కొనసాగుతున్నదంటే అందుకు యేకైక కారణం అమెరికా సామ్రాజ్యవాదమే. సైనిక పాలనకు అమెరికా సామ్రాజ్యవాదం నుంచి దండిగా ఆర్థిక, రాజకీయ, సైనిక సహాయం అందు

తున్నది. పోలీసు, సైనిక వ్యవహారాల్లో సి. ఐ. ఏ. సలహాదార్లు నిస్సిగ్గుగా జోక్యం చేసుకుంటున్నారు.

అమెరికానుంచి తనకు లభించే "ప్రయోజనాలకు" మారుగా పెరాగ్వే సైనిక పాలకులు, రీగన్ ప్రభుత్వం అవలంబించే సైనిక, విస్తరణ విధానానికి మద్దతు ఇవ్వడమేకాక, విదేశీగుత్త సంస్థలపై మా దేశం ఆర్థికంగా ఆధారపడేలా చేస్తున్నారు. రీగన్ ప్రభుత్వం సైనిక, విస్తరణ విధానం అవలంబిస్తున్నదన డానికి అది గ్రెనడాపై చేసిన దాడియే నిదర్శనం.

పెరాగ్వే కమ్యూనిస్టుపార్టీ కార్యక్రమంలో ఇలా వుంది: "ప్రపంచ పెట్టు బడిదారీ వ్యవస్థలో పెరాగ్వే అంతర్భాగం; సామ్రాజ్య వాదం ఆర్థికంగా ఆధా పడిన బడుగుదేశం."[1] స్వాతంత్ర్యం సంపాయించినప్పటికీ దాస్యంలో వున్నటు వంటి లాటిన్ అమెరికా దేశాల గురించి లెనిన్ చేసిన సిద్ధాంతం వాస్తవమని చరిత్ర సంపూర్ణంగా నిరూపిస్తున్నది. "లాటిన్ అమెరికా రిపబ్లిక్కులు రాజకీయంగా స్వాతంత్ర్యం పొందినవే అయినప్పటికీ అవి వాస్తవానికి ఆర్థిక, దౌత్య పరాధీనత అనే వలలో చిక్కుపడి వున్నాయని"[2] లెనిన్ అన్నారు.

సామ్రాజ్యవాదం స్వభావం గురించీ, స్వార్థపర విస్తరణవాద లక్ష్యాలను అవలంబించడంలో సామ్రాజ్యవాదం పనిముట్టుగా స్థానిక పాలకుల పాత్ర గురించీ లెనిన్ చేసిన సిద్ధాంతం వాస్తవమని పెరాగ్వే చరిత్ర సూచిస్తున్నది. "సామ్రాజ్య వాదం అన్నది హింసాకాండ దిశగా, ప్రతీపతత్వం దిశగా సాగుతున్న యత్నం" అని లెనిన్ సరిగానే నొక్కి చెప్పారు. ఆయన ఇంకా ఇలా అన్నారు. "సామ్రాజ్య వాదం యొక్క ప్రత్యేక లక్షణాలు సర్వత్రా ప్రతీపతత్వమూ, అధికాధిక జాతీయ పీడన." "రాజకీయ వ్యవస్థ యేదైనప్పటికీ ఫలితం సర్వత్రా ప్రతీపతత్వం."

## పెరాగ్వే తరహా ఫాసిజమ్

కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ 7 వ మహాసభకు సమర్పించిన తన నివే దికలో జార్జి డిమిట్రావ్ ఇలా అన్నారు. "అధికారంలో వున్న ఫాసిజం అంటే ఫైనాన్షియల్ పెట్టుబడి యొక్క అత్యంత ప్రగతి నిరోధకమైన అత్యంత జాతీయ దురహంకారంగల అత్యంత సామ్రాజ్యవాద తత్వపు పచ్చి భయోత్పాత నియం తృత్వం."

పెరాగ్వే ఫాసిజమ్ తన మితవాద, ప్రతీపతత్వ సారంలోని విశిష్ట లక్షణా లేవీ మారవు. పాశవిక దమనకాండలోనూ, వేలాది దేశభక్తుల అరెస్టులోనూ,

1. సూత్రాలు నెం 1. (1973) పుట 19.

2. వి. ఐ. లెనిన్, కలెక్టెడ్ వర్క్స్. సంపుటి 22, పుట 263.

నిర్బంధాల్లోనూ, సోదాలు సాగించడంలోనూ, రైతాంగంపై దాడుల్లోనూ, అనుమానింపబడిన వ్యతిరేకులను హింసించడంలోనూ, హత్యచేయడంలోనూ, వారిని మాయం చేయడంలోనూ స్ట్రోస్నర్ నియంతృత్వంలో ఫాసిజం తన "భేషైన లక్షణాలను వ్యక్తం చేస్తుంది. కమ్యూనిస్టుపార్టీ నాయకులను, కార్యకర్తలను చిత్రహింసకు గురిచేయడమూ వారిని చంపివేయడమూ నిత్యకృత్యంగా వుంటున్నాయి. ఇది వారి అధికార విధానంగా వుంటున్నది. "కమ్యూనిజం లేని ప్రజాస్వామ్యం" అన్నది వారి నినాదం. వీటికి తోడుగా రాజకీయ విపక్షులు, నిరవధికంగా జైల్లో వుంచడం, "అంతర్జాతీయ కమ్యూనిజం యొక్క విద్రోహ చర్యలను" అరికట్టే సాకుతో స్వేచ్ఛను హరించే తీవ్రమైన ప్రజాతంత్ర వ్యతిరేక చట్టాలు అమలుపరచడమూ వున్నాయి. నియంతృత్వ పాలన ట్రేడ్ యూనియన్ వ్యవహారాల్లో దారుణంగా జోక్యం చేసుకుంటున్నది. యూనియన్ నాయకత్వంలో పోలీసులనూ, యజమానుల ఏజెంట్లను నియమిస్తున్నది. పెరాగ్వే ఫాసిజంకు ఈ క్రింది స్వభావాలున్నాయి. మొదటిది- శాశ్వతమైన ఎమర్జెన్సీ. ఎమర్జెన్సీ వల్ల సర్వ ప్రజాతంత్ర హక్కులను పాలన రద్దుచేయగలిగింది. రాజ్యాంగంలోని 79 వ ఆర్టికల్ మేరకు నువ్వు అరెస్టు కాబడ్డావంటూ హెబియస్‌కార్పస్ సూత్రాన్ని లేవనెత్తిన ప్రతి డిటెన్యూతోనూ పోలీసులు అంటారు. "రిపబ్లిక్ అధ్యక్షుని ఆదేశం మేరకు" నిర్బంధించాం అంటారు. 1982 లో సుప్రీమ్ కోర్టు చేసిన నిర్ణయం వల్ల పరిస్థితి మరింత అధ్వాన్నం అయింది. "రాజకీయ అధికారానికి చెందిన ఏ ప్రతినిధి అయినా అరెస్టు చేయడానికి ఆ నిర్ణయం వీలు కల్పిస్తుంది. ఈ విధంగా "హెబియస్ కార్పస్" సూత్రం ఆచరణలో రద్దుకాబడింది. నిందితులలో ఎక్కువమందిని విచారణకు కూడా తీసుకురావడంలేదు.

రెండవది- దగా ఎన్నికల పద్ధతి. ఇది ప్రజాభిప్రాయాన్ని గేలిచేయడం తప్ప మరొకటి కాదు. ఒకేరకం ఎన్నికల ప్రహసనం ఐదేళ్ళకోసారి వర్ధమిస్తుంది. అది కూడా వేధించే వాతావరణంలో కమ్యూనిస్టుల, క్రిష్టియన్ డెమోక్రట్ల వగైరా ప్రతిపక్షాల కార్యక్రమాలను నిషేధించిన వాతావరణంలో ఈ ఎన్నికల తంతు నిర్వహింపబడుతుంది. ప్రభుత్వాధికారులు మాత్రమే ఓటర్ల లిస్టు తయారుచేస్తారు. ఇందువల్ల యావజ్జీవ పర్యంతం నియంతగా వుండే జనరల్ స్ట్రోస్నర్‌కు ప్రతి ఎన్నికల ప్రహసనంలోనూ 87 నుంచి 90 శాతం దాకా ఓట్లు వస్తాయి.

"ప్రాతినిధ్య ప్రజాస్వామ్యం" ముసుగులో ఫాసిస్టు పాలనను కొనసాగించడమే ఈ ఎన్నికల తంతు ఉద్దేశం. మానవ హక్కుల పరిస్థితి పెరాగ్వేలో "మెరుగవుతున్నదని" రీగన్ నాయకత్వాన అమెరికా సామ్రాజ్యవాదులు ప్రకటించుకోడానికి ఇది వీలు కల్పిస్తుంది. ఎల్‌సాల్వడార్ విషయంలో వారిలాగే చేశారు.

మూడవది—స్ట్రోస్నర్ నాయకత్వాన వున్న సైనిక ఫాసిస్టు ముఠా చేతు లోనే ప్రధాన రాజ్యాధికారాలు వున్నాయి. అతి ముఖ్యమైన నిర్ణయాలను స్ట్రోస్నర్ తీసుకుంటాడు. చట్టబద్ధం చేసిన దొంగ వ్యాపారం వల్లనూ, రహస్య ఒప్పం దాల వల్లనూ, మాదకద్రవ్యాల అమ్మకం వల్లనూ, చట్టా వ్యాపారం వల్లనూ, విస్తారంగా సంపద పోగుచేసిన అవినీతి పాలకులు తమ స్వార్థ ప్రయోజనాల కోసం జువాన్‌రమన్ కావెజ్ నాయకత్వంలోని నేషనల్ రిపబ్లికన్ అసోసియేషన్ లోని కొన్ని విభాగాలను వాడుకుంటున్నారు. (ఈ పార్టీని కొలొరాడో పార్టీ అని అంటారు. కూడా)

ఎక్కువ ఆదాయాలు వచ్చే ఉద్యోగాల్లో నియమించడం ద్వారానూ, నీతి బాహ్యమైన పద్ధతుల ద్వారా సంపాయించిన డబ్బులో వాటా యివ్వటం ద్వారానూ, కొలొరాడో పార్టీని పాలకపార్టీగా చేయడం ద్వారానూ జనరల్ స్ట్రోస్నర్ ఆ పార్టీ నాయకత్వాన్ని తన అదుపులోకి తెచ్చుకోగలిగాడు ఇంతకంటె విశేషమేమిటంటే సైనికాధికారులనూ, పౌర శాఖ అధికారులను ఇంకా ఇతరు లను కొలొరాడో పార్టీలో చేరవలసిందిగా ఆ పెద్దమనిషి ఆదేశాలిచ్చాడు. ఈ పార్టీ లాటిన్ అమెరికా నియంతల రాజకీయ ఆలయంగా తయారయింది.

అయితే దేశంలోని ఆంతరంగిక పరిస్థితిని గురించి స్ట్రోస్నర్‌కు, అతని ప్రజా వ్యతిరేక, సామ్రాజ్యవాద అనుకూల విధానాన్ని వ్యతిరేకించే వైఖరి చేప ట్టిన రాజకీయ నాయకులు కూడా కొలొరాడో పార్టీలో వున్నారు.

నాలుగవది – తన క్రింది వారిలో ముఖ్యంగా ఉన్నత సైనికాధికార్లలో అవినీతిని నియంత ప్రోత్సహిస్తున్నాడు. తనతో వారిని మరింత గట్టిగా కట్టిపడేసు కోడానికి అలా ప్రయత్నిస్తున్నాడు. తన క్రింది స్థాయి ఉప పాలకులు భూస్వా ములు కావడానికీ, పశువులమందల యజమానులు కావడానికీ, నిరపాయంగా స్మగ్లింగ్ చేసుకోడానికీ, మత్తుమందులు అమ్ముకోడానికీ, చట్టా వ్యాపారం చేసు కోడానికి ఆ మనిషి అవకాశాలు కల్పిస్తున్నాడు. ఇది ఆ నియంత మాటల్లోనే చెబితే "ఇది ఆంతరంగిక శాంతి యొక్క మూల్యం."

అయిదవది-- విషపూరితమైన కమ్యూనిస్టు వ్యతిరేక, సోవియట్ వ్యతిరేక ప్రచారం ముసుగులో ఫాసిస్టు నియంత తన ప్రజా వ్యతిరేక నేరాలను కప్పిపుచ్చు కోడానికి ప్రయత్నిస్తున్నాడు. అమెరికా సామ్రాజ్యవాదుల్లోని యుద్ధోన్మాదుల సైనిక, దురాక్రమణ విధానాన్ని ప్రభుత్వం బలపరుస్తున్నది. నియంత స్ట్రోస్నర్ "స్వేచ్ఛా క్రిస్టియన్ ప్రపంచ" ప్రతినిధిగా చెప్పుకుంటూ నికరాగ్వా పైనా ఇతర మధ్య అమెరికా దేశాల పైనా, కరేబియన్ దేశాల పైనా దాడి చేయాల్సిందిగా వాషింగ్టన్‌కు విజ్ఞప్తి చేస్తున్నాడు. రీగన్ చెప్పినట్లు 'కమ్యూనిజమ్‌ను' హత్య

చేయడానికిగాను చిన్ని గ్రెనడాపై అమెరికా చేసిన అప్రతిష్టాకరమైన దాడిని యీ పెద్దమనిషి ప్రశంసించాడు. అమెరికా అధ్యక్షుని హుక్కులను ప్రతిధ్వనిస్తూ, అదే లక్ష్యం కోసం, సోషలిస్టు ప్రపంచానికి వ్యతిరేకంగా క్రూసేడ్ (మతయుద్ధం) ప్రకటించాల్సిందిగా ఇతడు వాదిస్తున్నాడు.

1967 లో కీలుబొమ్మ జాతీయ రాజ్యాంగ నిర్ణాయక సభచే ఆమోదించబడిన కొత్త "రాజ్యాంగం" "వర్గ పోరాటం" నిషేధం విధిస్తున్నది.

మా దేశంలోని సామాజిక, ఆర్థిక వాస్తవాలకూ, శత్రుత్వ వర్గాల ఉనికికీ వ్యతిరేకంగా వున్న యీ ప్రొవిజన్ హాస్యాస్పదంగా వుంది. శ్రామిక ప్రజల పైనా, వివిధ రాజకీయ శక్తులపైనా ముఖ్యంగా పెరాగ్వా కమ్యూనిస్టుపార్టీ పైనా చేసే అకృత్యాలకు చట్టబద్ధ స్వరూపం ఇచ్చుకోడానికిగాను పోలీసులు యీ ప్రొవిజన్‌ను వాడుకుంటున్నారు. కమ్యూనిస్టులంటే "వర్గ పోరాటాన్ని కనిపెట్టినవారు" అని ప్రగతి నిరోధకులు దుష్ప్రచారం చేస్తున్నారు. ఇందువల్ల మేము మార్క్స్ వ్రాతలను ఉటంకించాలనుకుంటున్నాం. మార్క్స్ ఇలా అన్నారు: "ఆధునిక సమాజంలో వర్గాల వునికిని ఆవిష్కరించినందుకు కానీ నాకు ఘనత దక్కాల్సిన పని లేదు. నాకంటె చాలా ముందే యీ వర్గపోరాటాల చారిత్రకాభివృద్ధిని బూర్జువా చరిత్ర రచయితలు వర్ణించారు; వర్గాల ఆర్థిక నిర్మాణాన్ని గురించి బూర్జువా అర్థశాస్త్రవేత్తలు అభివర్ణించారు. నేను చేసిన కొత్త విషయం యేమిటంటే, యీ క్రింది విషయాలు నిరూపించాను. 1. ఉత్పత్తి అభివృద్ధిలోని నిర్దిష్ట చారిత్రక దశలతో వర్గాల వునికి ముడిపడి వుంది. 2 వర్గపోరాటం తప్పనిసరిగా శ్రామికవర్గ నియంతృత్వానికి దారితీస్తుందనీ 3. ఈ నియంతృత్వం అన్ని వర్గాల రద్దుగా వర్గరహిత సమాజ స్థాపనగా పరివర్తన చెందుతుందనీ"[3]

ప్రభుత్వ వ్యతిరేకులపై భయోత్పాత చర్యలు సాగించడానికి "వర్గ పోరాటంపై నిషేధం" అవసరమని దాని వునికిని సైనిక ప్రభుత్వం సమర్థించుకుంటున్నది. నిర్బంధ చట్టాలను వుపయోగించుకుంటూ ముఖ్యంగా "శాంతి, వ్యక్తిగత స్వేచ్ఛ రక్షణకు" వున్న చట్టం 209, "ప్రజాస్వామ్య రక్షణ"కై వున్న చట్టం 294 లను (కమ్యూనిస్టుల "తిరుగుబాటు" వల్ల అంతరంగిక శాంతికి ముప్పువాటిల్లింది అంటున్నారు) వాడుకుంటూ అన్నివర్గాలకు చెందిన కార్మికోద్యోగులతో సహా అన్ని పార్టీలకు చెందిన ప్రజాతంత్రవాదులనూ, దేశభక్తులను శిక్షిస్తున్నారు.

జాతీయ ప్రయోజనాలకు తాను చేస్తున్న ద్రోహాన్ని కప్పిపుచ్చుకోడానికి యీ క్రూర ప్రభుత్వం జాతీయ దురహంకార చర్యలకు పాల్పడుతున్నది.

---

3. కార్ల్ మార్క్స్, ఫ్రెడరిక్ ఎంగెల్స్‌ల సెలెక్టెడ్ వర్క్స్, మొదటి సంపుటి, పుట 528, మాస్కో 1969.

ప్రకృతి వనరులనూ, ఆర్థిక వ్యవస్థనూ, సార్వభౌమాధికారాన్ని సామ్రాజ్యవాద గుత్త సంస్థలకూ, అంతర్జాతీయ పెట్టుబడికీ అప్పగించడంలో ఆ ద్రోహం వ్యక్త మవుతున్నది.

పెరాగ్వా ఫాసిస్టు నియంతృత్వం యొక్క కొన్ని లక్షణాలు ఇవి:

## సామ్రాజ్యవాద సంకెళ్ళు

చమురు, యురేనియం, హైడ్రోఎలెక్ట్రిక్ ఇంధనవనరులు, సారవంతమైన భూములు వగైరాలలో పెరాగ్వా అసాధారణమైన సంపదవంత దేశం. అయితే యీ సంపదంతా ప్రజలకు చెందదు ఎందుచేతనంటే– నియంతృత్వ పాలన సాగిన యేళ్ళల్లో ఆరు ప్రధాన బహుళజాతి కంపెనీలు ఆ సంపదను స్వాయత్తం చేసు కున్నాయి. అమెరికాకు చెందిన రెప్సా అనే నూనె కంపెనీ, ఇతర విదేశీగుత్త కంపెనీలు దేశాన్ని నిలువునా దోచేస్తున్నాయి. భారీ స్థాయిలో చట్టబద్ధంగా సాగే స్మగ్లింగ్ మా పరిశ్రమలను నాశనం చేస్తున్నది. సోషలిస్టు దేశాలతో వ్యాపారం చేయకూడదు. అన్న షరతుపై సామ్రాజ్యవాద బ్యాంకీలు పరపతి ఇస్తున్నాయి.

సారవంతమైన భూముల్లో నాలుగింట మూడువంతులు స్ట్రోస్నర్ అధీనం లోనూ, ఆయన క్రింది అధికారుల అధీనంలోనూ, విదేశీయుల అధీనంలోనూ వున్నాయి. ప్రజలు దారిద్ర్యంలో మగ్గిపోతున్నారు. పెరాగ్వా పౌరుల్లో ప్రతి ముగ్గురిలోనూ ఒకరు ఆకలి బారినుంచి, శిక్షల బారినుంచి తప్పించుకోడానికి దేశం వదిలి పారిపోతున్నారు.

70 ల అనంతరం దేశ ఆర్థిక వ్యవస్థలో స్తంభన ప్రవేశించింది. ఇటీవు హైడ్రో ఎలక్ట్రిక్ ప్రాజెక్టు పై కేటాయింపుల్లో బాగా కోతలు పెట్టారు. 1983 ఉత్తరార్థంలో నిరుద్యోగుల సంఖ్య మూడు లక్షలకు పెరిగింది. అనగా మొత్తం శ్రమజీవులలో నిరుద్యోగుల శాతం 30. గత సంవత్సరం ఎగుమతులు 25 శాతం కంటే ఎక్కువే తగ్గిపోయాయి. నూలు ఎగుమతులు 60 శాతం తగ్గిపోయాయి. పెరాగ్వా నియంతృత్వ ప్రభుత్వం ఐ.ఎమ్.ఎఫ్. డిమాండుకు లోబడి వేతనాలను పసుల స్థాయిలో స్తంభింపచేసింది. విదేశీ రుణం పెరిగిపోతున్నది. ఎగుమతుల ఆదాయంలో సగానికి పైగా విదేశీ రుణాలపై చెల్లింపులకే సరిపోతున్నది. ప్రస్తుత ఆర్థిక యిబ్బందులకు ప్రపంచ సంక్షోభమే కారణమని ఆరోపిస్తూ ప్రజలను మోస గించడానికి ప్రభుత్వం ప్రయత్నిస్తున్నది. ఈ పరిస్థితికి కారణం ఒక్క బయటి అంశాలే కాదని పెరాగ్వా యొక్క వెనుకబడిన సామాజిక ఆర్థిక వ్యవస్థ, సామ్రాజ్యవాదంపై ముఖ్యంగా అమెరికా గుత్త కంపెనీలపై పరాధీనత కూడా కారణాలని మా పార్టీ పదేపదే స్పష్టీకరించింది. నిర్దాక్షిణ్యంగా దోపిడీకి గురవు తున్నటువంటి, అష్టకష్టాలు పడుతున్నటువంటి శ్రమజీవులకు ఉపశమనం కల్పిం

చడం ప్రస్తుత వ్యవస్థలో అసాధ్యం. తీవ్రమైన మార్పులు తీసుకురావాల్సిన అవసరం వుంది. ప్రజాతంత్ర, వ్యవసాయిక, సామ్రాజ్య వ్యతిరేక విప్లవానికి వస్తుగత పరిస్థితులు పరిపక్వం చెందాయి.

పెరాగ్వేలోని విస్తారమైన ప్రకృతి వనరులు, దక్షిణ అమెరికాలోని మధ్య భాగంలో ఆ దేశం ఉనికి యీ రెండు కూడా అమెరికా సామ్రాజ్యవాదులను ఆకర్షిస్తున్నాయి. మా దేశాన్ని వ్యావసాయిక, పశుపోషక దేశంగా ముడిసరుకుల కేంద్రంగా వుంచాలని అమెరికా పాలకులు అనుకొంటున్నారు. వారు అదే సమయములో మా దేశాన్ని సైనిక స్థావరంగా లాటిన్ అమెరికా దేశాలపై సైనిక జోక్యానికి ఉపయోగపడే స్థావరంగా మార్చాలనుకుంటున్నారు. మా దేశ నియంతృత్వం ఇలా మార్చడానికి వీలు కల్పిస్తున్నది. 1965 లో డొమినికన్ రిపబ్లిక్ పైఅమెరికా సైనికులు జరిపిన దాడిలో పెరాగ్వే సైనికులు పాల్గొనడమే ఇందుకు నిదర్శనం. వాషింగ్టన్ దురాక్రమణ పథకాలు చాలా నీచమైన స్వభావాన్ని సంతరించుకున్నాయి. స్వేచ్ఛా, ప్రజాస్వామ్య ప్రభంజనాలు ప్రతీప మేఘాలను చెదరగొడుతూ అనేక లాటిన్ అమెరికా దేశాలను మేఘావృతం చేస్తున్నాయి. బొలివియా, అర్జెంటైనా, బ్రెజిల్, చిలీ, పెరూ, ఈక్వేడర్, ఉరుగ్వే దేశాలకు పెరాగ్వే చాలా దగ్గరగా వున్నది. తమ "మెరుపుదాడి దళాలు" పెరాగ్వే నుంచి పై దేశాల ప్రజలకు వ్యతిరేకంగా శిక్షా చర్యలు, అస్థిరీకరణ కార్య కలాపాలు కొనసాగించగలవని అమెరికా వ్యూహ నిర్ణేతలు భావిస్తున్నారు. ఇటీవల అమెరికా రక్షణశాఖ ప్రతినిధివర్గం పెరాగ్వే వెళ్ళిన సందర్భంగా ఈ అంశం చర్చకు వచ్చింది. మా పార్టీ, రీగన్ ప్రభుత్వం అవలంబించే జోక్యందారీ పథకాలను ఎండగట్టింది. వాటిని నివారించడానికి యత్నించవలసిందిగా సర్వదేశభక్త శక్తులకు పిలుపు యిచ్చింది.

## పెరుగుతున్న ప్రతిఘటన

1983 ఫిబ్రవరిలో ఎన్నికల ప్రహసనం ముగిసాక ప్రభుత్వం ప్రారంభించిన నిర్బంధ చర్యలు కార్మికులను, రైతులను మాత్రమేగాక అనేక వృత్తులకు చెందిన మేధావులను, పెటీ బూర్జువా జీవులను ఇతర సామాజిక విభాగాలకు చెందిన వారిని కూడా దెబ్బ తీస్తున్నాయి.

అయినప్పటికీ, ప్రజాతంత్ర ఉద్యమం పెరుగుతూనే వుంది. ఉద్యోగులకు, కార్మికులకు చెందిన ప్రధాన సంఘాలతో ఇంటర్ట్రేడ్ యూనియన్ సాలిడారిటీ కమిషన్ ఏర్పాటు కావడం ఇందుకు నిదర్శనం. వేతనాలు పెంచాలని ఈ సంస్థ డిమాండ్ చేస్తున్నది. ట్రేడ్ యూనియన్ వ్యవహారాల్లో ప్రభుత్వ జోక్యానికి వ్యతిరేక వైఖరిఅవలంబిస్తున్నది. పెరాగ్వే వర్కర్స్ కాన్ఫెడరేషన్ నాయకత్వం

నుంచి ప్రభుత్వ ప్రతినిధులను. యాజమాన్య ప్రతినిధులను తొలగించాలని డిమాండ్ చేస్తున్నది. కోకాకోలా బహుళజాతి గుత్త కంపెనీకి చెందిన ఉద్యోగుల సమ్మె యిందుకు మరో నిదర్శనం. తొలగింపబడిన తమ నాయకులను బలపరుస్తూ ఆ ఉద్యోగులు సామ్రాజ్య వ్యతిరేక నినాదాలను నినదించారు. రాజధానిలోని క్లినికల్ హాస్పటల్‌కు చెందిన 600 మందికి పైగా సిబ్బంది సభ్యులు చేసిన సమ్మెను కూడా యిక్కడ ప్రస్తావించవచ్చు. అరెస్టు కాబడిన తమ నాయకులను విడుదల చేయాలని వారు డిమాండ్ చేశారు. రూట్-6 నిర్మాణంలో పాల్గొంటున్న వందలాది కార్మికులు సమ్మె చేసారు. రాజధానిలోని రవాణా కార్మికులు కార్యాచరణ ప్రారంభించారు. సామాజిక సౌకర్యాలలో పెట్టిన కోతలను 43 ట్రేడ్ యూనియన్లు నిశితంగా నిరసించాయి. ఇంకా అనేక ప్రాంతాల్లో పేదరైతులు కార్యాచరణను ఉధృతం చేశారు. భూమి కావాలని, తొలగింపులకు స్వస్తి చెప్పాలని వారు డిమాండ్ చేశారు.

తమ యూనివర్శిటీ వుద్యమంలో పాల్గొన్న విద్యార్థులు కూడా పోరాటంలో పాల్గొన్నారు. తమ తోటి విద్యార్థులను అక్రమంగా అరెస్టు చేసినందుకు వారు నిరశించారు. వాక్ స్వాతంత్ర్యం కావాలని, నిర్బంధ చట్టాలను రద్దు చేయాలని వారు డిమాండ్ చేసారు. అరెసయిన వారిని విడుదల చేయాలని ప్రజాతంత్రీకరణ క్రమాన్ని నెలకొల్పాలని డిమాండ్ చేస్తూ జైల్లో వున్న వందలాదిమంది యువతీ యువకులు నిరాహారదీక్ష చేసారు. రాజకీయ ఖైదీలకు స్వేచ్ఛ యివ్వాలని ఎమర్జన్సీ పరిస్థితిని ఎత్తివేయాలని డిమాండ్ చేస్తూ రాజకీయ ఖైదీల బంధువులు బహిరంగ సభలు జరిపారు. జైళ్ళలోని దేశభక్తుల విడుదలను కోరుతూ జాతీయ, అంతర్జాతీయ సంఘీభావం పెరుగుతున్నది.

తమను అమ్ముకోడానికి తిరస్కరించిన. తమ వృత్తి సంఘాలు ఏర్పాటు చేసుకోడానికి హక్కు కావాలంటున్న, వాక్ స్వాతంత్ర్యం, పత్రికా స్వాతంత్ర్యం కావాలంటున్న జర్నలిస్టులు సైతం పోరాటంలో పాల్గొంటున్నారు. నిర్బంధ చట్టాలను రద్దు చేయాలని, కాథలిక్ చర్చి డిమాండ్ చేస్తున్నది. అవినీతినీ, అధికారాల అబద్ధ ప్రచారాన్ని ఖండిస్తూ వేలాదిమంది ప్రవాసజీవులను తిరిగి దేశానికి పిలిపించాలని చర్చి డిమాండ్ చేస్తున్నది ఖైదీల విడుదలకై చర్చి పలుసార్లు పూజలు జరిపింది.

ప్రతిపక్షాలు, ట్రేడ్ యూనియన్లు, ప్రముఖ వ్యక్తులు, మేధావులు ప్రజాతంత్రీకరణ క్రమానికై సాగించిన కార్యాచరణ- స్ట్రోస్నర్ నియంతృత్వ విధానాలకు వ్యతిరేకంగా ప్రతిఘటన పెరుగుతున్నట్లు నిరూపిస్తున్నది. దేశంలోని పరిస్థితిపై ప్రభుత్వం తప్పుడు సమాచారం అందచేస్తున్నది. పెరాగ్వాకు సంబంధించిన సత్యాలు బయటి ప్రపంచానికి తెలియనీకుండా నిరోధిస్తున్నది. అమెరికా

ఖండం ఘటనలపై పెరాగ్వా పత్రికలు ప్రచురించే వార్తలను సెన్సార్ జేస్తున్నారు. ఏది ఏమైనా లాటిన్ అమెరికా నుంచి, ప్రపంచం నుంచి పెరాగ్వాను విడదీయ లేము. బొలీవియాలో, అర్జెంటైనాలో ప్రజాస్వామ్య విజయం, బ్రెజిల్, చిలీ, ఉరుగ్వేలలో నియంతృత్వాలకు వ్యతిరేకంగా ప్రజా కార్యాచరణలు, మా ఖండం లోని యితర దేశాల్లో వెల్లువలా లేచిన జాతీయ విముక్తి ఉద్యమాలు— మా దేశం లోని ప్రతిఘటన ఉద్యమాన్ని అవి సానుకూలంగా ప్రభావితం చేశాయి. ఈ వాస్తవాలు దేశభక్తులకు ఉత్తేజం కలిగిస్తున్నవి. క్యూబాలో బ్యాటిస్టాను నికరాగ్వాలో సొమోజాను దింపినట్లే సుసంఘటితమైన ప్రజా కార్యాచరణలు స్ట్రోస్నర్‌ను, పినోచెట్‌ను, అల్వారెజ్‌ను ఇంకా, సామ్రాజ్యవాదుల ఇతర కీలుబొమ్మలను కిందికి దింపడం సాధ్యమని ఆ వాస్తవాలు నిరూపిస్తున్నవి.

లాటిన్ అమెరికాలో జాతీయ సార్వభౌమాధికారాన్ని పరిరక్షిస్తూ, సామాజిక ప్రగతిని కాంక్షించే ప్రజాతంత్ర, దేశభక్త, సామ్రాజ్య వ్యతిరేక, యుద్ధవ్యతిరేక ధోరణులు బలం పుంజుకుంటున్నాయి. సోవియట్ యూనియన్ యొక్క ప్రపంచ సోషలిస్టు వ్యవస్థ యొక్క చారిత్రక విజయాలు, అంతర్జాతీయ కార్మికవర్గ ఉద్యమ అభివృద్ధి, విస్తరిస్తున్న జాతీయ విముక్తి పోరాటం— ఇవి పై ధోరణు లను పెంపొందించడంలో నిర్ణాయక పాత్ర వహిస్తున్నాయి.

## విజయానికి ఐక్యత ముఖ్యం

స్ట్రోస్నర్ ఫాసిస్టు నియంతృత్వాన్ని కూలదోయడమే నేటి పెరాగ్వా దేశభక్తుల ప్రధాన కర్తవ్యం. ఇందుకోసం జనాలను ఐక్యపరచడానికి సంఘటిత కృషి చేయడం అవసరమని మేము భావిస్తున్నాము. రాజకీయ, సైద్ధాంతిక సన్నద్ధతను ఉధృతం చేయాలి. దేశంలోని సవ్యమైన శక్తుల కార్యాచరణలను మరింత సమర్థవంతంగా సమన్వయ పరచాలి. ఇందుకు పరిస్థితులను బట్టి వివిధ రూపాలను వినియోగించుకోవాలి. సోషలిజంకు దారితీసే మార్పుల దిశగా తీసుకోవలసిన మొదటి చర్య ఏమిటంటే నియంతృత్వ ప్రభుత్వాన్ని నాశనంచేసి ప్రజాతంత్ర, దేశభక్త శక్తులతో కూడిన సైనిక, పౌర తాత్కాలిక ప్రభుత్వాన్ని ఏర్పాటు చేయాలి.

దేశంలో ఐక్యతకు అనుకూలంగా నియంతృత్వ వ్యతిరేక భావాలు పెరుగు తున్నాయి. ఏది ఏమైనా చాలినంత ఐక్యత లేకపోవడం, సంఘటితశక్తి లేకపోవడం అన్నవి యిప్పటికీ విప్లవకర, ప్రజోద్యమం యొక్క ప్రధాన లోపంగానే వుంటు న్నది. ప్రభుత్వానికి వ్యతిరేకంగా ఎవర్నీ మినహాయించకుండా జాతీయ సంఘట నను ఏర్పాటు చేయడం భౌతికావసరంగా వున్నది. అది విజయానికి ఆధారపడ తగిన అంశంగా వుంటుంది. అట్టి సంఘటనను సృష్టించడానికిగాను, ఒంటెత్తు

వాదానికి బలికాకుండగానూ, నియంతృత్వ ప్రభుత్వంతో రాజీపడకుండగానూ ఫాసిజంను వ్యతిరేకించే సర్వ శక్తులనూ మనం సమీకరించాలి: ఐక్యపరచాలి. అయితే మన పార్టీ కేంద్రకమిటీ రాజకీయ కమిషన్ ప్రణాళిక స్పష్టం చేసినట్లుగా, నియంతృత్వం ఎత్తిడికి, సామ్రాజ్యవాదుల వత్తిడికి లోబడి తమ కమ్యూనిస్టు వ్యతిరేక భావాల ప్రభావం వల్లనూ కొంతమంది ప్రతిపక్ష నాయకులు ఐక్యతపట్ల ప్రజలకుగల వాంఛకు, ప్రతిస్పందించడంలో విఫలమయ్యారు. ఇది విచారింప తగిన విషయం. నేషనల్ కంగ్రెస్‌కు చెందిన కొంతమంది నాయకులు, కార్మికులను, కర్షకులను, విద్యార్థులను, ఇంకా యితర వర్గాలవారిని చేర్చుకోవడంద్వారా పోరాటాన్ని, విస్తరింపచేయడానికి బదులుగా ఉమ్మడి పోరాటంలో కమ్యూనిస్టులు పాల్గొనడాన్ని వ్యతిరేకిస్తున్నారు. అలా వివిధ వర్గాల శక్తులను చేర్చుకుంటే నియంతృత్వ వ్యతిరేక శక్తులను పటిష్టం చేయడమే కాగలదు. ఈ నాయకులు తమవర్గ స్వభావానికి అనుగుణంగా, రాజీని ఇష్టపడతారు; నిజమైన ప్రజాతంత్రీకరణ వీరికిష్టంలేదు. అయినప్పటికీ, కొన్ని ప్రత్యేకసమస్యలపై నేషనల్ కంగ్రెస్‌తో సంయుక్త కార్యాచరణను ప్రతిపాదించడం మేము కొనసాగిస్తూనే వుంటాము.

ముప్పైఏళ్ళ నియంతృత్వమూ, కఠినాతి కఠినమైన రహస్య జీవితమూ, పలువురు ఉత్తమ కమ్యూనిస్టు నాయకులు హింసలకు గురికావడమూ, హత్య కాబడడమూ—ఇవేవీకూడా కమ్యూనిస్టుల దేశభక్తిని బలహీనపరచలేక పోయాయి. మేము నికరంగా అవలంబించే అంతర్జాతీయ వైఖరిని రద్దుచేయలేక పోయాయి. ఎన్ని దెబ్బలు తిన్నప్పటికీ, పోలీసులు, సి. ఐ. ఏ. సహోదార్లు ఎన్ని అకృత్యాలు చేసినప్పటికీ ప్రజా హంతకులను మా పార్టీ ఎండగట్టడం కొనసాగిస్తూనే వున్నది; ఫాసిస్టు స్ట్రోయిస్నర్ సైనిక ప్రభుత్వాన్ని ప్రతిఘటించడం కొనసాగిస్తూనే వున్నది. విస్తృత ఐక్యత కోసమూ, నిజమైన నియంతృత్వ వ్యతిరేక జాతీయ సంఘటన ఏర్పాటుకు పెరాగ్వా కమ్యూనిస్టుపార్టీ యిస్తున్న నినాదానికి దేశభక్తుల తోడ్పాటు పెరుగుతూనే వున్నది. కమ్యూనిస్టుపార్టీ నాశనమై పోయిందని స్ట్రోయిస్నర్, అతగాడి భృత్యులూ ఎన్నిసార్లు ప్రకటించలేదు! మా నాయకుల చాలామంది హత్య కాబడ్డారు, కాబట్టి, పలువురు కనిపించడంలేదు కాబట్టి కమ్యూనిస్టుపార్టీ నాశనమైపోయినట్లేనని ప్రతిపక్ష నాయకులు కూడా నమ్మారు. కానీ ప్రతిసారీ కమ్యూనిస్టుపార్టీ మళ్ళీ కొత్తశక్తితో పైకి లేస్తూనే వున్నది. తన గాయాలను మాన్పుకుంటూ తన ప్రతిష్ఠనూ, ప్రభావాన్నీ మరింతగా పెంచుకుంటూనే వున్నది. కాల పరీక్షకు తట్టుకున్నా విమర్శ, ఆత్మవిమర్శ అనే లెనినిస్టు పద్ధతులను

---

౯. ప్రతిపక్షాల పొత్తు.

వినియోగించుకుంటూ ఎప్పటికంటె మరింత అప్రమత్తంగా వ్యవహరిస్తూ కమ్యూనిస్టుపార్టీ సభ్యులు సంయుక్త కృషిలో ద్విగుణీకృత శక్తితో పాల్గొంటున్నారు.

తన విధాన పంథాకు ఆచరణరూపం యివ్వడానికి జరిపిన కృషి సందర్భంగా పెరాగ్వే కమ్యూనిస్టుపార్టీ జయాపజయాలను రుచిచూసింది. మా పార్టీ ప్రతికూల అనుభవాలు యేమిటంటే-సైద్ధాంతిక కృషిని తక్కువ అంచనా వేయడం, శత్రువుల ఏజెంట్లు మా పార్టీ శ్రేణుల్లో చొరబడిన వాస్తవాన్ని గమనించకపోవడం. ఈ శత్రువుల ఏజెంట్లు కమ్యూనిస్టులకు, యావత్ పెరాగ్వే విప్లవోద్యమానికీ ఎనలేని హాని కలిగించారు. రాజకీయ, సైద్ధాంతిక కృషిలో తీవ్రమైన మార్పు తెచ్చి, ప్రతి కమ్యూనిస్టుకూ తన మార్క్సిస్టు-లెనినిస్టు జ్ఞానాన్ని పెంచుకోవడానికి ఉపయోగపడే పార్టీ పంథాను స్పష్టంగా అర్థం చేసుకుని దానిని అమలుపరచడానికి తోడ్పడే కొన్ని చర్యలను యిటీవల జరిగిన నాయకుల సమావేశం రూపొందించింది.

మా పార్టీకి చెందిన పలువురు ప్రముఖ నాయకులు శత్రువుల చేతుల్లో పడ్డారు. అట్టివారిలో ముఖ్యులు కేంద్ర కమిటీ కార్యదర్శి మిగల్ ఏంజెల్ సోలర్, కేంద్రకమిటీ సభ్యుడు రూబెన్ గొంజాలెజ్ అకోస్టా, కమ్యూనిస్టు యూత్ ఫెడరేషన్ కార్యదర్శి డెరిలిజ్ విల్లాగ్రా. ఆ నరహంతకులు పెరాగ్వే కమ్యూనిస్టు పార్టీ కేంద్రకమిటీ ప్రధాన కార్యదర్శి ఆంటోనియో మైదానాను, కేంద్ర కమిటీ సభ్యుడు ఎమిలియో రోవాను నిర్బంధించారు. మైదానాను నిర్బంధించి ఆయనను మాయం చేసిన ఘటన మమ్మల్నెంతో కలవరపరచించి. ఫాసిస్టు నియంతృత్వాన్ని ప్రతిఘటించే క్రియకు ఆయన పేరు సంకేతంగా నిల్చింది. కార్మికవర్గ పార్టీని ఐక్యపరచడానికీ, ప్రతీప శక్తుల ప్రభుత్వాన్ని కూలదోయగలిగే ప్రజా పోరాటానికి నాయకత్వం వహించే శక్తిని ఆ పార్టీకి ఇవ్వడానికి ఆయన తన సర్వశక్తులను ధారపోశారు.

శ్రామికవర్గంపట్ల అచంచలమైన విశ్వాస స్ఫూర్తిలోనూ, అజేతమైన లెనిన్ బోధల్లోనూ, అంతర్జాతీయతా స్ఫూర్తిలోనూ శిక్షణ పొందినటువంటి, అనుభవ సంపదగల కామ్రేడ్ జూలియో రోజాస్ నేతృత్వంలో పెరాగ్వే కమ్యూనిస్టులు దృఢంగా విశ్వసిస్తున్నారు. ఫాసిజమ్ను తొలగించి మా దేశ చరిత్రలో నూతన అధ్యాయాన్ని ఆవిష్కరించడంలోనూ శాంతికై, సామాజిక ప్రగతికై సాగే పోరాటానికి దోహదం చేకూర్చడంలోనూ జాతి జీవనంలో పెరుగుతున్నమా ప్రాతినిధ్యం అన్నది హర్షణీయమైన అంశంగా వుండగలదని వారు దృఢంగా విశ్వసిస్తున్నారు.

ఆంటోనియో మైదానా, తదితర నాయకుల జీవితాలు కాపాడడానికీ రాజకీయ ఖైదీలందరినీ విడుదల చేయించడానికీ సంఘీభావ ప్రచారాన్ని విస్తృతం చేయడం

కమ్యూనిస్టుల కీలకమైన కర్తవ్యమని పెరాగ్వే కమ్యూనిస్టుపార్టీ రాజకీయ కమిషన్ స్పష్టీకరించింది. మరిన్ని ముఖ్యమైన ప్రాంతాల్లో పార్టీ పునాదినీ, దాని ప్రజా సంఘాల పునాదులనూ పటిష్ఠం చేయడమూ, మన పత్రిక అదేలంటే సర్క్యులేషన్ పెంచడమూ, మన కార్యక్రమం భావాలను శక్తివంతంగా ప్రచారం చేయడమూ ముఖ్యమని పెరాగ్వే కమ్యూనిస్టుపార్టీ భావిస్తున్నది. పైగా సైన్యంలో తన కృషిని ఉధృతం చేయడానికి మా పార్టీ నిర్ణయించింది. సైనిక శ్రేణుల్లోని దేశభక్తులపైనా, నిర్బంధ చర్యలతో ప్రమేయం లేని వారిపైనా ఆధారపడాలని ఫాసిస్టు ప్రభుత్వాన్ని కూలదోయడానికి సాగే పోరాటంలోకి అలాటి వారిని తీసుకు రావడానికి నిర్ణయించింది.

పార్టీ యొక్క బలం దాని విప్లవకర కార్యక్రమం పైనా, సరైన వ్యూహం ఎత్తుగడలపైనా, మార్క్సిజం–లెనినిజం పట్ల విధేయత పైన, అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమ సూత్రాల పట్ల విధేయతపైన ఆధారపడి వుంది. సోదరపార్టీల, ముఖ్యంగా సోవియట్ యూనియన్ కమ్యూనిస్టుపార్టీ అనుభవాలను సృజనాత్మకంగా అదుపు తెచ్చుకోడానికి మనం వ్యక్తం చేసే సంసిద్ధత పైనా పార్టీ బలం ఆధారపడివుంది. సూత్రబద్ధమయిన పంథాను నిలకడగా అవలంబించడంద్వారా ప్రజా విజయాన్ని సాధించే శక్తిగా శ్రామికవర్గ అగ్రగవణాన్ని మేము పటిష్ట పరుస్తున్నామనడం నిస్సందేహం.

ప్రస్తుత ప్రజ్వలన అంతర్జాతీయ పరిస్థితిలో కమ్యూనిస్టులపైన మేము మా ఖండంలోని దేశభక్త, సామ్రాజ్య వ్యతిరేక శక్తులతో కలిసి శాంతికోసం పోరాడుతున్నాం. యుద్ధోన్మాదులకూ, అమెరికా సామ్రాజ్యవాదుల వారి తాబేదారుల దురాక్రమణ పథకాలకు వ్యతిరేకంగాను సాగే సంయుక్త పోరాటాల్లో కార్మికులను, ప్రజలను ఐక్యపరచడానికి కృషి చేస్తున్నాము. అణు విపత్తు ఎంత వాస్తవమయిందో ప్రజలకు తెలియచెప్పాలి. జరుగనున్న విపత్తును నివారించడానికి సర్వశాంతి శక్తులకు, సామ్రాజ్యవాదంలోని యుద్ధోన్మాద శక్తులకు వ్యతిరేకంగాను "సోవియట్ ప్రమాదం" గురించి కట్టు కథలు అల్లేవారి దుష్ప్రచారాన్ని తిప్పికొట్టడానికి సైద్ధాంతిక ఎదురుదాడి సాగించాల్సిన అవసరం వుంది. అలా దుష్ప్రచారం చేసేవారు యుద్ధోన్మాదులను, శాంతి కాంక్షించే వారిని ఒకేగాట కట్టేస్తున్నారు. విముక్తికోరే ప్రజలకు తోడ్పాటు పెంచడం కూడా అవసరం.

ఫాసిస్టు నియంతృత్వాన్ని కూలదోసి, సోషలిజం సాధనకు దారితీసే స్వాతంత్ర్యం, ప్రజాస్వామ్యం, సామాజిక న్యాయం విజయానికి–అనగా నిర్ణయాత్మకమైన ఈ విజయానికి దారితీసేటటువంటి మరింత విస్తృతమైన అంతర్జాతీయ సంఘీభావం శ్రామిక ప్రజలకు అవసరం.

# నమీబియా

## శ్యామ్‌సు జోమా అధ్యక్షుడు స్వాపో

గత 17 సంవత్సరాలుగా మా ప్రజలు ఆయుధాలు చేబూని పోరాడుతున్నారు. నమీబియా విముక్తి కోసం తుదికంటా పోరాడటం మా ప్రజల లక్ష్యం. ఇతరులెవరూ మాకు స్వాతంత్ర్యం తెచ్చిపెడతారని మేము ఆశించడంలేదు. దానిని మేము సాధించు కోవాల్సినదే. నమీబియా ప్రజల ఏకైక, సాధికార ప్రాతినిధ్య సంస్థ అయిన 'స్వాపో' (నైరుతి ఆఫ్రికా ప్రజా విమోచన సంస్థ) నాయకత్వాన నమీబియా ప్రజలు సైనిక, రాజకీయ, దౌత్య రంగాలలో అనేక ప్రధాన విజయాలు సాధించారు. 'స్వాపో' సైనిక విభాగమైన నమీబియా ప్రజా విమోచన సైన్యానికి చెందిన గెరిల్లా దళాలు, జాత్యహంకార, వలసవాద దక్షిణాఫ్రికా దళాలతో పోరాడుతున్నాయి. మేము మా దేశ వాయవ్య, ఉత్తర, ఈశాన్య ప్రాంతాలలో ఈ పోరాటం సాగిస్తున్నాం. అలాగే మధ్య దక్షిణ ప్రాంతాలకు కూడా మా సాయుధ పోరాట కార్యకలాపాలను విస్తరింప చేసుకుంటున్నాం. మొజాంబిక్, అంగోలా, జింబాబ్వేలలో మా సోదరులు సాధించుకున్న రీతిలోనే నమీబియా ప్రజలు కూడా త్వరలోనే స్వాతంత్ర్యాన్ని సాధించగలరనడంలో ఎలాంటి సందేహం లేదు.

వాస్తవానికి మా పోరాటం మా దేశ ప్రజలకు చీకూ చింతలేని భవిష్యత్‌ను చేకూర్చడానికి సాగుతున్న పోరాటం. మైనారిటీ శ్వేత జాతి దురహంకార పీడనకు గురవుతున్న నమీబియాలోని మెజారిటీ ఆఫ్రికన్లయిన మా విముక్తికోసం పోరాటం సాగించడంలో వివిధ జాతులకు చెందిన ప్రజలు శాంతి, సమానత్వాలతో సహజీవనం సాగించేలా మా గడ్డపై స్వాతంత్ర్య కిరణాలు వుదయించినప్పుడే నమీబియాలో నిజమైనశాంతి ఏర్పడుతుందని మేము విశ్వసిస్తున్నాం. మాపోరాటం అంతర్జాతీయ శాంతికి దోహదం చేస్తుంది. మా పోరాటం దక్షిణాఫ్రికాలోని యితరప్రజల విముక్తిపోరాటాలతో అలాగే మా ఆఫ్రికా ఖండంలో వలసవాదాన్ని సామ్రాజ్యవాదాన్ని ఫాసిజాన్ని నిర్మూలించి మరోప్రపంచయుద్ధాన్ని, అణుమారణహోమంలో మానవాళి వినాశనాన్నినివారించి విశ్వమానవాళి ఉజ్వలభవిష్యత్తుకోసం కృషిచేస్తున్నప్రగతిశీల శక్తులన్నింటితో అతిసన్నిహితంగా ముడివేసుకునివున్నది.

వారి ఆశాసౌధాలు కూలిపోతుండటంతో జాత్యహంకారులు నమీబియా పొరుగున గల స్వతంత్ర ఆఫ్రికా దేశాలపై సైనిక దాడులను ఉధృతం చేశారు. జాత్యహంకారుల దురాక్రమణ అంగోలాకు విస్తరించబడింది. 1981 నుండి జాత్యహంకార దక్షిణాఫ్రికా దళాలు పెద్దయెత్తున అంగోలాలో చొరబడుతున్నాయి. ఫలితంగా అంగోలాలోని కొన్ని ప్రాంతాలు వారి అక్రమ ఆక్రమణలోకి వచ్చాయి.

లెసెథొ రాజధాని మాసేరు ఎ. ఎన్. సి "సైనిక స్థావరం" అనే సాకుతో జాత్యహంకారులు ఆ నగరంపై పదే పదే విమానదాడులు సాగిస్తున్నారు. ఒక దేశ రాజధానిలో యిలాంటిసైనికస్థావరం వుందనే ఆరోపణ అందరినీ ఆశ్చర్యపరుస్తున్నది. కాని ఈ దురాక్రమణకు అసలు కారణం ప్రిటోరియా ప్రభుత్వ దుష్టయత్నాలన్నింటినీ లెసెథొ నిర్ద్వంద్వంగా తిరస్కరించడమే. మొజాంబిక్, జింబాబ్వే, ఆఫ్రికాలోని యింకా అనేక మాడుమూల దేశాలు కూడా జాత్యహంకారుల అస్థిరీకరణ, విధ్వంసకచర్యలకు లక్ష్యాలయినాయి. స్పెషల్స్‌పై 1982లో సాగించినదురాక్రమణ కూడా యిలాంటిదే.

ఆక్రమిత నమీబియాకు సంబంధించి ఈ సమస్యకు ఒక సహేతుకమైన పరిష్కారాన్ని ఆమోదించే ఉద్దేశ్యం లేదన్న అభిప్రాయాన్ని జాత్యహంకార ప్రభుత్వం అనేకసార్లు స్పష్టపరిచింది. నమీబియా స్వాతంత్ర్యానికి 1978 లోఐక్యరాజ్య సమితి భద్రతా సమితి రూపొందించిన పథకం అమలును నిరోధించడానికి ఐ. రా. స కు నిష్పాక్షికత లోపించడనే ముసుగుతో కొంత కాలంక్రితం ప్రిటోరియా ప్రభుత్వం వాషింగ్టన్ యుక్క 'లింకేజ్' డిమాండ్‌ను స్వీకరించింది నమీబియాకు స్వాతంత్ర్యం యిచ్చే సమస్యను అంగోలానుండి క్యూబా దళాల వుపసంహరణకు ముడిపెట్టే ప్రయత్నం) నమీబియాకు స్వాతంత్ర్యం యివ్వక తప్పదన్న వాస్తవాన్ని గుర్తించాల్సి వచ్చినప్పటికీ నమీబియాను శ్వేతజాతీయుల కాలనీగానే వుంచుకోవాలన్న వాంఛను వారు వదులుకోలేరు. వారి మొత్తం విధానం దీన్ని రుజువుచేస్తున్నది. నమీబియా మొత్తం యుద్ధభూమిగా మారిపోయింది. దేశంలోని అనేక ప్రాంతాలు శాశ్వత యుద్ధమండలాలుగా మారాయి. ఉత్తరానగల స్వతంత్ర ఆఫ్రికా దేశాలకు దక్షిన కొసనవున్న జాత్యహంకారుల దుర్గానికి మధ్య చివరి వారధిగా నమీబియాపై తమ ఆధిపత్యాన్ని శాశ్వతం చేసుకోవాలనే ప్రయత్నాలలో ప్రధానపాత్ర వహిస్తున్నది అక్కడ ప్రెటోరియా ప్రభుత్వసైనికదళాల స్థావరాలు జాత్యహంకార ప్రభుత్వం నమీబియా అంతటా దాదాపు లక్షమందికి పైగా తన సైనికులను మోహరించి 75 సైనిక స్థావరాలను శిబిరాలను ఏర్పాటు చేసుకుని న్నది. జాత్యహంకార దళాలు, అలాగే యూరప్‌లోని పెట్టుబడిదారీ దేశాలు అమెరికా, మరికొన్ని అభివృద్ధి నిరోధక లాటిన్ అమెరికా దేశాలనుండి కిరాయి మూకలను రైలు, రోడ్డు, సముద్ర, విమాన మార్గాల ద్వారానమీబియాలోకి దించుతున్నారు. నమీబియాలో శ్వేతజాతీయులందరూ సాయుధులే. 18—30 సంవత్సరాల మధ్య వయస్కులైన శ్వేతజాతి పుత్రులంతా నమీబియా ఆక్రమిత సైన్యంలో 2 సంవత్సరాలు నిర్బంధంగా పనిచేయాలనే చట్టంవుంది. దాని తర్వాత శ్వేతజాతి మహిళలతో కూడా కలసివున్న 'పౌరదళం' అనబడే అనే దానిలో కూడా 240 రోజులు పనిచేయాల్సివుంటుంది. అనేకమంది యువకులను కాలనిర్ణయం లేకుండానే సైన్యంలో చేర్చుకున్నారు.

నల్లజాతి నమీబియా ప్రజలు కూడా వారి యిష్టానికి వ్యతిరేకంగా ఆక్రమిత సైన్యం యిందులోకి గుంజుతున్నది. 1981 జనవరిలో నల్లజాతి యువకులందరికీ నిర్బంధ సైనిక సేవను ప్రవేశ పెట్టారు. ఆర్థిక అవసరాలవల్లనో లేదా వత్తిడితోనో జాత్యహంకార సైనిక యంత్రాంగంలోకి చేర్చబడిన వీరు హోంగార్డులు లేదా నైరుతి ఆఫ్రికా ప్రాంతీయదళం అని చెప్పబడే అర్ధసైనిక విభాగాలలో భాగ స్వాములవుతున్నారు. ఈ దళాలు స్థానిక ప్రజలను భీభత్సపరచను చేయడంలో వారిపై అత్యాచారాలు, హత్యాకాండ సాగించడంలో గణుతికెక్కాయి. జాత్యహంకారులు 'వియోలెట్' అనబడే ప్రత్యేక నయా నాజీహంతక దళాలనుకూడా ఏర్పాటు చేశారు. ఇవి హిట్లర్ కాలంనాటి ఎస్. ఎస్ దళాలవంటివి. వారి అర్ధరాత్రి దాటిన తర్వాత ప్రజల ఇళ్ళలోకి చొరబడి వారిని అక్కడికక్కడే హత్యచేయడం లేదా సైనిక శిబిరాలకు తీసుకుపోవడం చేస్తారు. అలా శిబిరాలలో తీసుకొనబడిన వారి ఆచూకి ఆ తర్వాత ఎక్కడా కనిపించదు. జాత్యహంకార ప్రభుత్వ సైనికీకరణ విధానంలో మరో అంశం దేశంలో ముఖ్యంగా ఉత్తరాది ప్రాంతాలలో 'రక్షిత గ్రామాలు' మరియు 'పట్టణ దుర్గాలు' అని చెప్పబడే వాటిని ఏర్పాటు చేయడం. ఇవి వియత్నాం యుద్ధంలో, రొడీషియాలో అమెరికా ఏర్పరచిన వ్యూహాత్మక గ్రామాలవంటివే. వీటి ప్రధాన లక్ష్యం మా గెరిల్లా దళాలను ప్రజలనుంచి దూరం చేయడానికి, పీడనకు గురవుతున్న ప్రజలపై జాత్యహంకార పూర్తి పెత్తనాన్ని నెలకొల్పుకొనడం. వాయవ్యాన పోహోవెర్డ్, ఈశాన్య ప్రాంతంలో ఓక్వాంగో వంటి ప్రాంతాలలో దాదాపు ప్రతి పట్టణమూ ఒక సైనిక స్థావరమే. ఈ పట్టణాల చుట్టూగా మిషన్‌గన్‌లతో జాత్యహంకార దళాలకు గస్తీ టవర్లు నిర్మించబడి వుంటాయి.

అందువల్ల, నమీబియాలో క్లిష్టమైన పరిస్థితి నెలకొని వున్నది. ప్రతిరోజు అనేకమంది ప్రజలు ప్రాణాలు కోల్పోతున్నారు. దక్షిణాఫ్రికా కాథలిక్ బిషప్ కాన్ఫరెన్సు నియమించిన ప్రత్యేక విచారణ బృందం కూడా దీనిని ధృవీకరించింది. నమీబియా ఉత్తర ప్రాంతాలను సందర్శించిన ఫ్రెంచ్, నమీబియా, దక్షిణాఫ్రికా పాత్రికేయులు కూడా పౌరులపై జాత్యహంకార సైనికుల దాడులు, అత్యాచారాలను బహిర్గతం చేశారు. అనేకమంది కార్మికులు నిర్బంధ శిబిరాలలో, మరికొంతమంది ప్రముఖ దక్షిణాఫ్రికా దేశభక్తులతో కలసి అప్రతిష్ఠాకరమైన రాబెన్ దీవి శిబిరంలో మగ్గుతున్నారు. ఖైదీలు అనేక అమానుషాలకు గురవుతున్నారు. పోరాటంలో బందీలైన లేదా గాయపడిన నమీబియా స్వాతంత్ర్య యోధులను యుద్ధఖైదీలుగా పరిగణించడంలేదు. అయినప్పటికీ 'స్వాపో' దేశభక్తులు పోరాటంలో తమకు బందీలుగా చిక్కే జాత్యహంకార దక్షిణాఫ్రికా సైనికులను మాత్రమే జెనీవా సూత్రాల కనుగుణంగా యుద్ధనేరస్తులుగానే చూస్తున్నారు.

నమీబియాలో స్థిరపడిన శ్వేతజాతీయు లందరినీ తమ నేరపూరిత విధానం కొమ్ముకాయాల్సిందిగా నచ్చచెప్పడానికి ప్రిటోరియా ప్రభుత్వం ప్రయత్నిస్తోంది. అయితే ఎంతోమంది శ్వేతజాతీయులు కూడా నమీబియా ప్రజల స్వేచ్ఛ, సమానత్వాలకు దారితీసే మార్గంగా విముక్తి వుద్యమాన్ని గుర్తిస్తున్నారు. మా పోరాటాన్ని కాథలిక్ చర్చ్, యాంగ్లికన్ చర్చ్, లూథరన్ ప్రొటెస్టెంట్ చర్చ్ సభ్యులు బలపరుస్తున్నారు. నేషనలిస్టు పార్టీయొక్క నయా నాజీ ప్రభుత్వానికి మూల స్తంభంవంటి డచ్ రిఫార్మ్డ్ చర్చి మాత్రమే నమీబియాలో, దక్షిణాఫ్రికాలో శ్వేతజాతీయుల నిరంకుశ పాలనను, మెజారిటీ నల్లజాతి ప్రజలను అణగద్రొక్కడాన్ని సమర్థిస్తున్నది. గతంలో దక్షిణాఫ్రికా జాత్యహంకార ప్రభుత్వం అన్నిజాతులనుండి ఎంపిక చేసిన కొద్దిమంది తొత్తులతో ప్రజాస్వామిక టర్న్‌హాలే అలయన్స్ (డి టి ఎ) అనబడేదాన్ని ఏర్పాటుచేసి దానికి ఒక రాజకీయ పార్టీ పాత్రను అప్పగించింది. ఆ తర్వాత అలాంటి "జాతీయ అసెంబ్లీ"నే ఏర్పాటుచేసి డీ టి ఎ నాయకులతో కూడా కలిసివున్న మంత్రివర్గం అనబడేదాన్ని ఏర్పరచింది. జాత్యహంకారులు ఈ మంత్రివర్గ సభ్యులకు కొత్త కొత్త సూట్లు, సిల్కుకోటులు యిచ్చినారు నిజంగా మంత్రులని నమ్మించడానికి తంటాలుపడ్డారు. ఈ తొత్తు రాజకీయ సంస్థలను ఏర్పాటుచేయడం యొక్క ప్రధానోద్దేశం దక్షిణాఫ్రికాలో బంటుస్తాన్‌లను ఏర్పాటుచేసిన విధంగా జాతుల ప్రాతిపదికగా నమీబియాను శాశ్వతంగా విడగొట్టే విధానానికి ఆఫ్రికా ప్రజల మద్దతును సమీకరించడానికి తద్వారా ప్రజల నిజమైన స్వేచ్ఛా, స్వాతంత్ర్య కాంక్షలను కాలరాయడానికి వుద్దేశించబడింది. ఈ లక్ష్యం నెరవేరితే ఐ రా స పర్యవేక్షణలో ఎన్నికలు జరపడానికి ప్రిటోరియా అంగీకరిస్తే నమీబియాలో మైనారిటీ శ్వేతజాతీయుల, సామ్రాజ్యవాదుల బహుళజాతి కంపెనీల ప్రయోజనాలను పరిరక్షించే ఒక తొత్తు ప్రభుత్వం ఏర్పడటం ఖాయం. కాని ఈ పథకం విఫలమయింది. 1983 ఆరంభంలో డి టి ఎ "జాతీయ అసెంబ్లీ" కుప్పకూలాయి. జాత్యహంకార సైన్యం వాటిని కాపాడలేకపోయింది.

'స్వాపో' సాయుధ విముక్తి పోరాటం ఉధృతం కావడం, ప్రజలలో రాజకీయ కార్యకలాపాలను ముమ్మరంచేయడం — యీ నయా వలసవాద తొత్తు సంస్థలు, అలాగే నమీబియాకు బంటుస్తాన్‌గా తయారుచేసే పథకాలు కుప్పకూలడానికే కారణం. ఆక్రమిత సైన్యం సేవలోవున్న కొద్దిమంది ద్రోహులు నమీబియా ప్రజల తోడ్పాటును సంపాదించలేకపోయారు.

1983 వేసవిలో నమీబియాలో దక్షిణాఫ్రికా ఏజంటయిన అడ్మినిస్ట్రేటర్ జనరల్ అని పిలువబడేవ్యక్తి నూతన 'రాజ్యాంగాన్ని' రూపొందించడంకోసం ఒక 'స్టేట్ కౌన్సిల్'ను ఏర్పాటుచేయడానికి మరియు ఆ రాజ్యాంగాన్ని ధృవీకరించ

డానికిగాను, ఆ తర్వాత బోగస్ ఎన్నికల నిర్వహణకుగాను ఒక కొత్త పథకాన్ని ప్రకటించాడు. కొంతమంది తొత్తులు మొదటలో ఈ స్టేట్ కౌన్సిల్‌లో పాల్గొనేందుకు అంగీకరించారు. వీరిలో ఒకరు గతంలో డి టి ఎ తరపున "ప్రధాన మంత్రి"గా వున్న ఉర్క్ మొగ్గే. కాని, తాను ఒంటరినైపోయానని తర్వాత గుర్తించి అతడు కూడా వుపసంహరించుకున్నాడు. నమీబియా ప్రజలకు సంబంధించినంతవరకు వారు మొదటిలోనే నిర్ద్వంద్వంగా తిరస్కరించారు. దీనితో జాత్యహంకారులకు ట్రాన్స్‌కేజ్ ప్రధాన న్యాయమూర్తిని దక్షిణాఫ్రికాకు చెందిన మరో శ్వేతజాతి అధికారిని, స్టేట్ కౌన్సిల్ అధ్యక్ష, ఉపాధ్యక్షుడుగా నియమించడంతప్ప మరో మార్గం లేకపోయింది. ప్రిటోరియా ప్రభుత్వ విధానాలకు సామ్రాజ్యవాదుల, ముఖ్యంగా అమెరికా సామ్రాజ్యవాదులయొక్క ఆర్థిక, రాజకీయ, సైనిక పరమైన తోడ్పాటువుంది. నమీబియా సంపదను కొల్లగొడుతున్న విదేశీ కార్పొరేషన్లు ఆక్రమిత సైనిక దళాలకు అనేక విధాలుగా సహాయం చేస్తుంటాయి. కొన్ని కీలకమైన వుత్పత్తులు, ముఖ్యంగా చమురును వీరు జాత్యహంకార సైన్యానికి సరఫరా చేస్తుంటారు. ఈ కార్పొరేషన్‌లలో కొన్నింటికి తమ సొంత భద్రతా దళాలు కూడా వున్నాయి. యివి, 'స్వాపో' దాడులను ప్రతిఘటించడంలో ఆక్రమిత సైన్యానికి సహకరిస్తుంటాయి.

అయినప్పటికీ జాత్యహంకారులు, వారి సామ్రాజ్యవాద పోషకులు నమీబియా ప్రజలను ఓడించలేక పోతున్నారు. జాతి వెలివిధానాన్ని అనుసరిస్తున్న ప్రభుత్వం ఆధిపత్యంలోని ఆర్థికవ్యవస్థను స్తంభింపచేయగలిగిన పెద్ద కార్యాచరణలను మేము నిర్వహించాం. అంతిమ విజయం సాధించకుండా మమ్మల్ని ఏ శక్తి నిరోధించజాలదు.

నమీబియా స్వాతంత్ర్యంపై భద్రతామండలి చేసిన 430 తీర్మానం అమలుకు మార్గాలను అన్వేషించడంలో ఐక్యరాజ్యసమితి ప్రధాన కార్యదర్శితో సహకరించ డానికి మేమెల్లప్పుడూ సిద్ధమే. 1983 వసంతకాలంలో భద్రతామండలి ఆమో దించిన తీర్మానం నెంబరు 532 స్వాతంత్ర్యంకోసం పోరాడుతున్న నమీబియా ప్రజల ప్రాతినిధ్యసంస్థ — 'స్వాపోకు', దక్షిణాఫ్రికా ఆక్రమిత సైన్యానికి మధ్య కాల్పుల విరమణను సాధించేందుకు సంప్రదింపులను పునరుద్ధరించే బాధ్యతను ఐ రా స ప్రధాన కార్యదర్శికి అప్పగించింది. అందు కనుగుణ్యంగా జెవియర్ పెరెజ్ డిక్యులర్ 1983 ఆగస్టు 16 నుండి 26 వరకు దక్షిణాఫ్రికా, నమీబియా, అంగోలా ప్రజా రిపబ్లిక్‌లలో పర్యటించారు. ఆయన 'స్వాపో'తో సంప్రదింపులు జరిపారు. 'స్వాపో' నాయకత్వం ఆయనకు ఒక మెమొరాండం సమర్పించింది. ఆయన నమీబియా వచ్చినపుడు వలసవాద పాలనను అంతంచేయాలని కోరుతూ స్వాపో మద్దతుదారులు నిర్వహించిన బ్రహ్మాండమైన ప్రదర్శనను ఆయన స్వయంగా చూశారు.

ఆయన అంగోలా వచ్చినపుడు ఆ మెమొరాండంలోని అంశాలనే మేము పునరుద్ఘాటించాము. నమీబియా స్వాతంత్ర్యంపై భద్రతామండలి తీర్మానాన్ని అమలుచేయడానికి వీలుగా సైనిక పౌర సమస్యలపై ఐ రా స తో పూర్తిగా సహకరించడానికిగా సిద్ధంగా వున్నామని, కాల్పుల విరమణకు కూడా సిద్ధంగా వున్నామని స్వాపో ఆయనకు స్పష్టంచేసింది. అయితే దక్షిణాఫ్రికా మరోసారి ఐ రా స తీర్మానాన్ని నిర్లక్ష్యం చేయడంద్వారా తన దురహంకారాన్ని మరోసారి ప్రదర్శించింది.

నమీబియా ప్రజల వీరోచిత పోరాటం కొనసాగుతోంది. స్వాతంత్ర్య సముపార్జనకై సాగుతున్న ఈ పోరాటాన్ని పోరాటశ్రేణి దేశాలు, మొత్తం స్వతంత్ర ఆఫ్రికా, సోషలిస్టు దేశాలు మరియు ప్రపంచ వ్యాపితంగావున్న యితర ప్రగతిశీల శక్తులన్నీ ఈ పోరాటానికి సకల తోడ్పాటు అందిస్తున్నాయి. ఎన్ని త్యాగాలు చేయాల్సి వచ్చినా నమీబియా విముక్తి కావడం తథ్యం. ★

# సామ్రాజ్యవాద విధానానికి గట్టి చెంపదెబ్బ

— మాక్సిం గ్రెమెట్జ్
*పొలిటికల్ బ్యూరో సభ్యులు, కేంద్ర కమిటీ కార్యదర్శి*
*ఫ్రెంచి కమ్యూనిస్టు పార్టీ*

ఈ ఏడాది ప్రారంభం నుంచి ఫ్రాన్సులోని సామాజికార్థిక పరిస్థితి తీవ్రతర మయింది. మితవాదులు, యజమానులు సంయుక్తంగా హింసాయుత ఎదురుదాడిన్ని కొనసాగిస్తున్నారు. ఈ సమస్యలపై జార్జ్ మార్కాయిస్ నివేదికను విని, చర్చించ టానికి ఫ్రెంచి కమ్యూనిస్టు పార్టీ కేంద్ర కమిటీ ప్లీనరీ సమావేశం జనవరి 17 నుంచి 19 వరకు జరిగింది ఈ సమావేశంలోనే అంతర్జాతీయ పరిస్థితికి సంబంధిం చిన వివిధ సమస్యల్ని, శాంతి, నిరాయుధీకరణ కోసం జరుగుతున్న పోరాటాన్ని గురించి కూడా చర్చించారు. ఇవి నిస్సందేహంగా దేశంలోని శావాల మధ్య సాగు తున్న పదునైన సంఘర్షణను ప్రతిబింబిస్తున్నాయి. మా ప్రజలు—ఇతరులకు కూడా ఈ పరిణామాలు ఆందోళన కలిగిస్తున్నాయి.

అంతర్జాతీయ రంగంలో నూతన పోకడను లోతుగా పరిశీలించాక సమా వేశం ఇలా నిర్ధారించింది: "ఫ్రెంచి కమ్యూనిస్టుపార్టీ ఇటీవలి మహాసభల్లో విశ్లే షించినట్టుగా, సామ్రాజ్యవాదం తీవ్రతరం చేసిన ప్రతీఘాతుక ఎదురుదాడి, అంత ర్జాతీయ శక్తుల ప్రాథమిక తుల్యతను ఏ మాత్రం మార్చలేదు. ప్రజల కృతనిశ్చ యాన్ని, సమిష్టి ఉత్తేజాన్ని అది పటిష్ఠపరచింది. జరుగుతున్న ఘటనలు, శక్తుల తుల్యత ప్రగతికి సానుకూలంగా వున్నదని కూడా స్పష్టంగా రుజువుచేస్తున్నాయి. వర్గపోరాటాల కరకుదనంవల్ల తరచుగా కలుగుతున్న కొన్ని యిబ్బందులు, సంక్లిష్టతలున్నప్పటికీ అది అలాగే వుంది."

ఈ నిర్ధారణకు మేం రావటానికి ప్రోద్బలం చేసిన అంశమేది?

సామ్రాజ్యవాద వ్యూహాన్ని గురించి చేసిన సంక్లిష్ట విశ్లేషణ, దాని స్వభావాలు, ఆశయాలు, ఆ వ్యవస్థ సంక్షోభం అన్నింటికీ మించి ప్రజలు సాగి స్తున్న విభిన్నమైన పోరాటాలే అందుకు కారణం.

# సామ్రాజ్యవాద వ్యూహం

మూడేళ్ళ రీగన్ అధ్యక్ష పాలన అనంతరం కరుడుగట్టిన సామ్రాజ్యవాద ప్రభుత్వ విధానంలో కొన్ని అంశాలను ఖచ్చితంగానే గుర్తించవచ్చు. రీగన్, సామ్రాజ్యవాద ప్రతీఘాతుక ఎదురు దాడికి సూత్రధారి కాకపోవచ్చు. కానీ అతను సామ్రాజ్యవాదానికి ప్రమాదకర పరిణామాలతో కూడిన కొత్త ఊపును, పొందికను చేకూర్చాడు.

అమెరికా యొక్క భౌగోళిక కీలక ప్రయోజనాలు, సోవియట్ యూనియన్‌తో అనివార్యమైన వైరుధ్యాలకు మూలంగా వున్న ఆధిపత్య సిద్ధాంతంపై ఈ విధానం ఆధారపడి వుంది. భూగోళంమీదున్న అన్ని మండలాల్లో తన శక్తిని కూడగట్టుకోటానికి, అక్కడ తలెత్తే సమస్యలన్నింటికీ పరిష్కారం కనుగొనటానికి, ఉద్రిక్తతలు, సంఘర్షణలు తీవ్రతరం చేయటానికి, అన్నిచోట్లా అమెరికా తిష్ఠవేయాలన్నదే దాని సారాంశం.

సైనిక ఆధిక్యత సాధించటం, మునుపెన్నడూలేని రీతిలో సైనికవ్యయాన్ని పెంచటం, కొత్త అణ్వాయుధాలను తయారుచేయటం, అంతరిక్షంలో సైనిక సన్నాహాలు ప్రారంభించటానికి ఇది ప్రాధాన్యత నిస్తుంది. అలాగే జెనీవా సంప్రదింపులను చిన్నాభిన్నం చేసి మరో ప్రమాదకరమైన మలుపుకు దారితీసిన పెర్షింగ్-2 మిసిలీల మోహరింపుకై తీసుకున్న నిర్ణయం కూడా ఈ విధాన ఫలితమే.

ప్రపంచంలో యూరపు మినహాయిస్తే వ్యూహాత్మకమైనవిగా పరిగణించిన మిగతా ప్రాంతాల్లో తమ ఆధిక్యతను కాపాడుకోటానికి లేదా పునః ప్రతిష్ఠించటానికి సంఘర్షణా విధానాన్ని కొనసాగించాలన్నది దాని ఆరాటం. మధ్య అమెరికా కరీబియన్ ప్రాంతాలలో ఎక్కుపెట్టిన గురి, గ్రెనడాలో జరిగిన సాయుధ జోక్యం, నికరాగ్వా, ఎల్ సాల్వడార్‌లలో ముంచుకొస్తున్న ప్రమాదం, మధ్యప్రాచ్యం, టర్కీ, దక్షిణాఫ్రికా, ఆగ్నేయాసియాలో జరుగుతున్న పరిణామాలు యిందుకు నిదర్శనాలు.

అంటే ఈ ప్రాంతాల్లో, మరికొన్ని యితర ప్రాంతాల్లో నియంతృత్వ ప్రభుత్వాలకు పెద్ద ఎత్తున సహాయమందించటం, "ప్రాంతీయ సైనిక దళాలను వినియోగించడమన్నమాట.

వర్ధమాన దేశాలకు సంబంధించినంతవరకు, అమెరికా, అంతర్జాతీయ ద్రవ్యనిధి, అంతర్జాతీయ పునర్నిర్మాణ, అభివృద్ధి బ్యాంకుల్లో తనకున్న అజమాయిషీని అడ్డం పెట్టుకొని, బడా బహుళజాతి కంపెనీల ప్రయోజనాల్ని రక్షించ

టానికి రాజకీయ ప్రయోజనాల్ని పొందటానికి ఆర్థిక, ద్రవ్యపరమైన ఒత్తిడులను తీసుకొస్తున్నది.

ఎప్పుడైనాసరే అంతర్జాతీయ సంస్థల్లో తాను ఒంటరినయ్యానని అమెరికా గుర్తించినపుడు, యునెస్కో విషయంలో జరిగినటుగా వాటిని మూసివేయించటానికి, లేదా విచ్ఛిన్నం చేయటానికి అది వెనుకాడలేదు.

పశ్చిమ దేశాల విషయంలో, అమెరికా, డాలరు విలువను పెంచడం, వడ్డీ రేట్లను హెచ్చించడం, ఇతర వ్యాపార పద్ధతుల ద్వారా ఒక తరహా ఆర్థిక యుద్ధాన్ని కొనసాగించింది.

ఆఖరిగా అది, ఆంక్షలను ప్రకటించి, కోకామ్‌కు[1] తిరిగి ప్రాణం పోసి, ఆయుధ పోటీని పెంచి సోవియట్ దేశాల ఆర్థిక వ్యవస్థను కూడా దెబ్బతీసింది.

సామ్రాజ్యవాద విధానం, అలాగే ఇటీవలి అంతర్జాతీయ పరిణామాలపై చేసిన విశ్లేషణను బట్టి ప్రస్తుత అమెరికా వ్యూహానికి రెండు లక్ష్యాలున్నాయని అవగతమవుతుంది.

ఒకటి, సోషలిస్టు దేశాలపై సైనిక ఒత్తిడిని తీసుకురావడం. అందుకు ప్రాంతీయ సైనిక పొత్తులను కుదుర్చుకోవడం. ఈసందర్భంగా ఆయా కూటములు దేనికి సంత పైచేయి అయినా ఫరవాలేదనే వైఖరిని అనుసరించటం. ఇక నాటో విషయానికొస్తే, కొంతమంది పాశ్చాత్య మిత్రులే, ఆ పొత్తు యొక్క స్వభావం, అది పనిచేసే పరిధి, ఎలా పనిచేయాలనే అంశాలపై తమకు తాము ప్రశ్నించుకుంటున్నారు.

రెండవది, ప్రజల మనోభావాలపై ప్రభావాన్ని పెంచుకోవటం, వారి కార్యాచరణను నిర్వీర్యం చేయటం. ప్రగతి, సామాజిక న్యాయం, స్వాతంత్ర్యం, జాతీయ సార్వభౌమత్వం కోసం వారిలో పెరుగుతున్న తపనకు అడ్డుకట్ట వేయటం. అయితే ఇవన్నీ సామ్రాజ్యవాద ఆధిక్యతకు భంగం కలగని చట్రం లోనే జరిగేట్టు చూడటం.

ఇటీవలి కాలంలో ఉధృతమైన సైద్ధాంతిక యుద్ధానికి కూడా ఇదే మూలం. "సోవియట్ విస్తరణవాదమనే" భూతం నుంచి ప్రమాదం ముంచుకొస్తున్నదంటూ సామ్రాజ్యవాదం వ్యూహం ప్రకారం ప్రజలను తప్పుదారి పట్టించటానికే ఈ సైద్ధాంతిక యుద్ధాన్ని ఉద్దేశించారు.

ఈ వ్యూహం పర్యవసానాలేమిటి?

---

1. సోషలిస్టు దేశాలకు ఎగుమతులను అజమాయిషీ చేసే కమిటీ.

మొదటిది: పై పై జరిపిన పరిణామాల సర్వే ప్రకారమే, శాంతికి, అంతర్జాతీయ భద్రతకు ప్రమాదకరమైన పరిస్థితిని అవి సృష్టిస్తున్నదనేది స్పష్టమైంది. సామరస్యకాలం తమకు అనుకూలంగా వుండిందన్న నిర్ధారణకొచ్చాక సామ్రాజ్యవాదులు ఉద్దేశపూర్వకంగా ఉద్రిక్తతల్ని పెంచారు. ఫలితంగా అంతర్జాతీయ వాతావరణం నానాటికీ దుర్భరంగా మారుతోంది. నిజానికి ప్రాంతాల మధ్య వైరుధ్యాల బెదిరింపు కూడా వుంది. అందువల్ల ఈ వ్యూహ ప్రమాదాన్ని ఎట్టి పరిస్థితుల్లోనూ తక్కువగా అంచనా వేయకూడదు.

రెండవది—ఈ ఉద్రిక్తతల, సంఘర్షణల విధానం సామ్రాజ్యవాద శక్తికి సాక్ష్యాధారం కాదు. ఇది సామ్రాజ్యవాదం చవిచూసిన ఓటములకు ప్రతీకారంగా తన ఆధిక్యతా వ్యవస్థను కాపాడుకోటానికి అది సాగిస్తున్న పోరాటంలో కొత్తగా ఎదురవుతున్న మితిమీరిన ఇబ్బందులను అధిగమించటానికి తీసుకుంటున్న చర్య మాత్రమే.

ఈ ఇబ్బందుల్లో మూడు ప్రధాన రకాలున్నాయి. దాని సొంత సంక్షోభం, ప్రజల పోరాటం, ఈ పోరాటానికి చోదకశక్తిగా, తరగని శక్తిసామర్థ్యాలున్న సోషలిస్టు దేశాల అభివృద్ధి.

## సామ్రాజ్యవాద సంక్షోభం – ప్రజా పోరాటం

ఈ సంక్షోభానికి సంబంధించి కేంద్ర కమిటీ ప్లీనరీ సమావేశానికి నేను కొన్ని అధికారిక అంకెల్ని సమర్పించాను. ఈ సంక్షోభం ఏ స్థాయికి చేరింది, అమెరికాలోని కార్మిక ప్రజల కోసం రీగన్ చేపట్టిన విధానంయొక్క మానవతా, సాంఘిక, ఆర్థిక పర్యవసానాలేమిటి? యూరపులోని పెట్టుబడిదారీ దేశాల్లో అనుసరిస్తున్న పొదుపు చర్యలవల్ల సాధించిన ఫలితాలేమిటన్నది చూపటానికే నేనీ అంకెలు ఇచ్చాను. ఇలాంటి పొదుపు విధానాన్ని పెట్టుబడిదారీ ప్రపంచంలో అనేక సంవత్సరాలనుంచీ పాటిస్తూనే ఉన్నారు. అయితే ఇది రోగగ్రస్తమైన ఆర్థిక వ్యవస్థను బాగుపరిచేదానికి బదులు, ఆ దేశాల్లో అప్పటికే ఉన్న క్లిష్ట పరిస్థితి మరింత అధ్వాన్నం కావడానికే ఉపయోగపడింది.

ఇటీవలి కాలానికి సంబంధించిన ఒక కొత్త నిజాన్ని మేం నొక్కి చెప్పాం. అదేంటంటే పెట్టుబడిదారీ దేశాల్లో ఈ పోకడలకు వ్యతిరేకంగా సాగుతున్న పోరాటంలో ప్రజలు మరింత దృఢదీక్షతో పాల్గొంటున్నారు. తమ హక్కుల కోసం కార్మిక ప్రజలు సాగిస్తున్న ప్రతిఘటనా పోరాటాలు అలాగే ఇటువంటి అనేక దేశాల్లో పెరుగుతున్న సాంఘిక పోరాటాలు ఇందుకు నిదర్శనం. ఈ సాంఘిక పోరాటాల పరిధి కూడా తరచుగా పెద్ద పరిమాణంలో విస్తరిస్తున్నది.

సాంఘిక పోరాటాల పరిమాణాత్మక పెరుగుదలలో ఒక కొత్తగుణం వుంది. సన్నిహితంగా పరిశీలిస్తే భవిష్యత్తుకు సంబంధించిన ప్రధానమైన సాంఘిక సమస్యల్ని గురించి ఆలోచించాలన్న తపన, పెట్టుబడిదారీ వ్యవస్థలో వ్యాధి ముదిరినట్టు తీవ్రతరమవుతున్న సమస్యలను పరిష్కరించుకోవాలన్న ఆరాటం నానాటికీ పెరుగుతున్నదనేది ఆ పోరాటాల్లో అద్దం పట్టినట్టు కనిపిస్తున్నది. రాజకీయ రంగంలో కూడా కొంతవరకు యిలాంటి తపనే వ్యక్తమవుతున్నది.

1983 ప్రజా వుద్యమాన్ని గురించి పరిశీలించినపుడు, అన్ని దేశాల్లోనూ, అన్ని ఖండాల్లోనూ, ప్రజలు వారి సాంఘిక, రాజకీయ వ్యవస్థలతో నిమిత్తం లేకుండా శాంతి కోసం, నిరాయుధీకరణకు జరుపుతున్న పోరాటాలు గణనీయంగా వి స్తరిస్తున్నాయని గమనించాం. ఈ క్రమం వేళ్లూనుకున్నదని, ముమ్ముందుకు కొనసాగుతుందని కూడామేం నొక్కి చెప్పాం.

ప్రజా విముక్తి పోరాటాలు ఉధృతమైనాయి. వారి పోరాటాలు, వాటి ఉద్దేశ్యాలు, రూపాలు, లక్షణం, భావం మరింత బహుముఖంగా మారుతున్నాయి.

మధ్య లాటిన్ అమెరికాలో ఆఫ్రికాలో, మధ్యప్రాచ్యం, ఆగ్నేయాసియాల్లో జరుగుతున్న పోరాటాల వివరణాత్మక విశ్లేషణ ఏం చూపెట్టింది?

మొట్టమొదట అది, ఇపుడు కొత్త గుణాన్ని సంతరించుకున్నదన్న పోరాటంలో ప్రజలు మరింత ఎక్కువ సంఖ్యలో పాల్గొంటున్నారని చూపింది. సామ్రాజ్యవాద దౌర్జన్య పథకాలను ప్రతిఘటిస్తున్న వారి గానీ, స్వయం - కృతనిశ్చయం, సార్వభౌమాధికార హక్కును రక్షించుకుంటున్నవారుగానీ, అంతర్జాతీయ ద్రవ్య నిధి నిరంకుశ దేశాలను తిరస్కరిస్తున్న వారుగానీ, తమ దుర్భర పరిస్థితులను గురించి, నయా వలసవాద విధానాలకు వ్యతిరేకంగా తమ నిరసన వ్యక్తం చేస్తున్న వారు గానీ, నియంతృత్వ ప్రభుత్వాలను సహించజాలమని తిరుగుబాటు చేస్తున్న వారుగానీ — ఇవన్నీ ప్రజా పోరాటాలు ఇనుమడిస్తున్నాయనే దానికి నిదర్శనాలని ఆ విశ్లేషణలో తేలింది.

జాతీయ స్థాయినగాని లేదా ప్రాంతీయ పరిధిలోగాని అసమానతలు, విభేదాలు, అభివృద్ధికి సంబంధించిన పరస్పర విరుద్ధ అంశాలు నిర్దిష్టంగా కనపడవచ్చు. అయితే వాటితో నిమిత్తంలేకుండా ప్రజా పోరాటాలు ఎప్పుడైతే బలం పుంజుకుంటాయో అపుడు సామ్రాజ్యవాదానికి ఎన్నో ఇబ్బందులు ఎదురవుతాయి. దాని వ్యూహం విఫలమవుతుంది. అది తిరోగమించక తప్పదు.

సామ్రాజ్యవాదాని కెదురయ్యే, దాన్ని తీవ్రంగా కలతపరిచే మూడో రకం ఇబ్బందుల్ని మేం కొంత వివరంగానే చెప్పాం. ఇవి సోషలిస్టు దేశాల అభివృద్ధి ఫలితాలూ, ముమ్మందు అవి మరిన్ని విజయాలు సాధించే అవకాశాలూ.

ప్రస్తుతం ఫ్రాన్సులో సోషలిస్టు దేశాలకున్న స్థానం, అవి నిర్వహిస్తున్న పాత్ర, ఆ దేశాల గురించిన వాస్తవాల అంచనా, అలాగే మొత్తంగా అంతర్జాతీయ పరిస్థితి అంచనా అదేవిధంగా సోషలిస్టు దేశాలేమిటి, వారు ఏం చేస్తున్నారనే విషయాలపై తీవ్రమైన సైద్ధాంతిక, రాజకీయ పోరాటం కేంద్రీకృతమైవుంది.

మితవాదులు, అతివాదుల్లో కొందరు, సోషలిజం అంటే స్వేచ్ఛను హరిస్తుందని, ఆర్థిక వ్యవస్థను దిగజారుస్తుందని, యుద్ధాన్ని కొనితెస్తుందని మూడు నినాదాలతో తమ ప్రచారం కొనసాగిస్తున్నారు. దాంతోపాటు ఫ్రెంచి కమ్యూనిస్టుపార్టీ అంటే మాస్కో అని పదే పదే వల్లిస్తున్నారు. మిగతా చోట్ల కన్నా ఫ్రాన్సులోనే ఇప్పుడీ ప్రచారం మరింత తీవ్రంగా ఎందుకు సాగుతున్నదనే దానికి ఒక చక్కటి కారణముంది. ప్రభుత్వంలో వున్న కమ్యూనిస్టు మంత్రులకు వ్యతిరేకంగా ఈ ప్రచారాన్ని ఉద్దేశించారన్నది స్పష్టం. వారిని ప్రభుత్వం నుంచి గెంటివేయాలన్న కుట్ర కూడా ఇందులో వుంది.

విడమర్చి చెప్పాలంటే, ఇందులోని ఆంతర్యం, సోషలిజం ఆర్థిక వ్యవస్థ దుస్థితికి దారితీస్తుందని, పైగా అదొక రుగ్మత అని సంక్షోభం సర్వవ్యాపితమని, దీన్నుంచి ఏ దేశం తప్పించుకోలేదని కార్మిక ప్రజల్ని నమ్మించడం. కాబట్టి, మనం ఏ వ్యవస్థలో వున్నామో దాన్నే అంగీకరిద్దాం—అనే వాదం ముందుకొస్తున్నది. సంక్షోభం నుంచి బయటపడటానికి జాతీయ పరిష్కారంగా, ఫ్రెంచి తరహా సోషలిజంకోసం మేం చేసిన ప్రతిపాదనలపై అనుమానాలు సృష్టించడానికే ఈ ప్రచారాన్ని ఉద్దేశించారు.

ఈ దుష్ప్రచారాన్ని గట్టిగా తిప్పికొట్టాలని మేం నిర్ణయించాం. అలా చేయటానికి తగు కారణాలున్నాయి, అవేమిటంటే ఒకటి—పోరాటానికి ఎదురయిన ప్రమాదాలు. రెండు మానికీయన్[2] తరహా ప్రచారానికి, సోషలిస్టు దేశాల్లోని జీవిత వాస్తవాలకి మధ్య పెరుగుతున్న దూరం.

ఆర్థిక దుస్థితి అంటున్నారు—కానీ వివిధ సోషలిస్టు దేశాల్లోని వాస్తవ వివరాలు—అంకెలు చూస్తే తద్భిన్నమైన పరిస్థితి కనిపిస్తుంది. సోషలిస్టు దేశాల్లో ఆర్థిక వ్యవస్థ గణనీయంగా అభివృద్ధి చెందిందని ఐక్యరాజ్యసమితి నియమించిన యూరపుదేశాల ఆర్థిక కమిషన్ పేర్కొన్నది. సోషలిస్టు దేశాల్లోని ఆర్థిక ప్రగతి, ఆ దేశాల్లో ఇప్పటికీ సాధించిన విజయాల్ని పటిష్టం చేయడమే కాకుండా, తాజా విజయాలను సానుకూల పరిస్థితులను సృష్టిస్తున్నాయి.

స్వేచ్ఛను అక్కడ అరికడుతున్నారని సాగిస్తున్న ప్రచారాన్ని తిప్పికొట్టడానిక్కూడా మాకు కారణంవుంది. సోషలిస్టు వ్యవస్థల వాస్తవాలను భ్రష్టు

---

2. మానికీయన్ అంటే మంచినీ, చెడునూ కలబోసి చెప్పడం—ఎడిటర్

పటించి, అక్కడి అభివృద్ధికి హాని కలిగించిన వ్యక్తిపూజ పద్ధతులను మేం నిస్సంకోచంగా ఖండించాం. మా కేంద్రకమిటీ ఇలా గుర్తు చేసింది. "రాజకీయ సమస్యల పరిష్కారానికి ఎక్కడైనాసరే పరిపాలనా చర్యలను తీసుకోవటాన్ని మేం రాజీలేకుండా ఖండిస్తాం" ఇలాంటి పద్ధతులు ముమ్మాటికీ తిరోగమన స్వభావం కలిగినదనే వాస్తవాన్ని పక్కన పెడితే, ఇందులోని నిజాలు ఒకదానితో పోలి మరొకటి వుండవు.

తమకు తాము "న్యాయనిర్ణేతల" మని చెప్పుకునేవాళ్ళు ఈ దేశాల్లోని పార్టీలు, వాటి కార్యక్రమాలు ముందుకు పురోగమిస్తున్న క్రమాన్ని అసలేమాత్రం పట్టించుకోరు. అక్కడ జరుగుతున్న ఆర్థిక సంస్కరణల గురించిగానీ, ట్రేడ్ యూనియన్లు, సాంఘిక, రాజకీయసంస్థలు నిర్వహిస్తున్న పాత్ర, ఎన్నికల వ్యవస్థ, ప్రభుత్వము—పార్టీ యొక్క భాగస్వామ్యంపై సాగే చర్చల గురించి కానీ అసలె మాట్లాడరు. కేవలం అక్కడ సోషలిస్టు వ్యవస్థ నిర్మాణం జరుగుతున్నందువల్లనే అక్కడి అసంఖ్యాక ప్రజలు తమ ప్రాథమికహక్కుల్ని, స్వేచ్ఛల్ని సాధించారన్న వాస్తవాన్ని కూడా గుర్తించరు.

సోషలిస్టు దేశాల్లోని వాస్తవాలను గట్టిగా బలపరచడమంటే, ఆ దేశాలు భూలోక స్వర్గాలన్న మా పాత దృక్పథానికి మళ్ళీ పోతున్నట్లా?

ముమ్మాటికీకాదు. నేనిదివరకే చెప్పినట్లు— మా పార్టీ మహాసభలో సోషలిస్టు దేశాలపట్ల సరైన దృక్పథాన్నే రూపొందించాం.

మేము, ఫ్రెంచి తరహా సోషలిజానికి మా ప్రజాస్వామిక పంథాను నిర్వచించేటపుడు, నమూనా అన్న భావననే తిరస్కరించాం. ఈ సమాజాల్లో ఇపుడున్న సోషలిజం అనుభవాన్ని, దాని అభివృద్ధిని, అందులోని వైరుధ్యాలను అరమరికలు లేకుండా వాస్తవికంగాను, లోతుగాను విశ్లేషించాం.

ఆ దేశాల్లో వాటికి సమస్యలు లేకపోలేదు. అయితే అవి ఒక దేశానికీ, మరొక దేశానికీ భిన్నంగా వుంటాయి. వాటిని ఆయా దేశాల్లోని పార్టీలు ఎప్పటి కప్పుడూ విశ్లేషించుకొని ఎవరికివారే తమ సొంత విధానాలను రూపొందించుకుంటారు.

ఈ సమస్యలను అవగాహన చేసుకోవడంలోనూ, వాటి స్వభావాన్ని గుర్తించడంలోనూ వాటి మూలాన్ని విశ్లేషించడంలోనూ మేం చేసే ప్రయత్నాలు ఏ విధంగానూ సోషలిస్టు దేశాలు సాధించిన నిజమైన ఫలితాలను కప్పిపుచ్చలేవు. పైగా ఆ దేశాల అభివృద్ధి ఇపుడు ఒక కొత్తదశలో కూడా ప్రవేశించినట్టుంది.

మా మటుకు మేము సోషలిస్టు అనుసరణపై ఒక చర్చ జరగాలని వాంఛిస్తున్నాం. పరిహాసానికి తావులేని వాస్తవాలపై వాదనా పటిమతో కూడిన లోతైన చర్చ జరగాలి. అలాంటి చర్చకు మేము అన్ని ప్రయత్నాలు చేస్తాం.

ఆఖరిగా, కేంద్ర కమిటీ ప్లీనరీ సమావేశానికి సమర్పించిన ఈ నివేదికా భాగంలో నేను, చైనాలోని ఆంతరంగిక విషయాల్లో జరుగుతున్న మార్పులను, అలాగే విదేశాంగ విధానాల్లోని కొన్ని సానుకూల మార్పులను హర్షించాను. దీని వల్ల ప్రపంచ వ్యాపితంగా శక్తుల పొందికలో అలాగే సోవియట్ యూనియన్‌కు వ్యతిరేకంగా చైనాను ఉపయోగించాలన్న అమెరికా వ్యూహంలో తీవ్ర పరిణామాలు రాక మానవు.

ఈ రెండు సోషలిస్టు దేశాలమధ్య ఏర్పడనున్న భావి సంబంధాలను గురించి ఇప్పుడే ఏమీ చెప్పలేకపోయినప్పటికీ, అలాంటి క్రమాన్ని నెమ్మది చేయటానికి అమెరికా చేస్తున్న ప్రయత్నాలు, ఆ క్రమంవల్ల జరిగే పరిణామాలు, ఎదురయ్యే కొత్త సమస్యలను గురించి అదెంత పట్టుదలగా వున్నదో అర్థమవుతున్నది.

ఈ రెండు దేశాలమధ్య సంబంధాలవల్ల సామ్రాజ్యవాదానికి ఎదురయ్యే ఇబ్బందులు ఇంత అంతాఅని చెప్పలేము. మేం చేసిన మరో ముఖ్యమైన విశ్లేషణ ఇది. పెరుగుతున్న సామ్రాజ్యవాద దౌర్జన్య స్వభావాన్నిబట్టి చూస్తే, శక్తుల పొందికలో మార్పు ప్రగతికి దారితీస్తుందనే ఆలోచనకు రావటం చాలా ప్రమాదకరం.

సామ్రాజ్యవాద పథకాలు నిస్పృహకు లోనైనపుడు తెగువకు పాల్పడతాయి. దాన్ని ఎదిరించాలంటే కేవలం అది పోరాటం వల్లే సాధ్యం. ప్రగతి, శాంతి, ప్రజాస్వామ్యానికి కట్టుబడిన శక్తులన్నీ ఐక్యమై సమర్థవంతంగా సామ్రాజ్యవాదాన్ని ఎదుర్కోవాలి.

ఈ విశాల ఉద్యమంలో భాగంగా, కమ్యూనిస్టుల పోరాటం అత్యంతావశ్యకం. ఈ సందర్భంగా కేంద్రకమిటీ మూడు ప్రధాన లక్ష్యాలను నిర్దేశించింది: అవి—శాంతి, నిరాయుధీకరణ-నూతన అంతర్జాతీయ వ్యవస్థ – వివేధాల పరిష్కారం కోసం పోరాటం.

ముగించే ముందు, నేనిక్కడ కేవలం శాంతి నిరాయుధీకరణకోసం చేయాల్సిన పోరాటాన్ని గురించే ప్రస్తావిస్తాను. యూరపులో కొత్త అణు మిసైలీలు మోహరించిన తరువాత ఆయుధ పోటీ తీవ్రతరమైన దృష్ట్యా ఇది చాలా పెద్ద ప్రయత్నం. ఈ పరిస్థితుల్లో ! అటు పశ్చిమ రాజ్యాల్లోనూ, ఇటు తూర్పు రాజ్యాల్లోనూ అణ్వాయుధాలను స్తంభింపజేయడం, అన్ని దేశాలకు రక్షణ హామీని

కల్పిస్తూ అతి తక్కువ స్థాయికి ఆయుధాల సమతూకాన్ని సాధించేందుకు అంతర్జాతీయ సంప్రదింపులు జరగటానికి అనువైన పరిస్థితులను సృష్టించడం అవసరమని మేము విశ్వసిస్తున్నాం. దీనికి సంబంధించి వివిధ ప్రభుత్వాలు, ప్రధానమైన రాజకీయ, సాంఘిక, మత సంస్థలు అనేక ప్రతిపాదనలను, ఆలోచనలను ముందుంచాయి. వీటిని పరిశీలించాల్సిన అవసరమున్నది.

శాంతి పరిరక్షణకు ఫ్రాన్సు సానుకూలమైన పాత్రను నిర్వహించవచ్చు. ఈ పోరాటం, మా దేశ రక్షణ హక్కుతో ముడిబడి వున్నదన్నది కూడా మా విశ్వాసం. ఈ విషయంలో ఇతరులకెంత హక్కు వున్నదో మాకూ అంతే హక్కు వుంది. దీనర్థం అవసరమైన స్థాయిలో, ఆధునికమైన రీతిలో అణ్వాయుధ శక్తిని ఫ్రాన్సు కలిగివుండవచ్చు. అయితే, అణ్వాయుధాల స్తంభనకు సంబంధించిన సానుకూల ప్రతిపాదనలు, అవకాశాలకు బలం చేకూర్చటానికి ఫ్రాన్సులోనూ, ప్రపంచమంతటా కూడాను విశాలమైన ప్రజా ఉద్యమం మరింత విస్తృతంగా సాగడం అత్యంతవసరం.

ఈ సందర్భంగానే, అతి తక్కువ స్థాయికి ఆయుధాల సమతూకాన్ని తగ్గించే లక్ష్యాన్ని సాధించటానికి, ఆయుధ పోటీని స్తంభింపజేసి, ఆయుధపోటీవల్ల కలిగే ప్రమాదాన్ని నివారించటానికి ఉద్దేశించిన జాతీయ, అంతర్జాతీయ చొరవలకు తోడ్పడేందుకు ఫ్రెంచి కమ్యూనిస్టుల సంసిద్ధతను మేము పునరుద్ఘాటిస్తున్నాం. ప్రస్తుతం ఆయుధాల మీద చేస్తున్న ఖర్చు భయంకరంగా మనముందు నిలుస్తున్న సమస్యలు-ఆకలి, దారిద్ర్యం, వెనుకబాటుతనాన్ని ఎదుర్కోవటానికి ఉపయోగించవచ్చు. ఈ దృష్ట్యానే శాంతి - నిరాయుధీకరణకోసం పోరాటం మరీ అవసరం.

ఆంతరంగిక విధానానికి సంబంధించిన సమస్యలపై మాదిరిగానే, విదేశాంగ విధానానికి సంబంధించి కూడా ఫ్రెంచి కమ్యూనిస్టు పార్టీ వైఖరి స్పష్టంగానే వుంది. ప్రతి పరిస్థితిపై చేసిన ఖచ్చితమైన విశ్లేషణ ఆధారంగా, శాంతి, న్యాయం, స్వేచ్ఛలతో కూడిన ప్రపంచాన్ని సృష్టించటానికి, ఒక్క మాటలో చెప్పాలంటే అన్ని దేశాల్లో మానవహక్కులు విస్తరింపజేయటానికి స్త్రీ, పురుషులందరినీ పోరాటంలోకి పంపే పటిమ గల ప్రతిపాదనల్ని రూపొందించటం. ★

# పోర్చుగల్ పార్టీ మహాసభ సమీక్ష

యాంజిలో వెలోసో

*పోర్చుగీసు కమ్యూనిస్టు పార్టీ (పి. సి. పి) కేంద్ర కమిటీ రాజకీయ కమిషన్ సభ్యుడు*

ఒపర్టో నగరంలో జరిగిన పి. సి. పి 10 వ మహాసభ (1983 డిసెంబరు) అసంఖ్యాక ప్రశ్నలను, అనుభూతులను ఉదయింపజేసింది. ఈ నగరం చాలా కాలంగా అత్యంత అభివృద్ధి నిరోధక శక్తులు ఆధిపత్యం వహిస్తున్నట్టిది. పోర్చుగల్‌లో రెండవ పెద్ద నగరమైన ఒపర్టో ఉత్తర భాగంలో వుంది; విప్లవ ప్రతీఘాత టెర్రరిస్టు చర్యలనేకానికి ఈ నగరం పేరు బడసింది. అక్కడ కమ్యూనిస్టుల సంఖ్య 1975-1976 లో దాదాపు 5,000 మాత్రమే కాగా, 1983 లో ఆ సంఖ్య 25,000 దాటింది. 10 వ మహాసభ పోర్చుగల్ రాజకీయ పరిస్థితిలోని ఒక విశిష్ట అంశాన్ని వెలుగులోకి తెచ్చింది; అదేమంటే విప్లవ క్రమం ప్రతీ దశలోనూ, అభివృద్ధి నిరోధకుల ఎదురుదాడి అత్యంత తీవ్ర స్థాయిలో వున్నప్పటికీ, కమ్యూనిస్టు పార్టీ నిలకడగా పెరుగుతూ వుండటం, నిర్మాణరీత్యా పటిష్టమౌతూవుండటం జరుగుతున్నది. పార్టీ సభ్యత్వం గత మహాసభ (1978) నాటి నుండి 1,64,000 నుండి 2,00,000 లకు పెరిగింది; ఒపర్టో మహాసభలో దాదాపు 2,200 మంది ప్రతినిధులు ఆ సభ్యత్వానికి ప్రాతినిధ్యం వహించారు.

సోదర పార్టీల నుండి,జాతీయ విముక్తి ఉద్యమాల నుండీ మా మహాసభకు 64 ప్రతినిధి వర్గాలు రావడం, దాదాపుగా ప్రపంచంలోని ప్రగతిశీల శక్తులన్నింటి నుండి అసంఖ్యాకంగా శుభాకాంక్షల సందేశాలు రావడం, పోర్చుగీస్ విప్లవంలో వారు చూపుతున్న గొప్ప ఆసక్తికి, పోర్చుగీసు కమ్యూనిస్టుల, ప్రజాతంత్ర శక్తుల వారి సుస్పష్టమైన సంఘీభావానికి సూచిక.

పార్టీ కేంద్ర కమిటీ 10 వ మహాసభ కొరకు రూపొందించిన వివరణాత్మక పత్రం 3000 లకు మించిన పార్టీ సభలు, సమావేశాలలో చర్చించబడింది.

ప్రతిపాదిత రాజకీయ దృక్పథానికి అవి ఎంతో దోహదం చేశాయి. సమష్టి, వ్యక్తిగత విశ్లేషణ ఫలితంగా ప్రతిపాదించబడిన 2000 లకు పైబడిన సవరణలకు రచనా కమిటీ ఆమోదించి ముసాయిదా రాజకీయ తీర్మానంలో వాటిని పొందుపరిచింది. ఈ క్రమం అనేకానేక రకాల కార్యాచరణలు, భావాలు, పద్ధతులు సాంప్రదాయాలను ప్రతిబింబించింది. పార్టీ అంతరంగిక ప్రజాస్వామ్యానికి మూలం. మొత్తం పార్టీ గుర్తించిన, బలపరిచిన విధానం అమలుకు, పరిపుష్టికి ప్రాతిపదిక అయిన సమష్టి కృషి మార్గాల్లో సృజనాత్మక కృషికి అవన్నీ దోహదం చేశాయి. ఈ విధానాన్ని రూపొందించటం, అమలు చేయటం పార్టీ సభ్యులందరికీ సంబంధించిన విషయమని గుర్తిస్తూ పి.సి.పి ఒక పెద్ద సమిష్టి సంస్థగా పనిచేస్తున్నది.

మహాసభ రాజకీయ తీర్మానం, గత నాలుగు సంవత్సరాల కాలంలో దేశ అంతరంగిక పరిస్థితి పరిణామాన్ని విశ్లేషించింది. విప్లవ ప్రతీఘాత క్రమాన్ని కొనసాగిస్తున్న అభివృద్ధి నిరోధకులు కొన్ని లాభాలు పొందినా, కొంత ముందంజ వేసినా, తమ లక్ష్యాలన్నింటినీ సాధించడంలో విఫలమైనారు. ప్రజాస్వామిక పాలనను దెబ్బతీసే ప్రయత్నాలను ఓడించగలందులకు తగిన బలం, సామర్థ్యం తమకున్నదని కార్మికవర్గం, యితర శ్రమజీవులు, నిజమైన ప్రజాతంత్రవాదులంతా, అధికార సంస్థలు రుజువు చేశాయి. మరోవైపున ఒక ప్రజాతంత్ర ప్రత్యామ్నాయంతో ఈ పథకాలను త్రిప్పికొట్టలేకపోయినట్లు కూడా వారు నిరూపించుకున్నారు.

"పోర్చుగీసు విప్లవం సజీవంగా వుందన్నది వాస్తవం. పరివర్తన చెందిన ఆర్థిక వ్యవస్థా స్వరూపం, దాని ప్రాథమిక లక్షణాలను నిలుపుకున్నది. విప్లవం రద్దుచేసిన రాజ్యా-గుత్తపెట్టుబడిదారీ వ్యవస్థను పునరుద్ధరించాలన్న లక్ష్యాన్ని ముందుకు తీసుకుపోవటంలో అభివృద్ధి నిరోధకులు అసాధారణ చిక్కులను, తీవ్రమైన ప్రతిఘటనను ఎదుర్కొంటున్నారు." ఏప్రిల్ విప్లవం ద్వారా తేసుకురాబడిన సాంఘిక-ఆర్థిక మార్పులు ప్రజాస్వామిక ప్రభుత్వాన్ని స్థాపించుకుని పరిరక్షించుకోవడం, నూతన రాజకీయ వ్యవస్థ క్రింద ఆర్థిక వ్యవస్థను అభివృద్ధి చేసుకోవడం అనే వస్తుగత కర్తవ్యాలకు అనుగుణంగా వున్నాయన్న వాస్తవాన్ని మహాసభ మరోసారి ధృవీకరించింది. ఇవి గడుస్తున్న ప్రయోజనాల లేక స్వేచ్ఛంద తత్వ స్వభావం గల చర్యల ఫలితం కాదు.

అందువల్ల 1976 లో ప్రారంభమైన విప్లవ ప్రతీఘాత క్రమం ప్రజాతంత్ర విజయాలను కొంత దెబ్బతీసినప్పటికీ, విప్లవం సాధించిన ఆర్థిక వ్యవస్థా స్వరూపాల అభివృద్ధి దశను, సాంఘిక సంబంధాలనూ విచ్ఛిన్నం చేయలేక పోయిందని మహాసభ నిర్ధారణకు వచ్చింది.

ప్రజా బాహుళ్యం యొక్క, నిజమైన ప్రజాతంత్ర శక్తుల ప్రతిఘటనను అణచివేయటానికిగాను పాలకులు రాజకీయ ప్రజాస్వామ్యం పైనే దాడులకు మీదు

మిక్కిలి విస్తృతంగా, బహిరంగంగా పూనుకుంటారు. సర్వాధికారాన్ని చేతబుచ్చుకునే వ్యూహంలో భాగంగా దానిపై వారు చేస్తున్న దాడి అసలు వ్యవస్థను, పరిపాలనా సంస్థల ప్రత్యేక హక్కులను దెబ్బతీస్తున్నది; పార్లమెంటు, సాయుధ బలగాలు, న్యాయవ్యవస్థ, స్థానిక స్వపరిపాలనా సంస్థలను ప్రభుత్వ అజమాయిషీ క్రిందకు తీసుకురావటానికి, ప్రభుత్వ యంత్రాంగాన్ని పార్టీ పలుకుబడి క్రిందకు తీసుకురావటానికి యిది ఉద్దేశించబడింది. తద్వారా కార్మికవర్గ, ప్రజల ఉద్యమాన్ని అణచివేయవచ్చునని, పి.సి.పి ప్రతిష్ఠ పెరగకుండా అదుపు చేయవచ్చునని రాజకీయ ప్రజాస్వామ్యంపై జరుగుతున్న దాడి వెనుకనున్నవారు భావిస్తున్నారు. వారు పౌరహక్కులు, స్వేచ్ఛలను హరిస్తారు. సిగ్గువిడిచి ప్రచార సాధనాలలో జోక్యం చేసుకుంటారు. నిర్బంధ చర్యలకు ఒడిగడతారు. ప్రజాతంత్ర స్వభావం గల ఎన్నికలను హరిస్తారు.

అభివృద్ధి నిరోధకుల ఎదురుదాడి దశలను 10 వ మహాసభ నిర్దేశించింది. ప్రస్తుతం సాగుతున్న సోషలిస్టు, సోషల్ డెమొక్రాటిక్ మంత్రివర్గ పాలన విప్లవ ప్రతిఘాత క్రమంలో ఐదవ దశకు ప్రాతినిధ్యమని అది పేర్కొన్నది. ప్రస్తుత మంత్రివర్గం ఏర్పాటు, మితవాద పార్టీల కూటమి అయిన డెమొక్రటిక్ అలయన్స్ (డి.ఎ) ఘోరంగా ఓడిపోయాక, మితవాద విధానాన్ని కొనసాగించటాన్ని సాధ్యం చేసేందుకు ఏర్పడిన మిశ్రమ ప్రభుత్వం మాత్రమే. సోషలిస్టు పార్టీ కూడా వున్న, ఈ పార్టీ ప్రధాన కార్యదర్శి నాయకత్వం వహిస్తున్నటువంటి ప్రభుత్వం అభివృద్ధి నిరోధకుల విధానాన్ని ప్రస్తుతం అమలు చేస్తున్నది; ఈ విధానం స్వభావంలో, ప్రభావాలు లేక లక్ష్యాలలో ఎటువంటి మార్పులు తీసుకురాలేదు. డి. ఎ ప్రభుత్వం విషయంలో వ్యవహరించిన మాదిరిగానే ఈ ప్రభుత్వాన్ని కూలగొట్టడం ప్రధాన కర్తవ్యంగా మహాసభ నిర్ణయించింది.

దేశంలో రోజురోజుకూ క్షీణిస్తున్న అత్యంత తీవ్ర ఆర్థిక, ద్రవ్య సంక్షోభానికి ప్రధాన కారణం పెట్టుబడి వ్యవస్థ స్వరూపాలను పునరుద్ధరించేందుకు 1976 నాటినుండీ అనుసరించబడుతున్న విధానం. వరుసగా వచ్చిన ప్రభుత్వాలు, సంక్షోభ పరిష్కారానికి మార్గంగా ఆర్థిక వ్యవస్థ పునరుజ్జీవనానికి తప్పనిసరి అవసరంగా ఈ విధానాన్ని ప్రతిపాదించాయి. అయితే వస్తుగత కారణాలు, ప్రజా ప్రతిఘటన దృష్ట్యా, పెట్టుబడిదారీ వ్యవస్థ స్వరూపాల పునరుద్ధరణ అభివృద్ధి నిరోధకులకు అనుగుణమైన దానికన్నా చాలా నెమ్మదిగా సాగుతున్నది. దేశంలో సృష్టించబడుతున్న అదనపు విలువ, మిగులు పెట్టుబడి, ప్రజా వనరులు, అలాగే వ్యవసాయ సంస్కరణకు సంబంధించిన భూములు, యితర ఆస్తులు బడా పెట్టుబడిదారుల, భూస్వాముల చేతుల్లో వేగంగా, అక్రమంగా, అన్యాయంగా పోగుపడటానికి ఈ విధానమే కారణం. పాలకవర్గాల ప్రధాన ధ్యేయం అదే.

పెట్టుబడిదారీ ఉత్పత్తి విధానం క్రింద పెట్టుబడిదారుల విలీనం, కేంద్రీకృతం కావడం, గుత్త పెట్టుబడిదారులు ఏర్పడటం, అలాగే పెట్టుబడి ప్రోగుపడటం, ద్రవ్య పెట్టుబడిదారులు ఏర్పడటం పెట్టుబడిదారీ అభివృద్ధి వస్తుగత ధర్మాల ప్రకారం జరుగుతుందని మహాసభ రాజకీయ తీర్మానం పేర్కొన్నది. ప్రభుత్వ పెట్టుబడిదారీ వ్యవస్థను పునరుద్ధరించే విప్లవ ప్రతీఘాత విధానం తద్భిన్నంగా ఈ సూత్రాలను అలక్ష్యం చేస్తుంది, హరిస్తుంది; ఎందుకంటే, ప్రభుత్వం వైపునుండి ఉమడి రాజకీయ జోక్యంద్వారా జాతి సంపదలను బడా పెట్టుబడిదారుల చేతుల్లో కేంద్రీకరింపజేయటం దీని లక్ష్యం. పరిశ్రమలు, వాటాలు, నిధులు, భూములు, యంత్రాలు, పసంపద వారికి బదిలీ చేయబడతాయి.

ఇటీవలి ప్రభుత్వాల ఆర్థిక వ్యూహం "పచ్చి దోపిడీ, బలవంతపు కేంద్రీకరణ కార్యం"గా వుందని మహాసభ అభివర్ణించింది. ప్రభుత్వం నిరంకుశంగా జోక్యం చేసుకోవడంద్వారా అది "ఆర్థిక ధర్మాలను ఉల్లంఘిస్తున్నది. పెట్టుబడిదారీ వ్యవస్థా స్వరూపాలతోసహా వివిధ స్వరూపాలలో మరుకైన ఉత్పత్తిని ప్రతిఘటిస్తున్నది. నిరోధిస్తున్నది; అసమానతలన్నింటినీ తీవ్రతరం చేస్తున్నది. ఉత్పత్తి పంపిణీలలో అస్తవ్యస్తతను, అరాచకాన్ని తెచ్చిపెడుతున్నది. ప్రదేశాలపై పరాధీనతను పెంపుచేస్తున్నది." గుత్తపెట్టుబడిదారులను, జమీందారులను పునరుద్ధరించే రాజకీయ ధ్యేయం ప్రస్ఫుటంగా ఆర్థిక వ్యవస్థ పురోగతి అవసరాలకన్నా మిన్నగా వుంచబడింది; అంతిమంగా ఆర్థిక పురోగతి పూర్తిగా త్యాగం చేయబడింది.

జాతీయం చేయబడిన పరిశ్రమలపై సాగుతున్న విచ్ఛిన్నకర, విద్రోహపూరిత దాడి జాతీయ జీవన రంగాలన్నింటిపైన వినాశకర పర్యవసానాలు కలుగజేస్తోంది. జాతీయ ఆర్థిక వ్యవస్థను రక్షించి, విస్తరించడానికి, వినాశనాన్ని నిరోధించటానికి, నిరుద్యోగం, ఆకలి, దారిద్ర్య ప్రమాదంనుండి పోర్చుగీసును బయటపడేయటానికి, ప్రజాతంత్ర పాలన, జాతీయ స్వాతంత్ర్యం బ్రతికి బట్టకడుతుందని హామీ యివ్వటానికీ పెట్టుబడి స్వరూపాలను పునరుద్ధరించే విధానాన్ని ఆపుచేయవలసిందిగా, ప్రజాతంత్ర మార్పుల ఫలితంగా ఏర్పడిన నూతన ఆర్థిక స్వరూపానికి అనుగుణమైన విధానాన్ని చేపట్టవలసిందిగా పిలుపు యివ్వడం అత్యావసరం.

శ్రమజీవులలో ఉద్దీపితమైన శక్తి, మేధాసంపత్తి, సామర్థ్యానికి సంబంధించి పోర్చుగీసు విప్లవానికి లభించిన అనుభవముంది: వారు పోరాటాలు సాగిస్తూ, ప్రగాఢమైన సామాజిక మార్పులను డిమాండ్ చేస్తున్నారు. ప్రజాతంత్ర ప్రత్యామ్నాయాన్ని ప్రజలు ఇంకా నిర్మించవలసి వున్నప్పటికీ, వారు అనేక పాక్షిక విజయాలు సాధించారు. దీనివల్ల, అభివృద్ధి నిరోధకులు పదేపదే తెస్తున్న విద్రోహకర

ఆకస్మిక పథకాలను భగ్నం చేయటం, విప్లవ ప్రతీఘాత క్రమాలను మందగింప జేయటం, అప్పుడప్పుడు కొంతకాలంపాటు వాటిని స్తంభింపజేయటం వారికి సాధ్యమైంది. ప్రజాతంత్ర పాలనావ్యవస్థను, దాని విజయాలను పరిరక్షించుకోవ టానికి ప్రజా కార్యాచరణలు ప్రధానమైన, నిర్ణయాత్మక అంశంగా కొనసాగు తున్నాయి.

శ్రమజీవుల యితర రూపాల పోరాటాలు కూడా ముఖ్యమైన పాత్ర వహి స్తున్నాయి. రాజకీయ తీర్మానం ఇలా ప్రస్తావించింది : "అభివృద్ధి నిరోధకుల దాడికి ప్రతిఘటన ఉత్పాదక సృజనాత్మకతను, ఆర్థిక, సాంఘిక, రాజకీయ, సాంస్కృతిక సమస్యల పరిష్కారం, లేక అధికారులు చేసిన నిర్ణయాలలో జోక్యం చేసుకోవటం వంటి విభిన్న రూపాలు సంతరించుకుంటున్న వాస్తవమే పోర్చుగీసు ప్రజాస్వామ్యం విప్లవంనుండి ఉద్భవించిన వాస్తవికమని సూచి స్తున్నది. నూతన సాంఘిక-ఆర్థిక వ్యవస్థాగత స్వరూపాలలో, ప్రజలు, వారి ప్రతినిధులు జోక్యం చేసుకుంటున్న నూతన రూపాలలో, సాధించుకున్న, విస్తృత హక్కులు, స్వేచ్ఛలలో ఈ వాస్తవం కూడుకుని వుంది. జాతీయ సమస్యల పరిష్కారానికి కార్మికులు, ప్రజల జోక్యం తప్పనిసరి అన్నది నిర్వివాదాంశం."

ప్రజలు ఉపయోగించిన వివిధ పోరాట రూపాలను మహాసభ ఈ కోణం నుండి విశ్లేషించింది : అవి ఎన్నికల ప్రచారాలు, పార్లమెంటు యితర ప్రభుత్వ సంస్థలలో కార్యకలాపాలు, జాతీయం చేయబడిన పరిశ్రమలలో కృషి, వ్యవసాయ సంస్కరణల క్రిందకు వచ్చిన భూములలో ఉత్పాదక కృషి, విద్యా రంగంలో చేపట్టిన కార్యాచరణ, సాంస్కృతిక ప్రజాస్వామ్యంకొరకు చేసిన కృషితోసహా జాతీయ సమస్యల పరిష్కారానికి ప్రజాసంస్థలు చేసిన దోహదపూర్వక కృషి.

అభివృద్ధి నిరోధకుల తీవ్రమైన దాడులు జరిపినప్పటికీ, శ్రమజీవులు చేపట్టిన కార్యాచరణలు దేశ ఆర్థిక, సాంఘిక, సాంస్కృతిక సమస్యల పరిష్కా రానికి ఎంతో విలువైన దోహదం చేశాయి. ప్రజలకు సంబంధం లేకుండా, వారి శ్రమ, పట్టుదల, సమిష్టితత్వం లేకుండా ఈ సమస్యలు పరిష్కరించ బడ జాలవని చెప్పడానికి యివి విలువలేని సాక్ష్యం.

వరుసగా వచ్చిన ప్రభుత్వాలు చేపట్టిన చర్యలు "అనివార్యమైనవి" "చావు దెబ్బ తీసినవి," "గత్యంతరంలేనివి" అన్న అభివృద్ధినిరోధక ప్రచారారోపణలను తిరస్కరిస్తూ, ఈ మహాసభ ప్రత్యామ్నాయ ప్రజాతంత్ర విధానం సాధ్యమన్‌గాక, దేశాన్ని విపత్తునుండి కాపాడేందుకు జాప్యం చేయకుండా దాన్ని చేపట్టవలసిన అవసరాన్ని నొక్కిచెప్పింది.

ఈ ప్రజాతంత్ర ప్రత్యామ్నాయ విధానంలో ఐదు అత్యంతావశ్యకమైన ధ్యేయాలున్నాయి: స్థిరత్వం, చట్టబద్ధత—ప్రజాతంత్ర వ్యవస్థ; సంక్షోభానికి స్వస్తి పలకడం, ఆర్థికపునరుద్ధరణ, అభివృద్ధి; శ్రమజీవులకు ఉన్నతజీవన, సాంస్కృతిక ప్రమాణాలు; హామీయివ్వబడిన పౌరహక్కులు, స్వేచ్ఛలు ; దేశఐక్యత; జాతీయ స్వాతంత్ర్యం, భద్రత, శాంతి.

ఈ దశలో మహాసభ దిగువ ప్రాధాన్యతా కర్తవ్యాన్ని నిర్ణయించింది : ప్రజాతంత్ర పాలనా వ్యవస్థ ప్రధాన రక్షణల్లోకి చొరబాటును నిరోధించటం, రాజ్యాంగాన్ని, ప్రజాతంత్ర చట్టబద్ధతను, పౌరహక్కులను, స్వేచ్ఛలను, జాతీయ కరణద్వారా, వ్యవసాయ సంస్కరణలద్వారా ఏర్పడిన నూతన ఆర్థిక స్వరూపాలను, శ్రమజీవుల ప్రయోజనాలు హక్కులను, జాతీయ స్వాతంత్ర్యాన్ని శక్తికొలది, కృతనిశ్చయంతో రక్షించుకుంటేనే, సైన్యాన్ని, కోర్టులను పార్టీ రాజకీయాలకు దూరంగా వుంచితే ప్రజాస్వామ్యం కాపాడబడుతుంది. లేనిపక్షంలో ప్రజాస్వామ్యాన్ని నాశనం చేసేందుకు అభివృద్ధి నిరోధకుల ప్రయత్నాలు సులభ తరమౌతాయి.

మూడు ప్రాథమిక అధికార సంస్థలను—దేశాధ్యక్ష పదవి, ప్రభుత్వం, పార్లమెంటు—చేజిక్కించుకోవడంలో 1980లో విఫలమైన అభివృద్ధి నిరోధకులు 1985 అధ్యక్ష ఎన్నికలలో ఆ లక్ష్యాన్ని సాధించుకునేందుకు వేస్తున్న పథకాలను ఓడించటం ముఖ్యం. మితవాదుల అభ్యర్థిని ఓడించి, ప్రజాతంత్ర అభ్యర్థిని గెలిపించటం, ప్రస్తుత ప్రభుత్వానికి ఆనాటికి సాధించవలసి వున్న ప్రజాతంత్ర ప్రత్యామ్నాయాన్ని పటిష్ఠ చేసుకోవటానికి ఒక ముఖ్యమైన అంశంగాగాని లేక అదికార్యరూపం ధరించటంలో విఫలమైతే (ఆశించిన దానికి భిన్నంగా) ఈ ప్రత్యామ్నాయాన్ని అమలు చేసేందుకు సాధనంగాగానీ ఉపకరిస్తుంది. 1985 లో మారియో సోర్స్ మితవాదుల అధ్యక్ష అభ్యర్థి అయ్యే అవకాశంకనిపిస్తున్నందున ఆయన అభ్యర్థిత్వానికి కమ్యూనిస్టు పార్టీ తోడ్పాటు వుండే ప్రశ్నేలేదని మహాసభ పత్రం పునరుద్ఘాటించింది.

1985 ఎన్నికలలో మితవాదుల అభ్యర్థిని ఓడించేందుకు, ప్రజాతంత్ర పాలనా వ్యవస్థను కాపాడి, అది పనిచేసేటట్లు చూడగల సమర్థతున్న అభ్యర్థిని ఎన్నుకునేందుకు మహాసభ మూడు ప్రాథమిక షరతులను రూపొందించింది. అవి ఇలా వున్నాయి : ప్రజాతంత్ర అభ్యర్థికి తగినన్ని వ్యక్తిగత గుణగణాలుండాలి ; ఉమ్మడి అభ్యర్థికి ఓటుచేయటానికి ప్రజాతంత్రవాదులు, దేశభక్తు లంగీక

రించాలి; ఎన్నికల్లో గెలుపొందటానికి ప్రజాతంత్ర అభ్యర్థి విస్తృతమైన సాంఘిక తోడ్పాటు కలిగివుండి, ప్రస్తుతం అధికారంలో వున్న అధ్యక్షునికి లభించినన్ని ఓట్లు పొందగలిగినవాడై వుండాలి. మెజారిటీ సోషలిస్టులు, కమ్యూనిస్టులు, పాపులర్ యూనిటీ అలయిన్స్‌లోని వారి భాగస్వామ్య పక్షాలు, అలాగే సార్వత్రిక ఎన్నికలలో సోషల్ డెమొక్రాట్‌లకు లేక యితర పార్టీలకు ఓటు చేసినవారు బలపరిస్తేనే యిది సంభవం.

ప్రస్తుత మంత్రివర్గం అంతిమంగా అనివార్యంగా విఫలం కానున్న దృష్ట్యా, ప్రజాతంత్ర ప్రత్యామ్నాయాన్ని మహాసభలో చర్చిస్తున్న సందర్భంలో, అత్యవసర పరిష్కారాలకు ప్రజాతంత్ర ప్రభుత్వానికి అవకాశాలుంటాయని చెప్పబడింది. పార్టీ పొత్తుల స్వరూపం మారినట్లయితే, సోషలిస్టులు, మితవాదుల అలయెన్స్ ఇంకా కొనసాగుతున్నందున వచ్చే ఎన్నికలు ఎట్టి ప్రత్యామ్నాయాన్ని ఇవ్వజాలవు; ప్రభుత్వ సంస్థలు సందిగ్ధంలో పడిపోతాయి.

అటువంటి దోలాయమాన స్థితిని తొలగించి, చట్టసభ ఎన్నికలద్వారా ప్రజాతంత్ర ప్రభుత్వానికి వ్యవస్థాగత ప్రాతిపదిక నేర్పరిచేందుకు రెండు మార్గాలున్నాయి: సోషలిస్టు పార్టీ మితవాదులతో తెగతెంపులు చేసుకుని ప్రజాతంత్ర వాదులతో అలయిన్స్ (పొత్తు) ఏర్పాటు చేసుకోవడం లేక విస్తృతమైన సాంఘిక, రాజకీయ తోడ్పాటు కలిగినట్టి కొత్త రాజకీయ పార్టీలు ఆవిర్భవించటం. పోర్చుగీసు పరిస్థితులలో రెండవ అవకాశం సాధ్యం, అది ప్రధానంగా స్వీయాత్మక అంశాలపై— వ్యక్తులు, చొరవ, నిర్మాణం— ఆధారపడివుంది.

జాతీయ రాజకీయ రంగంపై పరస్పరం మోహరించివున్న ప్రధాన శిబిరాలు రెండున్నాయి: సోషలిస్టు, సోషల్ డెమోక్రాటిక్ ప్రభుత్వ మద్దతుదారులు; ప్రజాతంత్ర ప్రత్యామ్నాయం కొరకు ఏదో ఒక విధంగా నిలబడేవారు. మొదటి దానికి సాంఘిక పునాది వస్తుగతంగా, బడా పెట్టుబడిదారులు, పెద్దపెద్ద యజమానులు, సంపన్నులు, పెద్ద వ్యాపారులు, చిల్లర వ్యాపారులు, పైస్థాయి నిర్వహణాధికారులు, పారిశ్రామిక వేత్తలు— వ్యాపారులతో ఒక భాగం, ఇంజనీర్లు— సాంకేతికులు యితర వృత్తిపర సంస్థలకు చెందిన అనేకమంది సభ్యులు. ప్రజాతంత్ర ప్రత్యామ్నాయానికి వస్తుగత ప్రాతిపదిక శ్రమజీవులు, చిన్న, మధ్య తరగతి వ్యవసాయదారులు, వ్యాపారులు, పారిశ్రామికవేత్తలు, మేధావులు, గణనీయమైన సంఖ్యలో సాంకేతికులు, ప్రజల్లోని కడుపేదతరగతులు.

అయితే ఊగిసలాట తరగతులు లేక ఎటూ నిర్ణయించుకోని గ్రూపులులేవని చెప్పడం దీని ఉద్దేశ్యంకాదు. కాని ప్రభుత్వం, దాని విధానాలపై ప్రత్యేక సందర్భాలలో స్పష్టంగా వ్యక్తమైన వైఖరినుండి యీ విభజన వస్తున్నది. అయితే

పరిస్థితి యిప్పుడు క్లిష్టంగా వుంది; పెట్టుబడిదారీ వ్యవస్థను పునరుద్ధరించే ప్రభుత్వ విధానానికి వ్యతిరేకంగా పోరాటంలో గుత్తపెట్టుబడిదారీ వ్యతిరేక తరగతులు, రంగాలూ పాల్గొంటున్నాయి; అంటే ప్రస్తుతం ప్రభుత్వంలోనున్న పార్టీలకు ఓటు చేసిన విస్తృతరంగాలు ప్రభుత్వాన్ని వ్యతిరేకిస్తున్నాయని అర్థం. మరో విధంగా చెప్పాలంటే సాంఘికశక్తుల పొందిక, రాజకీయశక్తుల పొందిక మధ్య అపసవ్యత వుంది. ఒక వైపున, మిశ్రమ ప్రభుత్వానికి అందులోని భాగస్వామ్య పక్షాలకు ఎన్నికలతో లభించిన సాంఘిక తోడ్పాటుకు అనుగుణమైన తోడ్పాటులేదు. మరో వైపున, ప్రభుత్వ విధానాన్ని ప్రతిఘటిస్తున్న సాంఘిక ప్రాతిపదిక ప్రజాతంత్ర ప్రత్యామ్నాయం కొరకు పోరాడుతున్న పార్టీలకు పార్లమెంటులోగల బలానికన్నా ఎంతో విస్తృతంగా వుంది. ప్రజాతంత్ర ప్రత్యామ్నాయాన్ని అమలు చేయగలిగిన విశాలమైన సాంఘిక, రాజకీయ సంఘటనను ఏర్పరచటానికున్న వస్తుగత ప్రాతిపదిక యిదీ.

అటువంటి ప్రభుత్వాన్ని ఏర్పాటు చేసేందుకు గల అవకాశాన్ని నేడు ఏమి చేయగలము అన్న దృష్టినుండిగాక, పోర్చుగీసు ఏకీకరణ, పోరాటం ఫలితంగా ఏమి చేయాలి, చేయగలము అన్న దృష్టినుండి చూడాలని మహాసభ వక్కాణించింది. ప్రస్తుత ప్రభుత్వం అది రాజీనామా చేయటానికన్నా ముందే దేశాన్ని మరింత తీవ్ర సంక్షోభంలోకి ఈడ్చుతుందని అది అభిప్రాయపడింది. దీనితో "జాతీయ ముక్తికి ప్రజాతంత్ర ప్రభుత్వం" పోర్చుగీసుకు అవసరమని వక్కాణించడం అవసరమౌతుంది; ఆ ప్రభుత్వాన్ని అలా పిలవడం సబబు కూడా. ప్రజాతంత్ర వాదులు, దేశభక్తులంతా, వారి పార్టీ విధేయతలేవి అయినప్పటికీ దాని ఏర్పాటుకు సిద్ధం కావాలి. ఈ ప్రభుత్వ రాజకీయ పొందిక, ఆనాటికి అస్తిత్వంలోవుండే రాజకీయ పొత్తులపై ఆధారపడి వుంటుంది కొబట్టి, అటువంటి ప్రభుత్వాన్ని ఏర్పరచే సంస్థాగత, రాజకీయ, సాంఘిక పరిస్థితులను పరిశీలించటానికి పి.సి.పి. సుముఖంగా వుందని మహాసభ ప్రకటించింది.

నూతన ప్రభుత్వంలో మా పార్టీ చేరడమన్నది తప్పనిసరి షరతు. "ఇది కమ్యూనిస్టులు లేకుండా జరగదు." "ఇది కమ్యూనిస్టుల ద్వారానే జరుగుతుంది" అని భావించే ప్రజల సంఖ్య రోజురోజుకూ పెరుగుతున్నది. రాజ్యాంగాన్ని, ప్రజాతంత్ర చట్టబద్ధతను గౌరవిస్తూ, జాతీయ సంక్షోభాన్ని అంతం చేసేందుకు, దేశం ఎదుర్కొంటున్న తీవ్రసమస్యలను పరిష్కరించేందుకు ప్రభుత్వంలో తన వంతు బాధ్యతను స్వీకరించటానికి పి.సి.పి. ఎప్పటిలాగే సిద్ధంగా వుందని మహాసభ ప్రకటించింది. ఈ లక్ష్య సాధనకు తప్పక తోడ్పడే మరే పరిష్కార మార్గానికి దోహదం చేయటానికైనా అది సిద్ధంగా వుంది.

ప్రజల, దేశ ప్రయోజనాల పరిరక్షణలో పి.సి.పి. ఒక నిర్ణయాత్మక రాజకీయ శక్తి. ఏప్రిల్ విప్లవం ఆదర్శాలు, లక్ష్యాలు, విజయాలపట్ల విధేయత గలిగివున్న పెద్ద పార్టీ యిదొక్కటే.

విప్లవ ప్రతీఘాత కుట్రలు జరిగినప్పటికీ పి.సి.పి. ఇటీవల సంవత్సరాలలో మరింత బలపడింది; ప్రజల్లో పలుకుబడి పెంచుకుంది. సైద్ధాంతిక స్థిరత్వం నుండి విడదీయరానటువంటి తన నిర్మాణ సూత్రాలను పటిష్టం చేసుకోవడం ద్వారా, ముందుకు గొనిపోవడం ద్వారా, సరియైన విధాన పంథాననుసరిస్తూ, ప్రజలు కార్యకలాపాలను ప్రోత్సహించడంద్వారా పి.సి.పి. దీన్ని సాధించగలిగింది. పార్టీ మౌలిక లక్షణాలను యిది మున్నెన్నటికన్నా మిన్నగా ముందుకు తెచ్చింది: అవి: వర్గస్వభావం, వర్గ భావన: బలమైన, ఎక్కువ, అనుభవజ్ఞులైన, సుశిక్షితులైన, నిబద్ధులైన నాయకత్వ స్థాయి కార్యకర్తలు; సమస్యలు పరిష్కరించటానికి, జాతీయ జీవనంలో పాల్గొనటానికి అత్యంత సమర్థులైన పదులవేల క్రియాశీలురు; కార్యాచరణకు సంసిద్ధత. ప్రజలను సమీకరించగల సామర్థ్యం; అన్ని స్థాయిలో సమిష్టితత్వం, పార్టీ ఆంతరంగిక ప్రజాస్వామ్యం; కార్మికవర్గంతో. ప్రజలతో బలమైన సంబంధాలు; ఆదర్శాలపట్ల విధేయత, హామీలపట్ల గౌరవం, ఉన్నత నైతిక స్థాయి.

పార్టీ సభ్యత్వరీత్యా పెరగటాన్ని చెప్పడంతోపాటు యీ వాస్తవాలను పేర్కొనడం కూడా ప్రయోజనకరంగా వుంటుంది: పార్టీ సభ్యులలో కార్మికులు 57 శాతం, ఆఫీసు ఉద్యోగులు 20 శాతం, కాగా మహిళలు వంతు 21.6 శాతం. కేంద్రకమిటీ, యితర నాయకత్వ స్థాయిల్లో కార్మికులు మెజారిటీగా వున్నారు. ఇది మా స్వర్ణతుల్య నిబంధన.

కేంద్ర కమిటీలో కొత్త రక్తాన్ని ప్రవేశపెట్టవలసిన సహజసిద్ధమైన అవసరాన్ని మహాసభ గుర్తించింది. అయితే నాయకత్వంలో సమూల మార్పులు సంక్షోభ సంకేతంగా వుంటాయని, నాయకత్వ స్థానాలలో పాతవారి కొనసాగింపు, కొత్తవారి చేర్పు - ఈ ఇద్దరి మేళవింపు మంచి రాజకీయ ఆరోగ్యానికి సాక్షీభూతంగా వుంటుందని మహాసభ పేర్కొన్నది.

గడచిన దశాబ్దాలలోనూ, మన రోజులలోను అంతర్జాతీయ పరిస్థితి పరిణామాన్ని మహాసభ సమగ్రంగా విశ్లేషించింది. సామ్రాజ్యవాదుల దోపిడీనుండి విముక్తి దిశగా, పీడితులు, పీడకులులేని నూతన సమాజం దిశగా- అనగా సోషలిస్టు సమాజం దిశగా కార్మికులు, ప్రజల పురోగతి చారిత్రకంగా తిరోముఖం పట్టించ సాధ్యంకానిది. విప్లవ శక్తులు అనేక దేశాలలో సాధించిన విజయాలు దీన్ని ధృవీకరిస్తున్నాయి.

పెంపొందుతున్న ప్రజల విప్లవ పోరాటాన్ని "విప్లవ ఎగుమతి" "తూర్పు పశ్చిమ సంఘర్షణ" లేక "సోవియట్ విస్తరణవాద" ఫలితమని చూపేందుకు జరిగే ప్రయత్నాలను పరిణామాలను సామ్రాజ్యవాద ప్రచారం పూర్తిగా వక్రీకరించడంగా అభివర్ణించింది. సామ్రాజ్యవాదం, నయావలసవాదం, ఫాసిజం, జాత్యహంకారం ఖండితంగా కాలగర్భంలో కలిసిపోతున్నట్లు మహాసభ ధృవీకరించింది.

మరోవైపున, అంతర్జాతీయ పరిస్థితిని సామ్రాజ్యవాదులు తీవ్రతరం చేసిన, నూతన ప్రపంచ యుద్ధ ప్రమాదం - అంటే అణుయుద్ధ వినాశన ప్రమాదం పెరుగుతున్న స్థితిని మహాసభ గమనించింది. జాతీయ లక్ష్యాలకొరకు జరిపే పోరాటాన్ని, సార్వత్రిక, తక్షణ, అత్యంత ప్రధాన కర్తవ్యమైన శాంతి పరిరక్షణ కర్తవ్యంతో మేళవించవలసిందిగా ప్రజలందరినీ యిది కోరుతున్నది. యూరప్‌లో కొత్త అమెరికా అణు మిస్సైలు దించటంవల్ల శాంతికి ప్రత్యక్ష ప్రమాదం పెచ్చుపెరిగిన దృష్ట్యా ప్రత్యేక అప్రమత్తత అవసరం. సోవియట్ యూనియన్ ప్రతిచర్యలు ఊహించబడినట్టివేనని, అవి పూర్తిగా సమర్థనీయమైనవని మహాసభ ప్రకటించింది.

శాంతి పరిరక్షణ కొరకు పోరాటమన్నది నేడు ప్రజలందరినీ ఎదుర్కొంటున్న కేంద్ర, తక్షణ కర్తవ్యం ఇది రెండు ప్రధాన మార్గాలలో సాగుతున్నది: ఆయుధపోటీకి, ప్రధానంగా అణ్వాయుధ పోటీకి వ్యతిరేకంగా, దురాక్రమణ చర్యలకు వ్యతిరేకంగా, సంప్రదింపులు, రాజకీయ మార్గాల ద్వారా ఉద్రిక్తతల తొలగింపు కొరకు, జాతీయ స్వాతంత్ర్యం, శాంతి, అంతర్జాతీయ సహకారం ప్రయోజనాలకు దోహదంచేసే విదేశాంగ విధానాన్ని అన్ని దేశాలు ఆచరించడం కొరకు.

సామ్రాజ్యవాదం, "అభివృద్ధి నిరోధక శక్తులు ఎదురుదాడి ప్రారంభించి ఉద్రిక్తతలు పెంచటానికి అత్యంత తీవ్రమైన కారణం విముక్తిక్రమాన్ని నిలవరించి, ప్రపంచ చరిత్ర క్రమాన్ని వెనక్కి త్రిప్పాలన్న ఉద్దేశ్యమేనని మహాసభ భావించింది." పెట్టుబడిదారీ వ్యవస్థను కుదిపివేస్తున్న తీవ్ర ఆర్థిక సంక్షోభం యిందులో పాత్రవహిస్తున్నది. అదే సమయంలో సామ్రాజ్యవాదం దుందుడుకు ధోరణి పెరగటం పెట్టుబడిదారీ వ్యవస్థ బలానికి చిహ్నంకాదు; భూగోళ స్థాయిలో అది బలహీనపడుతున్న, స్థానాలను కోల్పోవడం కొనసాగుతున్నస్థితికి సంకేతం; సోషలిజంతో పోల్చితే దాని వ్యవస్థను సమర్థించుకోలేకపోవటానికి, స్థూలంగా దాని తీవ్రతరమైన, బహుముఖ సంక్షోభానికి సూచిక.

ప్రపంచ పరిణామక్రమాన్ని నేడు నాలుగు గొప్ప శక్తులు నిర్ణయిస్తున్నాయని, కార్మికులు, ప్రజల విముక్తి, సామాజిక పురోగతి, శాంతి వాటిపై ఆధారపడి వుందని మహాసభ పేర్కొన్నది. అవి : సోషలిస్టు దేశాలు, పెట్టుబడిదారీ

ప్రపంచంలోని కార్మికోద్యమం, జాతీయ విముక్తి ఉద్యమం, ప్రగతిశీల దృక్ప థానికి కట్టుబడిన దేశాలు.

సోషలిస్టు రాజ్యాలు అంతర్జాతీయ కార్మిక వర్గ, కమ్యూనిస్టు ఉద్యమ, విప్లవ శక్తులన్నింటి ప్రధాన విజయం. వాటి అత్యంత శక్తివంతమైన అండ. నూతన సమాజాన్ని నిర్మించటంలో ఎదురయ్యే సమస్యలు, ఇబ్బందులు, ఎంతో అనుభవాన్ని, పాఠాలను ఇస్తున్నాయి. సోషలిస్టులు వాస్తవిక మూలంలోనే వెళ్ళ వలసిన పనిలేదు. పోలెండ్‌లోని ఘటనలు సైతం, అక్కడ వచ్చిన సంక్షోభం సోషలిజం స్వభావంలో పాదుకోలేదని, దాన్ని నిర్మించడంలో చేసిన తీవ్రమైన తప్పులు, మార్క్సిజం - లెనినిజం ప్రాథమిక సూత్రాలు కొన్నింటిని విడనాడటం వల్ల ఆ పరిస్థితి ఏర్పడిందని నిరూపిస్తున్నాయి.

ప్రజా జీవనంలో నిర్ణాయక శక్తిగా, సామాజిక మార్పుకు అనివార్యమైన చోదకశక్తిగా పెట్టుబడిదారీ ప్రపంచంలో కార్మికవర్గ పాత్ర పెరుగుతున్నది. అయితే సోషల్ డెమోక్రటిక్లు సంక్షోభానికి ఏటి ప్రత్యామ్నాయం చూపలేకపోతు న్నారు. కార్మికవర్గంలోని అసంతృప్తి, సమశీలతపై నీళ్ళు చల్లడానికి, సంస్క రణవాద ప్రయోజనాలకు వారి నుపయోగించుకోవటానికి వీరు ప్రయత్నించినప్పుడు ఎక్కువ ఇబ్బందులను ఎదుర్కొంటున్నారు.

స్వయం నిర్ణయాధికార హక్కు, స్వాతంత్ర్యం కొరకు, వలసవాదానికి, నయావలస వాదానికి, జాత్యహంకారానికి, యూదు దురహంకారానికి, వర్ణ వివక్ష తకు, సామ్రాజ్యవాదుల ఆర్థిక, రాజకీయ పెత్తనానికి వ్యతిరేకంగా కార్మికులు, ప్రజలూ పోరాడుతుండగా జాతీయ విముక్తి ఉద్యమం రూపు అందుకుంటున్నది.

"ప్రపంచ వ్యవహారాలలో ప్రగతిశీల దృక్పథంగల దేశాల పలుకుబడి పెరుగుతున్నది."..... "సహజంగానే విభిన్నమైన, జటిలమైన అభివృద్ధిక్రమంలో పయనిస్తూ, అవి తమ సార్వభౌమత్వాన్ని, స్వాతంత్ర్యాన్ని దీక్షతో పరిరక్షించు కుంటున్నాయి; ప్రజల సమస్యలు పరిష్కరించటానికి పాటుపడుతున్న వలస వాదుల దోపిడీ నుండి తమ ఆర్థిక వ్యవస్థలకు, జాతీయ మార్పులను కాపాడు కుంటూ, ప్రపంచ పెట్టుబడిదారీ వ్యవస్థ పలుకుబడి రంగంనుండి ఉపసంహరించు కుంటూ, లేక ఉపసంహరించుకోవటానికి ప్రయత్నిస్తూ, అంతర్జాతీయ రంగంలో శాంతి, సామాజిక పురోగతి ఆదర్శాలతో ఉత్తేజితమైన వైఖరులను అనుసరిస్తు న్నాయి."

సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటంలోని ఉమ్మడి కర్తవ్యాలు జాతీయ విముక్తి ఉద్యమాన్ని ప్రగతిశీల దృక్పథంగల దేశాలనూ సోషలిస్టు దేశాలతో సన్నిహిత సంబంధాలు, సహకారానికి వస్తుగతంగా నడుపుతున్నాయి. సామ్రాజ్య వాదం వారిని అనైక్యపరచటానికి తీవ్రప్రయత్నాలు చేస్తూ, ఆర్థిక ఒత్తిడికి, సాయుధ బెదిరింపులకు, సైద్ధాంతిక విద్రోహం, కుట్రలు సాగించడంలో అత్యంత

సోగిషీ పద్ధతులను ఒడిగడుతూ, అసాధారణమైన దుందుడుకుతనం, పట్టుదలతో కమ్యూనిజం వ్యతిరేకతను, సోవియట్‌లో వ్యతిరేకతను వాడుకుంటున్నది. ఈ ప్రయత్నాలను తక్కువచేసి చూడటం ఎంత చెడ్డ తప్పో, వాటిని అధికంగా అంచనా వేయడం కూడా అంతే ప్రమాదం. "నేటి ప్రపంచంలోని ప్రధాన విప్లవ శక్తులతో ఐక్యత, సమిష్టి లేక కలిసివచ్చేటట్లుగా నిర్వహించే కార్యాచరణలు, మైత్రి, పరస్పర సంఘీభావం అందరి, అందులోని ప్రతి ఒక్క విజయానికి ప్రథమ ప్రాముఖ్యతగల అంశాలు"గా పోర్చుగల్ కమ్యూనిస్టులు భావిస్తున్నారు

ఈ పోర్చుగల్ అంతర్జాతీయ పాత్రను పరిశీలిస్తూ, ఏప్రిల్ విప్లవం విజయంతో మా దేశం తన జాతీయ గౌరవాన్ని తిరిగి పొందిందని, అంతర్జాతీయ రంగంపై మర్యాదను, ప్రతిష్టను సంపాదించుకున్నదని మహాసభ తెలిపింది. అయితే పెట్టుబడిదారీ వ్యవస్థ పునరుద్ధరణకు సమాయత్తం చేయబడుతున్న దాని విదేశాంగ విధానం 1976 నాటినుండే తన జాతీయ స్వభావాన్ని కోల్పోతూ వుంది. సామ్రాజ్యవాదం యొక్క, ప్రధానంగా అమెరికన్ సామ్రాజ్యవాదుల ఆదేశాలకు అధికాధికంగా తలొగ్గుతున్నది. అటువంటి విధానం పోర్చుగల్‌కు ప్రయోజనకారి కాదు. రాజీకి తావులేకుండా జాతీయ స్వాతంత్ర్యాన్ని, సార్వభౌమత్వాన్ని, శాంతిని పరిరక్షించగల దేశభక్తియుత విధానం మా దేశానికి అవసరం. సార్వభౌమత్వం, పరస్పర లాభం, సమానత, ఆంతరంగిక వ్యవహారాలలో చేజోక్యం ప్రాతిపదికగా, వివక్షత లేకుండా అన్ని దేశాలతోనూ సంబంధాలను అభివృద్ధి చేసుకోవలసిన కీలకావసరాన్ని మహాసభ వక్కాణించింది.

ఈ రంగంలో పోర్చుగీసు కమ్యూనిస్టుల ప్రధాన కర్తవ్యాలను వివరిస్తూ 10వ మహాసభ, సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా ప్రజలు జరిపే పోరాటంలో ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమ ఐక్యతను నిర్ణయాత్మక అంశంగా పి. సి. పి. చూస్తున్నదని పేర్కొన్నది. అందువల్లనే కమ్యూనిస్టు, కార్మికవర్గ పార్టీలతో సంబంధాలు పెంపొందించుకోవటానికి మేము ప్రత్యేక ప్రాధాన్యతనిస్తున్నాం. సమిష్టి శ్రామికవర్గ పునాదివేళ్ళతో, సమిష్టి మార్క్సిస్టు లెనినిస్టు సిద్ధాంతంతో, సోషలిజం, కమ్యూనిజం ఉమ్మడి ఆదర్శాలతో ఆ పార్టీలతో మేము సంఘీభావమై వున్నాం.

దేశభక్తియుత, సామ్రాజ్యవాద వ్యతిరేక, ప్రజాతంత్ర, శాంతి కాముక శక్తుల సమిష్టి లేక సమానాంతర కార్యాచరణకు మహాసభ ప్రబోధిస్తూ, సుస్పష్టమైన వర్గ హద్దులులేని "ఒక నూతన అంతర్జాతీయత"లో కమ్యూనిస్టు ఉద్యమాన్ని రద్దు చేయాలన్న భావనను తిరస్కరించింది. భిన్నాభిప్రాయాలు లేక భేదాభిప్రాయాలు సంబంధాల ఏర్పాటుకు అవరోధం కారాదని, పరస్పరం సమాధానపడని వైఖరులను తొలగించుకోవటానికి అట్టి సంబంధాలు సహాయపడతాయని పి.సి.పి. భావిస్తోంది. కమ్యూనిస్టు పార్టీల సంయుక్త చొరవలను, సమావేశాలను, సభలకు

అలాగే యితర అంతర్జాతీయ కార్యాచరణలకు ఎల్లప్పుడూ చురుకుగా తోహదం చేయటానికి సంసిద్ధతను వ్యక్తం చేసింది........"అభివృద్ధి నిరోధక, సోషల్ డెమొక్రాటిక్ శక్తులు తమ అంతర్జాతీయ సహకార నిర్మాణ వ్యవస్థలను పెంచుకుంటున్న తరుణంలో, కమ్యూనిస్టు పార్టీల మధ్య చిరస్థాయిగా వుండే సహకార రూపాలు అవి నిర్దిష్ట రంగాలు, సమస్యలకు పరిమితమైనప్పటికీ సానుకూల పాత్ర వహించగలవు."

మహాసభ రాజకీయ తీర్మానం చివరి భాగం అంతర్జాతీయ పరిస్థితిని విశ్లేషించింది; దాని ప్రాముఖ్యత దృష్ట్యా దానిని పూర్తిగా ఉటంకిస్తున్నాము: "శీఘ్రంగా అభివృద్ధి చెందుతున్న, వ్యాప్తి చెందటం, విస్తరించటం పెరుగుతున్న విప్లవ క్రమం కమ్యూనిస్టులను ఈ విధంగా డిమాండ్ చేస్తున్నది: (1) సామాజిక పరిణామ సార్వత్రిక ధర్మాలను ఆపాదనపటడం, ప్రపంచ కార్మికవర్గం, విప్లవోద్యమం సముపార్జించిన చారిత్రక అనుభవాన్ని ఆకళింపు చేసుకోవడం; 2) తమ స్వంత దేశంలోని, ప్రపంచంలోని సామాజిక పరిణామం నుండి, కార్మికుల, ప్రజల విముక్తి పోరాటం నుండి ఉద్భవించే నూతన లక్షణాన్ని, క్రమాలను విశ్లేషించటానికి, సర్వాగ్రహణకు, అవగాహన చేసుకోవటానికి నిరంతరం కృషి చేయటం.

"జీవితంపట్ల ఈ దృక్పథాన్ని మార్క్సిజం-లెనినిజం, కార్మికవర్గ అంతర్జాతీయత కలుగజేస్తున్నది. మార్క్సిజం-లెనినిజం గూర్చిన పుస్తకపు పురుగు, శిలాసదృశ భావనలు, 'నమూనాలను' యాంత్రికంగా కాపీ చేయడం, లేక 'నమూనాలను', 'అసలు సిసలైన మార్గాలను' ఊహాజనితంగా విశదీకరించటం సామాజిక వాస్తవికతను అవగాహన చేసుకోవటానికీ, వర్గ శక్తుల మైత్రికీ తీవ్రమైన ప్రతిబంధకాలు; అవి సూత్రరహిత ఆచరణాత్మకతను ప్రోత్సహిస్తాయి. కమ్యూనిస్టు పార్టీలు, కార్మికవర్గ ఉద్యమం బలహీనపడటానికి దారితీస్తాయి. పి.సి.పి. అంతర్జాతీయ కార్యకలాపం తన ప్రజల, తన దేశ ప్రయోజనాలకు, శ్రమజీవుల, ప్రగతిశీల శక్తుల సమష్టి సార్వజనీన ప్రయోజనాలకు ఏకకాలంలో సేవ చేస్తుంది. జాతీయ కర్తవ్యాలు అంతర్జాతీయ విధులనుండి విడదీయరానివి. దేశభక్తి, అంతర్జాతీయత వేరుచేయబడజాలవు."

పోర్చుగీసు కమ్యూనిస్టు పార్టీ తన 10 వ మహాసభను జరుపుకోవడం ద్వారా తన కార్యకలాపాలను, పలుకుబడినీ, విప్లవ క్రమంలో నిర్మాణాత్మకంగా పాల్గొనటాన్ని మెరుగుపరుచుకునే, విస్తరించుకునే, ముమ్మరం చేసే దిశగా నూతన చర్యలు తీసుకున్నది.

# తరిగిపోని విముక్తి పోరాట శక్తి

— ఖలేదే హమ్మామి

*పొలిట్ బ్యూరో సభ్యులు, కేంద్ర కమిటీ, సిరియా కమ్యూనిస్టుపార్టీ*

పశ్చిమాసియాలో పరిస్థితి అధికాధికంగా సంక్లిష్ట మవుతున్నది. మరింత ప్రచండంగా యుద్ధ జ్వాలలు అలముకొనే ప్రమాదకర పరిస్థితి ఏర్పడింది. అమెరికా యొక్క "శాంతి సాధన ప్రయత్నా"ల తీవ్ర పర్యవసానాలు ఏమిటో యిప్పటికే సుస్పష్టమైనాయి. ఈ ప్రాంతంలో శాంతి స్థాపన అవకాశాలను మెరుగు పరచడం అటుంచి అమెరికా యత్నాలు వాటిని మరింత దూరం చేశాయి. మధ్య ఆసియా సంఘర్షణ అన్నది ప్రధానంగా యిటీవల వరకు అరబ్ దేశాలపై ఇజ్రాయిల్ దురాక్రమణకే పరిమితి అయ్యిందని జ్ఞాపకం చేయవలసి ఉంది. అమెరికా ఇజ్రాయిల్‌కు సైనిక, ఆర్థిక, రాజకీయ ప్రచార సంబంధమైన మద్దతును యిస్తూ వచ్చింది. మరిన్ని దురాక్రమణ చర్యలకు పాటుపడేటట్టు దానిని రెచ్చగొట్టింది. అయితే శత్రుత్వ చర్యల్లో ప్రత్యక్షంగా లేదా బహిరంగంగా జోక్యం చేసుకోలేదు. నిష్పాక్షిక మధ్యవర్తిగా శాంతి సాధన ప్రయత్నాలను ప్రేమించేదిగా, రక్త పాతాన్ని ఆపేదిగా అమెరికా పోజు పెట్టింది.

అయితే యిదంతా కపటనాటకమని లెబనాన్‌లోని పరిణామాలు రుజువు చేశాయి. అమెరికా మెరైన్లు, విమానాలు నౌకా శతఘ్ని దళాలు, లెబనాన్ పట్టణాల మీద, గ్రామాలమీద లెబనాన్ జాతీయ దేశభక్త శక్తుల స్థావరాలమీద, లెబనాన్ చట్టబద్ధ ప్రభుత్వ విజ్ఞప్తి మేరకు అరబ్‌లీగ్ నిర్ణయానుసారం, లెబనాన్‌లో స్థావరాలు ఏర్పాటు చేసుకొనియున్న సిరియా దళాలమీద బాంబులు, శతఘ్నులు ప్రయోగించడం ప్రారంభించాయి. యుద్ధ రంగంలో అమెరికా—అరబ్ సంఘర్షణ అనునది వాస్తవమై కూర్చున్నది. అమెరికా దళాలు అరబ్ ప్రజల రక్తంలో తమ చేతులను ముంచెత్తాయి.

లెబనాన్‌లో అమెరికా సాయుధ జోక్యం బెదిరింపు దౌత్యానికి తిరిగి వెళ్ళటం అన్న విధానంతప్ప వేరుకాదు. అంతర్జాతీయ సమస్యలను పరిష్కరించటానికి, పాశవికమైన బలప్రయోగానికి పూనుకోవడమన్న ప్రధాన సాధనాన్ని ఉపయోగించటమే అమెరికా యొక్క బెదిరింపు దౌత్యం లక్ష్యం. అమెరికా మెరుపుదాడి వీరుల పోరాట శక్తిని చూసి లెబనాన్ ఇజ్రాయిల్‌తో నిర్బంధ ఒప్పందానికి తప్పనిసరిగా అంగీకరిస్తుందని, క్యాంప్ డేవిడ్ ఒప్పందాన్ని ఆమోదిస్తుందని విదేశాల్లో చాలామంది భావించారు.

అయితే యీ దురాక్రమణ ఏ విధంగాను లెబనాన్‌కు మాత్రమే పరిమితమై లేదు. సిరియాను దెబ్బతీయాలన్న లక్ష్యం కూడా వీరికున్నది. క్యాంప్‌డేవిడ్ ఒప్పందం తర్వాత సిరియా వాస్తవంగా ఇజ్రాయిల్ దురాక్రమణదారుల్ని ప్రత్యక్షంగా ప్రతిఘటిస్తున్న ఏకైక అరబ్ దేశం. సిరియా దృఢవైఖరి పశ్చిమాసియాలోని పోరాట రంగంలో ప్రధానాంశంగా గుర్తింపబడుతున్నది. సామ్రాజ్యవాదుల — యూదుల కూటమిచేసే కుట్రలు ఫలించకుండ సిరియా గొప్ప అవరోధంగా ఉంది. దురాక్రమణదారులు సిరియాపై ప్రత్యక్ష సైనిక ఒత్తిళ్ళకు పాల్పడ్డారు. బెదిరింపులకు పూనుకున్నారు. ఆ దేశంపై ఆ అభిప్రాయాన్ని రుద్దేందుకు ప్రయత్నించారు. అది వెనకడుగును వేసేటట్లు ప్రయత్నించారు.

అనేక వాగ్దానాలద్వారా సిరియాని ప్రలోభపెట్టాలన్న ప్రయత్నాలు కూడా జరిగాయి. సిరియాలోను, ఆ ప్రాంతంలోను, సిరియా ప్రయోజనాలపట్ల తగు శ్రద్ధగలిగించడంలో వైఫల్యం చెందడంద్వారా రీగన్ పాలనాయంత్రాంగం ఒక పొరపాటు చేసిందని, లేకపోతే పరిస్థితి సక్రమంగా ఉండేదని చెప్పబడింది. 1983 మే 17 న ఇజ్రాయిల్‌తో చేసుకొన్నటువంటి ఒప్పందంలాంటిదాన్నే లెబనాన్‌తో చేసుకొని సంతకాలు పెట్టేందుకు సిరియాని ఒప్పించాలని వారు ప్రయత్నించారు. సిరియా గనుక లెబనాన్‌పట్ల పాలస్తీనా ప్రజల సమస్యపట్ల, తమ విధానాన్ని మార్చుకొని సోవియట్ యూనియన్‌తో తనకున్న సహకారాన్ని విసర్జించినట్లయితే, ఇజ్రాయిల్ తాను ఆక్రమించుకున్న గోలన్‌పర్వత శ్రేణులను తిరిగి సిరియాకు యిచ్చే అవకాశమున్నదని పదే పదే సూచనలు కూడా చేయబడినాయి.

అయితే సిరియా వెనుకడుగు వేయటం అటుంచి చలించలేదు కూడా. మా ప్రజలు, మా ప్రగతిశీల దేశభక్తియుత శక్తులు, రాజ్యవ్యవస్థ, నాయకత్వం, సాయుధబలగాలు ఏకత్రాటిపై ఉండి, సామ్రాజ్యవాదుల యూదు జాత్యహంకారుల, పథకాలను ప్రతిఘటించాలని కృతనిశ్చయంతో ఉన్నాయి. క్యాంప్‌డేవిడ్ ఒప్పంద రూపంలోగాని లేదా "రీగన్ పథకం లేదా లెబనాన్, ఇజ్రాయిల్ మధ్య కుదిరిన

యే ఒప్పంద రూపంలోకాని అమెరికా, ఇజ్రాయిల్ చేసే "పరిష్కార" ప్రయత్నాలను వమ్ముచేయాలని కృతనిశ్చయంతో ఉన్నారు. సైనిక సాయంతోసహా, సర్వతోముఖమైన సోవియట్ సహాయం అన్నది కొనసాగుతున్న బెదిరింపులు దురాక్రమణ చర్యలను ఎదిరించి సిరియా దృఢంగా నిలబడేందుకు అమూల్యమైన అంశంగా ఉన్నది.

సోవియట్ మిత్రులు అందచేసే సహాయం సిరియా రక్షణను పటుతరం చేయడానికి దాని సాయుధబలగాల పోరాట సర్వసన్నద్ధతను పెంచడానికి ఉపయోగపడుతున్నది. దీని ఫలితంగా సిరియన్లు యితర అరబ్ ప్రపంచ జాతీయ విముక్తి శక్తుల నైతికబలం మరింతగా పెంపొందుతున్నది. శత్రువును త్రిప్పికొట్టి ఓడించగలమన్న తమ శక్తితో మరింత విశ్వాసాన్ని కల్గిస్తున్నది.

సిరియా వైఖరి మరింత బలమైనదిగా ఉన్నది. ఎందుచేతనంటే అది కాపాడుతున్న ప్రయోజనం యొక్క న్యాయంపట్ల సిరియా ఎంతో విశ్వాసం ఉంచుకొన్నది. లెబనాన్‌కు వేల కిలోమీటర్ల దూరంలోనున్న ఒక శక్తి తన కీలక ప్రయోజనాల రక్షణకు అనువైనదంటూ ఒక ప్రాంతాన్ని ప్రకటించుకోవడం అన్నది సామ్రాజ్యవాదుల అహంకారానికి నిదర్శనము. సిరియా, లెబనాన్ ప్రజల భవితవ్యాలు విడదీయరానంతగా సన్నిహితంగా ముడివడి ఉన్నాయన్న విషయం గమనించడానికి పశ్చిమాసియా చిత్రపటాన్ని ఒకసారిచూస్తే లేదా దాని చరిత్రను అధ్యయనంచేస్తే అర్థమవుతుంది. బెదిరింపుతో, అమెరికా చెప్పిన తీరులో ఇజ్రాయిల్, లెబనాన్ ప్రజలపై రుద్దిన వొప్పందాన్ని రద్దుచేయాలని ప్రయత్నించడంద్వారా, సిరియా ఒక సోదర దేశంయొక్క స్వాతంత్ర్యం, సార్వభౌమాధికారాలను రక్షించడానికి సహాయం చేయడమే గాకుండా తన స్వంత భద్రతను కూడా కాపాడుకొంటున్నది. ఎందుకంటే మే శాంతి ఒప్పందంలోని షరతుల ప్రకారము, అంతకుముందు గోలన్ పర్వతశ్రేణులను స్వాయత్తం చేసుకొన్న దురాక్రమణదారు సైన్యాలు సిరియా రాజధాని డమాస్కస్‌కు దగ్గరగాఉన్న లెబనాన్ భూభాగంలోని విస్తృత ప్రాంతాలపై అధికారం కల్గిఉన్నాయి. మా దేశంపై దురాక్రమణ చర్యలను కొనసాగించేందుకు లెబనాన్‌ను ఒక వారధిగా మార్చేందుకు ఆ దేశ గగనతలాన్ని, ప్రాంతీయ జలాలను యధేచ్ఛగా ఉపయోగించే స్థితిలో ఇజ్రాయిల్ ఉన్నది.

లెబనాన్ భూభాగాన్ని తాను ఏమాత్రం కోరడంలేదనీ, 1983 మే 17 ఒప్పందం రద్దయిన తర్వాత లెబనాన్ నుండి ఆఖరి ఇజ్రాయిల్ సైనికుడు నిష్క్రమించి వివిధ లెబనాన్ శక్తులమధ్య ఒప్పందంద్వారా జాతీయ మిశ్రమ ప్రభుత్వం ఏర్పడిన తర్వాత ఆ దేశంనుండి తన దళాలను ఉపసంహరించుకోవడానికి సిద్ధంగా ఉన్నదని సిరియా పదే పదే ప్రకటించింది. అయితే ఒక సారి

భౌమాధికార అరబ్ దేశ భూభాగాన్ని ఇజ్రాయిల్ సైన్యం ఆక్రమించడంలో లెబనాన్ భూభాగంపై సిరియా దళాలు ఉండడాన్ని సమానంచేసే అన్ని ప్రయత్నాలను సిరియా తిరస్కరించింది. దురాక్రమణదారు బేషరతుగా ఉపసంహరించుకోవాలి. ఇదే లెబనాన్ ప్రజల కోర్కె. దీనిని అంతర్జాతీయంగా ప్రజలు బలపరుస్తున్నారు. ఐక్యరాజ్యసమితి భద్రతా సంఘంలో చేసిన యీ తీర్మానాలు కూడా దీనినే బలపరుస్తున్నాయి. ఈ తీర్మానాలకు యింకా చెల్లుబడి ఉంది. వీటి కనుగుణంగానే సిరియా వైఖరి ఉన్నది.

సామ్రాజ్యవాదం పశ్చిమాసియానుండి చాలాకోరుకున్నది. అది ఎక్కడా సేట్లులేదు. తన మార్గాన్ని సుగమం చేసేందుకు ఎలాంటి నీతినియమాలు లేకుండా అత్యంత పాశవికమైన నేరపూరిత పద్ధతులను అది ఎప్పుడూ ఉపయోగిస్తుంది. ఈ కారణంగానే మన మొత్తం ప్రాంతంలో అత్యంత తీవ్రమైన ప్రమాద పరిస్థితులు ఏర్పడుతున్నాయి. మా దేశంపట్ల ప్రదర్శించిన లాలింపు, బెదిరింపు వైఖరి, వాగ్దానాలు హెచ్చరికల విధానం అమెరికా సామ్రాజ్యవాదులు ఆశించిన ఫలితాలను యిప్పటి వైఫల్యం చెందించని మేము చెప్పాము. వారికి యింకా మిగిలిన ఏకైక మార్గం వాస్తవంగా పెద్ద ఎత్తు సాయుధ దురాక్రమణ ఒక్కటే. నిజంచెప్పాలంటే యిలాంటి దురాక్రమణపూరిత పథకాలు ఎప్పుడో రూపొందించబడ్డాయి. వాటిని అమలుపరచడం ఒక్కటే మిగిలివుంది. అయితే ఎలాంటి పరిస్థితులలో సైనికమైన దెబ్బ యింతవరకు ఎందుకు కొట్టలేదు? దుస్సాహసిక స్వభావం గల అమెరికా సామ్రాజ్యవాదులు, సైనిక కండూతిలో యమయాతనను పడుతున్న ఇజ్రాయిల్ పాలకులు ఎన్నడూ యిలాంటి వైఖరిని ప్రదర్శించరుగదా! మరి ఎందుకు యీ జాప్యంచేస్తున్నట్లు.

ఇందుకు కారణమేమంటే దురాక్రమణను ప్రతిఘటిస్తున్న అరబ్ శక్తులను విభజించాలన్న ఆశతో యింకా సామ్రాజ్యవాదులున్నారు. సాదత్ కింద ఈజిప్టులో చేసినట్లుగా వేరు వేరు ఒప్పందాల బురదలోనికి అరబ్ శక్తులు లాగాలని ప్రయత్నిస్తున్నారు. లెబనాన్‌లో యిదే చేశారు. యిదే జరిగితే సిరియా ఒంటరిగానే శత్రువుని ఎదిరించవలసి వస్తుంది. ఇంకో కారణమేమంటే కొత్త సైనిక దుస్సాహసాలకు పాల్పడితే వారు ఆశించిన వాటికి ప్రతికూలమైన ఫలితాలు కలుగుతాయేమో అని అమెరికా సామ్రాజ్యవాదులు భయపడుతున్నారు. లెబనాన్ గుణపాఠాలను వారింకా మరచిపోలేదు. అంతర్జాతీయ విషయాలను నిర్వహించడంలో ఏకైకమార్గంగా బలప్రయోగానికి పాల్పడడం యితర దేశాల ప్రయోజనాలకు నష్టంకల్గించడం, ఈ ప్రయోజనాలను రక్షించుకునే శక్తి, ధైర్యం వాటికి లేదని తక్కువ అంచనా వేయడం అన్న విశ్వాసం ప్రాతిపదికగా రూపొందించబడిన అమెరికా వ్యూహం బండారం బయటపడింది. న్యూజెర్సీ యుద్ధనౌకయొక్క 16 అంగుళాల శతఘ్నులు

గాలివిమానాలనుంచి ప్రయోగించబడిన మిసిలీలుగాని, మెరైన్ సైనికుల టాంకులు గాని లెబనాన్ విజయం సాధించలేకపోయినాయి.

దీనికి ఉదాహరణ కూడా ఉంది. లెబనాన్‌లో ఓటమి అనంతరము "రీగన్ పథకాన్ని" ముందుకు నెటాయి కాని ప్రయత్నించిన అమెరికను తమ దృష్టిని జోర్డాన్‌పై నిలిపారు. జోర్డాన్ శాంతి సాధనాక్రమానికి కీలకమైనదని అమెరికా ఆయుధాలు అధికంగా దానికి యివ్వవచ్చునని అధ్యక్షుడు రీగన్ ప్రకటించాడు. అయితే ఆ మరుసటిరోజే రాజు హుస్సేన్ అమెరికాయొక్క పశ్చిమాసియా విధానాన్ని తీవ్రంగా విమర్శించాడు. (ఆయన ఉద్దేశ్యము ఏమైనప్పటికీ) అమెరికా వైఖరి నీతినియమాలు లేనిదని రెండు నాల్కల ధోరణితో కూడినదని విమర్శించాడు. ఇజ్రాయిల్‌కు అమెరికా షరతులులేని తోడ్పాటును ఇస్తున్నదృష్ట్యా పశ్చిమాసియాలో మధ్యవర్తిగా ఉంటుందన్న విశ్వాసాన్ని అమెరికా పోగొట్టుకుందని ఆయన ప్రకటించాడు.

అయితే సామ్రాజ్యవాద దురాక్రమణదారులు జీవితానుభవంనుంచి గుణపాఠాలు నేర్చుకోలేని చరిత్రద్వారా మనకు తెలుసు చితుగా దెబ్బలుతిన్న తర్వాత గూడా వారు మళ్ళీ మళ్ళీ పెద్ద కష్టపడుకొనే పెకివస్తారు. లెబనాన్‌లో అమెరికా విదేశాంగ విధాన లక్ష్యాలు మార్పులేనివని ఒకప్రక్క చెపూనే ఏ క్షణంలోనైనా మెరైన్ సైనికులు తిరిగి లెబనాన్‌కు వెళ్ళవలసిందిగా ఆదేశాలు యివ్వగలనని అధ్యక్షుడు రీగన్ బెదిరించాడు. విదేశాంగమంత్రి మర్జ్ మరికొంచెం ముందుకు వెళ్ళాడు. పశ్చిమాసియాలో తన లక్ష్యాలు సాధించుకోవటానికి అమెరికా ఇంతకు పూర్వము ఉపయోగించనటువంటి యితర పద్ధతులను ఉపయోగిస్తామని ప్రకటించారు.

"వ్యూహాత్మక సహకారం" చట్రంలో భాగంగా అమెరికా మళ్ళీ ఇజ్రాయిల్ సైనిక ముఠామీదనే తన సైనిక బాధ్యతలను నిలిపిఉంచుతున్నది. ఈ సైనిక ముఠా లెబనాన్ ప్రజలను దీర్ఘకాల యిబ్బందులకు గురిచేయడానికి ప్రయత్నిస్తున్నది. దురాక్రమణదారులు లెబనాన్ దక్షిణ భాగంలో పాతుకుపోతున్నారు. అక్కడ నుంచి సాయుధ దాడులకు పాల్పడుతున్నారు. పైగా లెబనాన్‌లోని సిరియా బలగాలపై కవ్వింపు చర్యలకు స్వస్తిచెప్పబడలేదు. సిరియామీద యుద్ధానికి తలపడుతామంటూ పదే పదే బెదిరింపులు చేస్తున్నారు.

సిరియాపై దురాక్రమణ చేస్తే ఎంతో ఎక్కువ మూల్యం చెల్లించవలసి వస్తుందని ఇజ్రాయిల్ గమనించాలి. "గెలిలీ కోసం శాంతి" అన్న పథకం కూడా ఫలించలేదు. లెబనాన్‌పై దాడికి యీ పేరు పెట్టారు. యీ దాడిలో గెలువగలమని యూత్ నాయకత్వం ఆశించింది. లెబనాన్ జాతీయ ప్రతిఘటన సంఘటన

వీరోచిత కార్యకలాపాల ఫలితంగా దురాక్రమణదారులు పెద్ద నష్టాలను పొంద వలసివచ్చింది. సైనిక వ్యయ భారం ఇజ్రాయిల్‌ను ఆర్థిక సంక్షోభటంచులకు నెట్టింది. అమెరికా సాయం కూడా ఉపయోగపడలేదు. చివరికి మిగిలిన ఫలితమేమి టంటే పెరుగుతున్న యుద్ధ వ్యతిరేక ఉద్యమం అత్యంత శక్తివంతమైన ఆయుధా లున్న సిరియా తన స్వేచ్ఛా స్వాతంత్ర్యాలను కాపాడుకొనడంలో కృతనిశ్చ యమై ఉన్నది. తమపైకి చొచ్చుకు వస్తున్న వారిని సమర్థవంతంగా ప్రతిఘ టిస్తుంది. తక్షణ విజయం లేదా సులభంగా విజయం సాధించడం లేదా అసలు విజయమంతా సాధించడం సాధ్యమని ఇజ్రాయిల్ అంచనావేయడానికి కారణ మేమీ కనబడటం లేదు.

ఈ పరిస్థితుల దృష్ట్యా సైనిక దుస్సాహసానికి పెట్టింది పేరైన వీరి తల దిమ్మ దిగక మానదు. అయితే సామ్రాజ్యవాదులు వారి తొత్తులు సహేతుకమైన విధంగా ఆలోచిస్తారని అనుకోవడం పొరపాటు.

పశ్చిమాసియాలో ఇజ్రాయిల్ కూటమి వేస్తున్న దుస్సాహసిక పథకాలకు ఎదురవుతున్న గట్టి ప్రతిఘటన దేశ శాంతి విధానానికి తిరుగులేని ఉదాహరణ. సోషలిస్టు సమాజ దేశాల అలీన ఉద్యమ యుద్ధ వ్యతిరేక చొరవలను సిరియా బల పరుస్తున్నది. అలాగే సామ్రాజ్యవాద సైనిక సన్నాహాలకు వ్యతిరేకంగా ముఖ్యంగా పశ్చిమ యూరప్‌లో మొదట పెట్టబోతీసే అమెరికా అణు మిసైల్ల మోహరింపునకు వ్యతిరేకంగా జరిగే కార్యకలాపాలను బలపరుస్తున్నది. ఉన్మత్త ఆయుధపోటీకి స్వస్తి చెప్పవలసిందిగా సిరియా కోరుతున్నది. సిరియా ప్రజలు దీనిని తమ దేశభక్తియుత అరబ్, అంతర్జాతీయ కర్తవ్యంగా చూస్తున్నారు.

అణుమారణహోమంలో మొత్తం మానవ నాగరికతను విధ్వంసం చేసేందుకు ముందుకు తోసుకువస్తున్న అత్యంత తక్షణ ప్రమాదాన్ని పరిష్కరించడంలో ఉమ్మడి ప్రయత్నాలు విజయవంతమయ్యేందుకు. యీ భూ ఖండంలోని శాంతి శక్తులు తమ వంతుగా సిరియాపట్ల శక్తివంతమైన సంఘీభావాన్ని ప్రదర్శించడం అత్యంత ముఖ్యమైన విషయం. పశ్చిమాసియాలో కొత్తగా పెద్ద స్థాయిలో సాయుధ సంఘ ర్షణ జరిగితే అది యీ ప్రాంతంలోని దేశాలకే గాక మొత్తం ప్రపంచానికే అనూహ్యమైన విధ్వంసకరమైన పర్యవసానాలను తెచ్చిపెడుతుంది.

లెబనాన్ భూభాగంపై సాధించబడిన ప్రధాన విజయం అరబ్ జాతీయ విముక్తి ఉద్యమంలోని సామ్రాజ్యవాద వ్యతిరేక శక్తుల చేవను శత్రువుల వత్తి డులను ప్రతిఘటించడంలోనే గాక శత్రువులపై తీవ్రమైన దెబ్బతీయడానికి గల దానియొక్క శక్తిని మరోసారి రుజువు చేసింది. అయితే ఉన్నటువంటి యీ శక్తి పెరుగుతున్న విముక్తి ఉద్యమం యొక్క ప్రభావం వల్లనే విప్లవ క్రమం తాలూ

తట అదే ముందుకు పోతున్నదన్న గ్యారంటీని యివ్వలేదని గత అనుభవం ముఖ్యంగా డెబ్బై దశకం, ఎనభై దశకంలోని ప్రారంభ సం॥రాల అనుభవం సూచిస్తున్నది. విభిన్న సామాజిక, రాజకీయ శక్తుల మధ్య తీవ్రమైన పోరాటాలతో కూడుకొని వున్న యీ క్రమం ముందు, వెనుకగా సాగిపోతున్నది. యిది ఎగుడు దిగుడులతో కూడుకొని వున్నది.

అరబ్ జాతీయ విముక్తి ఉద్యమం యీ దశలో కొంత సంక్లిష్టంగాను, వైరుధ్యాలలోను కూడుకున్నదిగాను ఉన్నది. అనేక తీవ్రమైన దెబ్బలు తిన్నది, వెనకడుగు వేసింది. వాటిలో 1967 జూన్ యుద్ధం విస్తృతమైన అరబ్ ప్రాంతాలను ఇజ్రాయిల్ స్వాధీనం చేసుకోవడం. ఈజిప్టులో పరాన్నభుక్కులైన బూర్జువాల, అధికార సాధనాలను స్వాధీనం చేసుకోవడం, అనేక ప్రభుత్వాల నిర్లిప్తత, వివిధ రూపాలలో వివిధ స్థాయిలలో ప్రజాతంత్ర స్వేచ్ఛపై విధించబడిన ఆంక్షలు ఉన్నాయి. యీ ఆంక్షలను ఏభై దశకం నుండి దాదాపు అన్ని అరబ్ దేశాలలో అమలుపరుస్తున్నారు. ప్రతికూల పరిణామంలో ఒకటి సౌదీ అరేబియా అభివృద్ధి నిరోధకులు యీ ప్రాంతంలో పెచ్చరిల్లి చేస్తున్న విద్రోహ కార్యకలాపాలు, అలాగే అంతర్జాతీయ అంశాల పెరుగుదల ధోరణి, ముఖ్యంగా పెరుగుతున్న సామ్రాజ్యవాద సైనిక ఒత్తిడి తన పాత్రను అది నిర్వర్తించింది.

అయితే అరబ్ జాతీయ విముక్తి ఉద్యమ ఫలితాలు అపజయాలుగానే భావించడం పొరపాటు. ప్రజాతంత్ర యెమెన్ ప్రగాఢ విశ్వాసంతో సోషలిజం వైపు పయనిస్తున్నది, శాస్త్రీయ సోషలిజం సూత్రాల ఆధారంగా కృషి చేస్తున్న ఎనిమిది సోషలిస్టు పార్టీల నాయకత్వం క్రింద అక్కడ శ్రామిక ప్రజల ప్రయోజనాల కోసం తీవ్రమైన సామాజిక ఆర్థిక మార్పులు తీసుకురాబడుతున్నాయి. అక్కడ పెద్ద ఎత్తున ప్రజా ఉద్యమం కొనసాగుతున్నది. యీ ప్రజా ఉద్యమం ఈజిప్టు, సూడాన్, ట్యునీషియా, మొరాకో, సౌదీ అరేబియా యితర దేశాలను పదే పదే అల్లకల్లోలము చేస్తున్నది. సిరియాలో మాదిరిగానే ఒక ఉమ్మడి సంఘటనలో సమన్వయ కార్యాచరణ, ఐక్యతల రూపంలో అరబ్ దేశాలలోని ప్రగతిశీల దేశభక్తియుతుల మధ్య సహకారం పెరుగుతున్నది.

ఈ శక్తులలో కమ్యూనిస్టులు అగ్రగామి పాత్రను నిర్వర్తిస్తున్నారు. తాము శాంతి, స్వేచ్ఛ నిజమైన ప్రజాస్వామ్యం, సామాజిక ప్రగతి కోసం నిలిచే అత్యంత దృఢమైన, నిలకడ అయిన పోరాట యోధులమని వారు తమ చర్యల ద్వారా రుజువు చేసుకున్నారు.

సం॥రాలుగా జాతీయవాదాన్ని పట్టుకు వ్రేలాడుతున్న పలుకుబడి గల్గిన శక్తులు కమ్యూనిస్టు సైద్ధాంతిక రాజకీయ దృక్పథాలకు సన్నిహితంగా వస్తు

న్నారు లేదా అనుసరిస్తున్నారు అన్న వాస్తవం కమ్యూనిస్టు పార్టీల పాత్రకు తిరుగులేని నిదర్శనం. అరబ్ దేశాలలో కమ్యూనిస్టు ఉద్యమ విజయాలు అపారంగా ప్రస్ఫురించడానికి వీలులేకుండా ఉన్నాయి. ఈజిప్టు కమ్యూనిస్టు పార్టీ తన కార్యకలాపాలను పునరుద్ధరించింది. ట్యునీషియా కమ్యూనిస్టులు అజ్ఞాతం నుంచి బయటికి వచ్చారు. జాతీయ విముక్తి పోరాటాలకు శ్రామికవర్గ పార్టీల చారిత్రక సేవల విలువలు ఏమాత్రం లేవంటూ, చెప్పే ప్రయత్నాలు వమ్ము అయినాయి. అలాగే స్వాతంత్ర్య విజయాలను సంఘటితము చేయడాని నుద్దేశించిన, అలాగే నయా వలసవాద దోపిడీని రద్దుచేసి ప్రజాతంత్ర అభ్యుదయాన్ని కలిగించడానికి ఉద్దేశించిన నాటి పోరాటాలలో యీ శ్రామికవర్గ పార్టీల పాత్ర యొక్క ప్రాముఖ్యాలను తగ్గించి చెప్పి ప్రయత్నించిన ప్రయత్నాలు విఫలమైనాయి.

"కేంప్ డేవిడ్ ఒప్పందం క్రమాన్ని" పూర్తిగా స్తంభింపజేయటంలోను, "రీగన్ పథకం" అమలు జరపకుండా ఉండేటట్లు చూడటంలోను సాహసోపేతమైన ప్రతిఘటనను ప్రదర్శించినవారిలో కమ్యూనిస్టులు ఎల్లప్పుడూ అగ్రభాగాన్నే ఉన్నారు. తాము పైచేయి సాధించిన అనంతరము అరబ్ ప్రజలలో నిరాశాభావాలు కలిగేటట్లు చేయగలమనీ ఆశించాల్సింది ఏమీ కానట్లుగా విశ్వసింపచేయగలమని, అలాగే తమ భవితవ్యాలను విదేశీ పాలకులకు అప్పగించడం మినహా మార్గం లేదన్న ఓటమి తత్వం మినహా తమకు మరొకటి లేదని అరబ్ ప్రజలచేత నమ్మించేందుకు లెబనాన్‌లోని సాయుధ జోక్య నిర్వాహకులు స్పష్టంగా ఆశించారు. మితవాద జాతీయ మహాహంకార సిద్ధాంతాన్ని కల్గి ఉన్న అరబ్ అభివృద్ధి నిరోధకుల లక్ష్యం కూడా యిదే. అయితే పరిస్థితులు ఊహించినదానికంటే తలక్రిందులుగా జరిగినవి. ఎందుచేతనంటే పశ్చిమాసియాలో వాషింగ్టన్‌కు తొంబై తొమ్మిది శాతం అవకాశాలున్నాయంటూ ఢంకా బజాయించి చెప్పిన సాదత్ ప్రకటనలను పునరుద్ఘాటించిన వారి వైఖరులను లెబనాన్ ఘటనలు కుదిపివేశాయి. సోవియట్ యూనియన్ మొత్తంగా సోషలిస్టు సమాజం నాయకత్వాన ప్రపంచంలోని ప్రగతిశీల శక్తుల తోడ్పాటులో తమ న్యాయమైన హక్కుల పరిరక్షణకు పోరాటం చేస్తున్నవారి చేతుల్లోనే తొంబై తొమ్మిది శాతం కాదు నూరు శాతం అవకాశాలున్నాయని స్పష్టమైంది.

అమెరికా ఇజ్రాయిల్ దురాక్రమణ యొక్క ప్రధాన లక్ష్యాలలో ఒకటి అరబ్ దేశాలలో సోవియట్ ప్రతిష్ఠను వమ్ముచేయడం; సోవియట్ సహాయ సామర్థ్యాన్ని సందేహాస్పదమైనదిగా చేయడం సోవియట్ యూనియన్ అరబ్ దేశాల మైత్రి సన్నిహిత సహకార సంబంధాలను విచ్ఛిన్నము చేయడం యీ విషయంలో కూడా పరాజయమే వాటిల్లింది. గతంలో అనేకసార్లు రుజువైనటుగానే సామ్రాజ్యవాదుల బెదిరింపులు దుస్సాహసిక ఆక్రమణ చర్యలకు తలవొంచేం

దుకు నిరాకరించిన వారికి సోవియట్ చేసే సహాయము యొక్క శక్తి సామర్థ్యాలు ఏమిటో అనుభవం మరోసారి రుజువు చేసింది. ఉమ్మడి శత్రువుకు వ్యతిరేకంగా జరిగే పోరాటంలో సోవియట్ యూనియన్ తమ విశ్వసనీయమైన మహత్తర స్నేహ దేశమని సహచర దేశమని అరబ్‌లు గతం కంటు యిప్పుడు ఎక్కువగా విశ్వసిస్తున్నారు. సోవియట్ సహాయాంశం యీనాడు అరబ్ ప్రపంచంలోని రాజకీయ జీవనంలో ఒక ప్రధాన విషయం అయ్యింది. ఒక పార్టీ యొక్క లేదా సంస్థ యొక్క ప్రజాదరణ ప్రతిష్టలు సోవియట్‌తో స్నేహ సంబంధాలను పెంపొందించుకొనే విషయంలో అవి అనుసరించే వైఖరిపై ఆధారపడి ఉంటున్నది.

సామ్రాజ్యవాద విస్తరణను ప్రతిఘటించడం, తిరుగుపాటు ఒప్పందాలు, సంధులు చేత ధృవీకరించబడిన పరాధీన సంకెళ్ళను తుత్తునియలు చేయడం నిజంగా ఒక వాస్తవమైన కర్తవ్యం. అది లెబనాన్‌లో జరిగిన మహత్తర ఘటనలు రుజువు చేస్తున్నాయి. మేము పేర్కొన్న అపజయాలు, వెనుకడుగులు వున్నప్పటికీ అరబ్ జాతీయ విముక్తి ఉద్యమం మొత్తంమీద పురోగమిస్తుందనడానికి యిది మరో నిదర్శనం. సిరియా కమ్యూనిస్టుపార్టీ ఐదవ మహాసభ (1880) కు సమర్పించిన కేంద్రకమిటీ నివేదికలో యిలా తెలియచేయబడింది. "మొత్తంగా అభివృద్ధి ధోరణిని అంచనా వేయడానికి పేలగా అరబ్ ప్రపంచంలోని కొన్ని పైపైన కనపడే పరిణామాలను గమనించడ మొక్కటే చాలదు. ఏదో ఒక పాలకుని వైఖరి లేదా పాలకపక్షం ప్రదర్శించే నిలకడలేని వైఖరి—ఆ దేశంలో ప్రగతిశీల ప్రభుత్వం ఉన్నప్పటికీ— యావత్ అరబ్ జాతీయ విముక్తి ఉద్యమాన్ని పిలవడానికి ఒక ప్రమాణంగా ఉపయోగపడజాలదు. ఈ ఉద్యమం సంక్షోభంలో వున్నదనో, క్షీణిస్తున్నదనో చెప్పడానికి యిది హేతువు కారాదు. బాగా లోతుగ అనగా క్రింది స్థాయిలో—అంటే ప్రజా బాహుళ్యంలో—సంభవిస్తున్న క్రమాలను చూడవలసిన అవసరం వుంది. మొత్తంగా ఉద్యమంపై వాటి ప్రభావాలను పరిశీలించవలసిన అవసరం వుంది."

అయితే అరబ్ దేశాలలోనూ, మొత్తం నవస్వతంత్ర దేశాలలోనూ వాస్తవంగా వుంటే యీ సర్వసాధారణ సామ్రాజ్యవాద వ్యతిరేక ధోరణి యాంత్రికంగా వాటి విధానంలో అభివ్యక్తీకరించబడడం లేదు. ఆయా ప్రభుత్వాల స్వభావం, అధికారంలోవున్న శక్తుల సామాజికవర్గ స్వభావంమీద యిది ఆధారపడి వుంటుంది. పి. డి. ఆర్. వై. (యెమెన్ ప్రజాతంత్ర రిపబ్లిక్) లాంటి సోషలిజం వైపు పయనిస్తున్న దేశాలలో, అది దోపిడీమీద ఆధారపడిన సంబంధాలన్నింటికి వ్యతిరేకంగా నడిచేకొలదీ యీ ధోరణి సామాజిక స్వభావంతో బాగా ప్రస్ఫుటమవుతున్నది. తమ దేశభక్తియుత దృక్పథానికి పెట్టింది పేరైన ప్రభుత్వాలు దిగజారిపోయినచోట్ల పాలకులు సామ్రాజ్యవాదంతో రాజీ పడిపోయే లేదా దానికి

లొంగిపోయే ధోరణిని ప్రదర్శిస్తున్నారు. కొన్ని దేశాలలో ఉద్యమ అభివృద్ధి అవకాశాలపై తీవ్రమైన పోరాటం కొనసాగుతున్నది. సిరియాలో మాదిరిగా, సామ్రాజ్యవాద వ్యతిరేక విదేశాంగ విధాన ధోరణికి, సామాజిక ప్రగతిని అణచి వేసే అంతర్గత రాజకీయ ధోరణికి మధ్య అప్పుడప్పుడు విభేదాలు కలుగుతున్నాయి.

సిరియన్ కమ్యూనిస్టులమైన మేము, మా రాజ్య వ్యవస్థలోని సామాజిక–ఆర్థిక విధానం యొక్క ప్రతికూల అంశాలపట్ల కళ్ళు మూసుకొనడంలేదు. మా ప్రజల జీవనం దుర్భరంగానే వున్నది. నిరుద్యోగం, అధిక జీవన వ్యయం, గృహాల కొరతలు అసంఖ్యాక శ్రామిక ప్రజలను దెబ్బతీస్తున్నాయి. వారి తక్షణ అవసరాలు తరచూ విస్మరింపబడుతూ వున్నాయి. అదే సందర్భంలో పరాన్న భుక్కులైన బూర్జువా వర్గం పెరుగుతూనే వున్నది. అవినీతి విపరీతంగా వున్నది. పాలకవర్గాలు, ప్రజాబాహుళ్యం యొక్క చొరవలన్నింటినీ, స్వతంత్ర కార్యాచరణనూ అనుమానంతో చూస్తున్నాయి. వాటిపట్ల భయాన్ని ప్రకటిస్తున్నాయి. వారు ప్రజాతంత్ర స్వేచ్ఛలను కుదిస్తున్నారు. ప్రగతిశీల దేశభక్తియుత శక్తుల కార్యాచరణ అవకాశాలపై ఆంక్షలు విధిస్తున్నారు.

అయితే విదేశాంగ విధానరంగంలో యీ ప్రభుత్వం నిలకడయైన సామ్రాజ్యవాద వ్యతిరేక పంథాను అనుసరిస్తున్నది. ఈ పంథా యొక్క ప్రాధాన్యత, ప్రభావాలు సిరియా సరిహద్దులు దాటివెళ్ళి మొత్తం పశ్చిమాసియా, అరబ్ ప్రపంచాన్ని ఆవహిస్తూ, సామ్రాజ్యవాదుల దుస్సాహసిక కోర్కెలకు వ్యతిరేకంగా జరుగుతున్న ప్రపంచ వ్యాపిత పోరాటానికి తోడ్పాటు నిస్తున్నాయి.

ఈ విధానానికి మరో ప్రత్యామ్నాయం మా దేశానికి లేదని మాకు ఖచ్చితంగా తెలుసు. ఈ రోజున డమాస్కస్, అంతర్జాతీయ రాజకీయాల్లో ముఖ్యమైన కేంద్రంగా వున్నది. ఈ ప్రాంతంలోని ఘటనాక్రమాన్ని రూపొందించడంలో దాని యొక్క పాత్రను మా శత్రువులు సైతం గుర్తించరావలసి వస్తున్నది. సిరియా వత్తిళ్ళకు లొంగడం అంటే, దురాక్రమణ దారుకు వ్యతిరేకంగా జరుగుతున్న కృతనిశ్చయంతో కూడిన ప్రతిఘటననుండి వైదొలగడం అంటే, అది సంపాయించుకున్న ప్రతిష్టను, ప్రాంతీయ, అంతర్జాతీయ రాజకీయాల్లో పలుకుబడిని గిన అంశంగా దానికున్న ప్రాధాన్యతను అనివార్యంగా పోగొట్టుకున్నట్టేనన్నది సుస్పష్టం. దాని భవిష్యత్తు, సిరియా, లెబనీస్, పాలస్తీనియన్ యితర అరబ్ ప్రజల న్యాయమైన హక్కులు, ప్రయోజనాలను యింకా ఉల్లంఘిస్తున్న, వారి స్వతంత్ర జాతీయ మనుగడకు ప్రమాదం కల్పిస్తూ, అవరోధాలు కల్పిస్తూన్న వారి చేతుల్లో వుంచడమే అవుతుంది.

సామ్రాజ్యవాదానికీ, అభివృద్ధి నిరోధకులకు యీ విషయం పూర్తిగా తెలుసు. ఈ దేశం ఎదుర్కొంటున్న యిబ్బందులను తీవ్రతరం చేసేందుకు యివి ప్రయత్నిస్తున్నాయి. అవి దేశభక్తియుత శక్తులను విభజించడానికి, ఆర్థిక వత్తిడులను తిరిగి తేవడానికి తీవ్రంగా ప్రయత్నించుతున్నాయి. వీటి ప్రభావం గట్టిగానే వుంటుంది. ఎందుకంటే సిరియా తన ప్రగతిశీల సామాజిక-ఆర్థిక విధానాన్ని వదలివేసింది. (ఇలా ప్రక్కత్రోవ బట్టడంవల్ల కలిగే ప్రమాదకరమైన చిక్కులను రాజకీయ నాయకత్వంలోని పలుకుబడి కలిగిన శక్తులు గమనించినప్పటికీ). అసలు దీని లక్ష్యం యేమంటే ప్రభుత్వంయొక్క దేశభక్తియుత వైఖరులను కుదిపి వేయడం, మరింత తీవ్రమైన మార్పులను నివారించడం, సోవియట్ యూనియన్‌తో సన్నిహిత సంబంధాలను నివారించడం.

అయితే యిక్కడ అనేక ముఖ్యమైన ప్రశ్నలు ఏర్పడుతున్నాయి. సామాజిక ఆర్థిక రంగంలో విభేదాలు కలిగివుంటూ అప్పుడప్పుడు ఘర్షణపడుతూ సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా శాంతికొరకు ఐక్య సంఘటన ప్రాతిపదికపై సహకారానికి, పొత్తుకు కమ్యూనిస్టులు ఎలా అంగీకరించగలరు ? సిరియాయొక్క విదేశీ, స్వదేశీ విధానం మధ్యగల అఘాతాన్ని పూడ్చే అవకాశాలు అంటే దేశాన్ని సామాజిక ప్రగతిపథంమీద తిరిగి నిలబెట్టే అవకాశాలు యింకేమాత్రం లేవా ?

దేశంలోని సాధారణ పరిస్థితిమీద, మొత్తంగా ప్రభుత్వం, ప్రతిఒక్క రాజకీయ పార్టీ లేదా బృందంపట్ల మన వైఖరిని నిర్వచించడంలో ప్రధాన అంశం, ఆ పరిస్థితి, ప్రభుత్వం, పార్టీ లేదా గ్రూపునకు, వలసవాదానికీ, సామ్రాజ్యవాదానికీ, వాటి పథకాలకు వ్యతిరేకంగా పోరాడటం అన్న ప్రధాన సమస్యకుగల అంతర్ సంబంధంయొక్క స్వభావం అని యస్. సి. పి. ఐదవ మహాసభ నొక్కి చెప్పింది. సిరియా జాతీయ ప్రగతిశీల సంఘటన ఏర్పాటులో అరబ్ రినయిజాన్స్ పార్టీ (బాద్) యితర ప్రగతిశీల పార్టీలతో సమైక్యత నెరపడానికి గల ప్రధాన ప్రమాణం యిదే. అయితే యస్. సి. పి. విధానంలో వున్న ఏకైక ప్రధాన సూత్రం యిది ఒక్కటేకాదు. కార్మికవర్గ ప్రయోజనాలను అభివ్యక్తీకరించే సంస్థగా తన రాజకీయ, నిర్మాణపరమైన, సైద్ధాంతిక స్వాతంత్ర్యాన్ని పరిరక్షించే పంథాలో దీనిని పార్టీ అతి సన్నిహితంగా పెంపొందిస్తుంది. వారియొక్క రాజకీయ, ఆర్థిక డిమాండ్లను సంతృప్తి పరచడానికి ప్రయత్నిస్తూ, దేశాన్ని సామాజిక అభ్యుదయ పంథాన తిరిగి తీసుకురావడానికి పోరాడుతూ ప్రజల ఆశలను పరిరక్షించడానికి పార్టీ ధైర్యంగా, నిలకడగా పోరాడుతుంది.

అవి అప్పుడప్పుడు విభేదిస్తున్నప్పటికీ, సామ్రాజ్యవాదుల కుట్రలకు వ్యతిరేకంగా, ప్రజల స్వేచ్ఛ, ప్రపంచ శాంతికోసం పోరాటంలో వారిని సమైక్యపరచే అంశాల ప్రాతిపదికపై యస్. సి. పి. బాద్‌పార్టీల సంబంధాలున్నాయి. సామా

జిక-ఆర్థికాభివృద్ధి సమస్యలపట్ల వుండే వైఖరి, ప్రజాస్వామ్యాన్ని విస్తరించడం, ప్రజావాహుళ్యపాత్ర సమస్యలకు సంబంధించి మేము విభేదిస్తాము. ఇది సహజం. ఎందుకంటే మా సైద్ధాంతిక వేదికలు ఒకేరకంగా వుండవు. మనం గుర్తించాల్సిన ముఖ్యమైన విషయం ఏమంటే యీ విభేదాలు వుంటాయనీ, వాటిమీద సరియైన వైఖరిని తీసుకోవాలన్నది.

కమ్యూనిస్టుల ప్రధాన వైఖరి యీ క్రింది విధంగా వుంటుందని చెప్ప వచ్చు. సిరియా దేశభక్తి విధానాన్ని పటిష్టం చేసేందుకు మేము సహాయం చేయాలి; దాని వెనుకగల విభేదాలను పరిష్కరించుకోవాలి; ప్రతికూల పరిణామాలు నిర్మూలించడానికి సంబంధించి, సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా ఉధృతం చేయ బడిన పోరాటంలోని ప్రధాన కర్తవ్యాన్ని చూస్తూనే, యింతవకు సాధించబడిన సహకార చట్రంలోనే మేము యీ విధంగా చేస్తాము.

పశ్చిమాసియాలో నేడు యీ పోరాటం ఖచ్చితంగా నిర్దిష్ట రూపాలను సంత రించుకొంటున్నది. 'కాంప్ డేవిడ్ ఒప్పందం "లేదా" రీగన్ పథకం' వంటి అమె రికా పథకాలకు వ్యతిరేకంగాఅలాగే యీ ప్రాంతంలో సామ్రాజ్యవాద సైనిక మనుగడకు ముఖ్యంగా అమెరికా సామ్రాజ్య వాదానికి వ్యతిరేకంగా జరిగే పోరా టాలకు నాయకత్వం వహిస్తున్నది అదే సందర్భంలో, శాంతికోసం, అణుమారణ హోమప్రమాదాన్ని తొలగించడానికి ప్రజలు జరిపే సాధారణ కార్యాచరణలను మునుప టికంటె ఎక్కువ సన్నిహితంగా మేళవిస్తున్నది."వ్యూహాత్మక సహకారం పై" అమెరికా - ఇజ్రాయిల్‌లు ఒప్పందం చేసుకున్నదృష్ట్యా యీ రెండు మార్గా లలోనిపోరాటానికే అధికతర ప్రాముఖ్యత వున్నది. ఈ సహకారం, ఈ ప్రాంతా లలోనూ, ప్రపంచ వ్యాపితంగానూ, తమ కార్యకలాపాల ద్వారా అంతర్జాతీయ శాంతికి ప్రమాదం కల్పిస్తున్న దుస్సాహసి సైనికకూటమి ప్రత్యేకరూపం.

అరబ్ జాతీయ విముక్తి ఉద్యమంలోని అనేక కీలక రంగాలలో ప్రాధా న్యతగల కర్తవ్యం యేమంటే, ప్రజా జీవనంలోని విభిన్న అంశాలను ప్రజా తంత్రయుత మొనర్చడం. దాని అర్థం యేమంటే, ప్రజా ప్రయోజనాలను తీర్చ డానికి, అలాగే ప్రజల చొరవ పరిధిని అనుమతించడానికి ప్రధాన రాజకీయ నిర్ణయాలను ఆమోదించడంలోనూ, అమలు పరచడంలోనూ తెలివిగా నిజంగా సహాయపడేటట్లు చేయడానికి విధాన పంథాను ఉధృతం చేయాల్సిన ఆవశ్యకత. దానిమీద విధించే ఆంక్షలు, దేశభక్తియుత ప్రభుత్వాల రాజకీయ స్థిరత్వాన్ని, జాతీయ ఉద్యమంలో వాటి పాత్రను గట్టిగా దెబ్బ తీస్తాయి; సామ్రాజ్యవాదులను సమర్థవంతంగా ప్రతిఘటించే అవకాశాలకు నష్టం వాటిల్లి చేస్తాయి.

ఈ పోరాటం యొక్క ఫలితం, అరబ్ జాతీయ విముక్తి ఉద్యమంలో వున్న విభిన్న దళాలు, ప్రపంచ విప్లవ క్రమంలోని శక్తులు ముఖ్యంగా, సోవియట్ యూనియన్ నాయకత్వాన వున్న మొత్తం సోషలిస్టు సమాజ దేశాల మధ్య అధిక ప్రమాదంలో వుండే సన్నిహిత ఐక్యతలమీద ఆధారపడి వుంటుంది. రాజకీయ సైనిక రంగాలతో సహా వివిధ రంగాలలో సిరియా, సోవియట్ యూనియన్ల మధ్య ప్రస్తుతం వున్న సంబంధాలు, అవి పరిణామాలను ఎలా గటిగా ప్రభావితం చేయగలదో అని చెప్పడానికి మంచి ఉదాహరణ మన ప్రధాన కర్తవ్యం యీ సంబంధాలు ఉన్నత స్థాయికి చేరడానికి సహాయపడడం. ఎందుకంటే, యీనాటి జీవనం, పోరాటాల యొక్క పెరుగుతున్న ఉధృతం కోరుతున్నదీ యిదే.

సిరియన్ కమ్యూనిస్టులమైన మేము, ఎలాంటి సోవియట్ విధానాన్ని అప్రతిష్ఠపాల్జేసే, అగౌరవపరిచే ఎలాంటి చర్యకైనా వ్యతిరేకంగా నిలబడి దానిని రక్షించడం అన్నది ఒక్క అంతర్జాతీయ శ్రామిక వర్గ బాధ్యతయేగాక, సిరియా ప్రజల ప్రధాన జాతీయ ప్రయోజనాల దృష్ట్యా, అలాగే ఆక్రమిత అరబ్ విముక్తికై యీ దేశంలో ప్రగతిశీల, ప్రజాతంత్ర అభివృద్ధికై పోరాడవలసిన దృష్ట్యా ఏర్పడిన దేశభక్తియుత వైఖరి నుండి ఏర్పడే బాధ్యత కూడా, కాని మేము ప్రగాఢంగా విశ్వసిస్తున్నాం. సంబంధిత ఐక్యరాజ్యసమితి తీర్మానాలు, ఫెజ్ అరబ్ శిఖరాగ్ర సభ నిర్ణయాలను సంపూర్ణంగా అనుగుణంగా వున్న లించనికి వెలిసిన సోవియట్ ప్రతిపాదనలు పశ్చిమాసియా సంక్షోభ పరిష్కృతికి ఒక వాస్తవమైన ప్రాతిపదికను ఏర్పాటు చేయగలవని జ్ఞాపకం వుంచుకోవాలి.

సామ్రాజ్యవాదుల యూదు జాత్యహంకారాల, అభివృద్ధి నిరోధకులతో ఏర్పాటు చేయబడిన కూటమి దెబ్బను నిలువరించడానికి వగైరా మార్గం మన స్వంత ఐక్యతను బలోపేతం చేసుకోవడమే. ఇది, అరబ్ జాతీయ విముక్తి ఉద్యమంలోని వున్న విభిన్న వర్గాల మధ్య వున్న సంబంధాలను, వాటిలో వున్న పరిస్థితికి రెండింటికీ అనువర్తించుతుంది. ఇంతకు ముందులా యిప్పుడు కూడా, పాలస్తీనా సమస్యకు న్యాయమైన పరిష్కారం కోసం పోరాడ్డం, ఇజ్రాయిల్ విస్తరణ వాదాన్ని ప్రతిఘటించడం, పట్టుబడిన అరబ్ భూభాగాలను విడుదల చేయడానికి పోరాడ్డం అన్నది అరబ్ దేశభక్తుల నందరినీ సమీకరించి, ఐక్యపరచేందుకు అధికతర ప్రాముఖ్యతగల అంశాలు.

పాలస్తీనా సమస్యకు సంబంధించినంత వరకూ, పాలస్తీనా అరబ్ ప్రజలకు స్వయం నిర్ణయాధికార హక్కును యివ్వాలన్న, స్వతంత్ర్యం వారి మాతృభూమిని తిరిగి యివ్వడం, స్వతంత్ర దేశం ఏర్పాటు చేయడం అన్న డిమాండ్ భవిష్యత్ నినాదంగా వుంటుంది. ఇందులో వేరే మార్గాలంటూ వుండవు. పాలస్తీనా

విముక్తి సంస్థ ఒక్కటే పాలస్తీనా ప్రజల చట్టబద్ధ ఏకైక ప్రతినిధి అని మేము స్పష్టీకరిస్తున్నాం. దాని రాజకీయ కార్యక్రమం క్రింది. పాలస్తీనా జాతీయ మండలి 16 వ సమావేశం నిర్ణయాను సారం, అంతర్గత ఐక్యతను పునరుద్ధరించి బలవత్తరం చేయడానికి దానికి అన్ని విధాల సహాయం చేయాలని మేము వక్కాణిస్తున్నాం. సిరియా - పాలస్తీనియన్ల సంబంధాల మధ్య సంబంధాలు మామూలు స్థాయికి రావాలన్న దానికి మేము అధికతర ప్రాముఖ్యత నిస్తున్నాం. ఇటీవల యిసాధారణంగా వుండాల్సిన సంబంధాలకంటె తక్కువ స్థాయిలో వున్నామని చెప్పడానికి మేము విచారిస్తున్నాం.

దేశంలోని దేశభక్తియుత శక్తుల ఐక్యత, లొంగిపోయిన వారి, మతతత్వ వాదుల విజ్ఞప్తులను గట్టిగా ఖండించడం, సిరియాతో సన్నిహిత సఖ్యత ఏర్పాటు చేసుకోవడం, దాని దేశభక్తియుత శక్తుల దృఢత్వం మీద ఆధారపడడం అన్నవి యీ రోజు సాధించిన విజయాలను సంఘటిత పరచుకోవడానికీ, దురాక్రమణ దారులను గెంటివేయడానికీ, అన్ని సాయుధ జోక్యాలను అంతమొందించడానికీ చేసే పోరాటాన్ని విజయవంతంగా ముగించడానికి అత్యంత ఆవశ్యకమైనవని లెబనాన్‌లోని ఘటనలు సూచిస్తున్నాయి. ఈ శక్తిని సాధించడానికి అంతరంగిక విషయాలను నిర్మించుకోవడం సిరియా దేశభక్తులందరి ముఖ్యంగా, జాతీయ ప్రగతిశీల సంఘటన సభ్యుల బాధ్యత. అరబ్ జాతీయ విముక్తి ఉద్యమంలోని అన్ని పక్షాలకు అధికతర ప్రాముఖ్యతగల కర్తవ్యం, యీ ప్రయత్నాలను పూర్తిగా బలపరచడం.

ఈ ఉద్యమంలోని లక్ష్యాలు సాధించేటట్టు చేయడానికి వీలుగా మొట్టమొదటిగా ప్రజలు కార్యాచరణకు పూనుకునేటట్టు చేయడం ముఖ్యం. ఈ పరిస్థితులలో ఫలప్రదమై వుండే ప్రజా సమీకరణ మార్గాలను, పద్ధతులను రూపొందించి లేక పోయామన్న విషయం అరబ్ దేశాల కమ్యూనిస్టులమైన మనం అంగీకరించక తప్పదు. ఈ లోటుపాట్లను తొలగించుకోవాలి. ఇది మనం అందరం కేంద్రీకరించి పని చేయాల్సిన పని అని మేము భావిస్తున్నాం. ఇందులో భాగంగా, సైద్ధాంతిక, రాజకీయ పోరాటాన్ని ఉధృతం చేయాలి; ప్రజా బాహుళ్యంలో సమర్థనీయంగా పని చేసేందుకు విభిన్న పద్ధతులను అధ్యయనం చేయాలి; వారి రక్షణ సమస్యల పట్ల శ్రద్ధ చూపించాలి: సామ్రాజ్య వాదానికీ, యూదు జాత్యహంకారానికే, ప్రతిఘాత శక్తులకు వ్యతిరేకంగా వున్న శక్తులందరి ఐక్యతను సాధించి, బలపరిచే ప్రయత్నాలను పట్టుదలతో కొనసాగించాలి. అన్ని రంగాలలో మా పోరాటం కొనసాగించాలి. ప్రతి ప్రత్యేక దశలో మా ప్రధానమైన దెబ్బలు కూడా తీయాలి. ఎక్కడ ప్రధాన శత్రువులను కేంద్రీకరించాలి అన్న విషయం తదనుగుణంగా నిర్ణయించుకోవాలి.

సంపూర్ణంగా జయం సిద్ధించేంతవరకు పోరాటం అవిశ్రాంతంగా కొనసాగుతుంది



# యుద్ధ ప్రచారం నేరం

జాన్ పిట్ మాన్

*అమెరికా కమ్యూనిస్టు పార్టీ పొలిట్ బ్యూరో సభ్యుడు*

అణ్వాయుధాలున్న దేశాల మధ్య సంబంధాల్లో పాటించాల్సిన ముఖ్యమైన అంశమేమంటే అణ్వాయుధాల వినియోగాన్ని ఏ రూపంలో అయినా ప్రోత్సహించే ప్రచారాన్ని విడనాడాలి. అటువంటి ప్రచారాన్ని నిషేధించాలి.

అణుయుద్ధ ప్రమాదం స్పష్టంగా కన్పిస్తున్న ఈ దశలో, యుద్ధ వ్యతిరేక ఉద్యమం ప్రధానమైన అంశంగా రంగం పైకి వచ్చిన ఈ తరుణంలో, భూగోళం పైన ఉన్న సకల జీవ రాసుల్ని నాశనం చేయడానికి అవసరమైన దానికంటె అనేకరెట్ల మారణాయుధాలు పోగుబడిన ఈ సమయంలో, కనస్తాంతిన్, చెర్నెంకో ప్రతిపాదనలకు ఒక ప్రత్యేక ప్రాధాన్యత ఉంది. అందుచేతనే సోవియట్ యూనియన్ కమ్యూనిస్టు పార్టీ ప్రధాన కార్యదర్శి పలుకులు వినగోరే వారందరికీ, స్పష్టంగా వినిపిస్తున్నాయి.

యింకా యితర దేశంలోనూ యుద్ధ ప్రచారం ఇంత నిరంతరాయంగా, బహిరంగంగా విస్తృతంగా జరగటంలేదు. రీగన్ లజ్జా రహితంగా యుద్ధనినాదాలు చేస్తున్నాడు. ప్రచార సాధనాలు అంతకంటె లజ్జారహితంగా అతని ప్రచారాన్ని మోస్తున్నాయి. యుద్ధ పిచ్చిని ఇంతగా రెచ్చగొడుతున్న దేశం మరొకటిలేదు.

నిజానికి అధ్యక్షుడు రీగన్ నాయకత్వానున్న అమెరికా సోషలిజాన్ని భౌతికంగా నాశనంచెయ్యాలనే విధానాన్ని అమెరికా ప్రజల నెత్తినరుద్దాలని చూస్తోంది. అణ్వాయుధాలతో మొదట దాడి చేయడం ద్వారా అది సాధించగలమని వారు ప్రజల్ని నమ్మిస్తున్నారు. ఈ విధానాలకి సామాజిక పునాది నిర్మించడానికి సోషలిజం కమ్యూనిజాలను సైతాన్‌లుగా చిత్రించడం జరుగుతోంది.

అమెరికా ప్రభుత్వ గుత్తపెట్టుబడిదారీ పండితులు సోవియట్ యూనియన్ గురించి అంతులేని అబద్ధాలను, వక్రీకరణలను ప్రచారం చేస్తున్నారు. ఇది 1917

అక్టోబరు విప్లవం జరిగిన నాటి నుండి కొనసాగుతూనే ఉంది. అమెరికా ప్రజల్లో కొన్ని తరాలకు చిన్నప్పటి నుంచీ చనిపోయే వరకూ ఈ సోవియట్ వ్యతిరేక విషాహారం తినిపించడం జరుగుతోంది. వారిలో ఎవ్వరికీ సోషలిజం గురించి అణు మాత్రమైనా తెలియదు సోవియట్ యూనియన్‌పై ద్వేషాన్ని రగుల్చొల్పటంలో రీగన్ ప్రభుత్వం అంతకు ముందున్న ప్రభుత్వాలన్నిటినీ తలదన్నింది. అణుయుద్ధం అవసరమనీ, దానిలో తాము జయించగలమనీ ప్రజల్ని నమ్మించ డానికి తంటాలు పడుతోంది.

అయినా, జనం అంతా ఈ ప్రచారానికి మోసపోతున్నారని చెప్పటానికి వీల్లేదు. శాంతి సంస్థల్లో ఏ ఒక్కటీ రీగన్ మాటల్ని నమ్మటంలేదు. అణుయుద్ధం గెలవటం అనేదాన్ని వారు నమ్మటంలేదు. సోవియట్ యూనియన్‌పై యుద్ధం అనివార్యమని కూడా వారు నమ్మటంలేదు. సోవియట్ యూనియన్ అణ్వాయుధాల పాటవం అమెరికా కంటె ఎక్కువని రీగన్, అతని అనుయాయులు చెప్పుతున్న దానిని వారు నమ్మటంలేదు. సమతూకం అనేది అవాస్తవికమనీ, సాధ్యం కాదనీ వారు చెప్పే మాటల్ని కూడా శాంతి సంస్థలు ఖాతరు చేయటంలేదు.

ఏ శాంతి సంస్థ రీగన్ మాటల్ని నమ్మదు. ఉపాధ్యక్షుడు బుష్, యుద్ధ మంత్రి వెయిన్ బెర్గర్‌ల మాటల్ని కూడా అవి నమ్మవు. అమెరికా తన సాంకేతిక విజయాల ద్వారా యుద్ధంలో సోవియట్ యూనియన్‌ని గెలవ గలుగుతుందని, ఆ అణుయుద్ధం పరిమితంగా మాత్రమే ఉంటుందనీ, అమెరికా కేమీ నష్టం జరగదనీ వారుచెప్పే కాకమ్మ కబుర్లను శాంతి యోధులెవ్వరూ నమ్మటం లేదు. రీగన్ వాదులు చేస్తున్న అటువంటి మూర్ఖపు వాదనలను, శాంతి సంస్థల నాయకులు నిర్ద్వంద్వంగా ఖండించారు.

అణ్వాయుధాల స్తంభన కోసం సాగిన ఉద్యమం అమెరికాని తుఫాన్‌లా చుట్టుముట్టింది. ఈ ఉద్యమంలో ట్రేడ్ యూనియన్లూ, కార్మిక వర్గమూ చాలా చురుకుగా పాల్గొన్నాయి. దేశంలో అతిపెద్ద ట్రేడ్ యూనియన్ సంస్థ అయిన ఎ. ఎఫ్. ఎల్—సి. ఐ. ఓ కేంద్ర కార్య వర్గంలో అనేకమంది గుడ్డి సోవియట్ వ్యతిరేకులున్నప్పటికీ శాంతి ఉద్యమంలో కార్మిక వర్గం చురుకుగా పాల్గొకుండా వారు అడ్డుకోలేక పోయారు. మెషినిస్టుల అంతర్జాతీయ సంఘం, ఏరోస్పేస్ వర్కర్స్ అంతర్జాతీయ సంఘం, అమెరికా ప్రభుత్వ నగరపాలక ఉద్యోగులూ, ఆహార పరిశ్రమలో, జౌళి పరిశ్రమలో పనిచేసే కార్మికులు శాంతి ఉద్యమంలో చురుకుగా పాల్గొన్నారు. అనేక వృత్తుల్లో పనిచేస్తున్న కార్మికులు ముందుకొస్తు న్నారు. విద్యా సంస్థల నుండి కూడా ముందుకొస్తున్నారు.

75 పారిశ్రామిక నగరాల్లో శాంతికోసం, ఉద్యోగాలకోసం జరిగిన ఉద్య మాల్లో అనేకమంది పాల్గొన్నారు. అణ్వాయుధాల స్తంభన తీర్మానాలను అనేక

నగర పాలక సంస్థలు ఆమోదించాయి. ఆ తీర్మానాలు అమెరికా సెనేట్ లోనూ, ప్రతినిధుల సభలో కూడా ప్రవేశ పెట్టబడ్డాయి.

అణుయుద్ధంలో గెలవటం సాధ్యమనే రీగన్ ప్రచారాన్ని మాజీ సైనికాధికారులు, మాజీ ప్రభుత్వాధికారులు, వైద్యులు మొదలైనవారు తీవ్రంగా ఖండిస్తున్నారు. కొన్ని టి. వి. సినిమాలు కూడా ఈ దిశగా సాయపడుతున్నాయి. ఉదాహరణకి, 'ది డే ఆఫ్టర్' సినిమా ప్రపంచ వ్యాప్తంగా సంచలనాన్ని రేపింది.

అయినప్పటికీ, యుద్ధ ప్రచారకుల పిచ్చి ఊహించ వీలులేనంత ఎక్కువగా ఉంది. రీగన్ అనుయాయుల్లో ఒకడైన రిచర్డ్ పైప్స్ ఇలా అన్నాడు : "సోవియట్ యూనియన్‌లో అణుయుద్ధంలో మనకు వాటిల్లే నష్టాలు భయంకరంగానే ఉంటాయి. అయినా జాగ్రత్తగా ముందే పథకం వేసుకుంటే నష్టాలను తగ్గించవచ్చు." ఇదీ వారి పిచ్చిస్థాయి.

"అణుయుద్ధంలో మీరెలా గెలవ గలరు?" అనే ప్రశ్నకు ఉపాధ్యక్షుడు బుష్ ఇలా జవాబు చెప్పాడు : "ముఖ్యమైన వారిని, పారిశ్రామిక సంస్థల్ని, జనాభాలో కొంత శాతాన్ని రక్షించుకోవచ్చు. శత్రువుకి మనం కలిగించే నష్టం కంటె శత్రువు మనకి కలిగించగలిగే నష్టం తక్కువ." "ఎంతమంది ప్రజల్ని మనం కాపాడగలం?" అన్న ప్రశ్నకు, "ఐదు శాతం కంటె ఎక్కువే కాపాడ గలమని" అతడు ప్రవచించాడు.

బహుశా అణుయుద్ధం తర్వాత బతికే వాళ్ళలో తానూ ఒకడ్నని బుష్ నమ్ముతూ ఉండొచ్చు. ఇందులో ఆశ్చర్యమేమీ లేదు. అమెరికా ప్రభుత్వంలోని ఉన్నత వర్గాలు, వారితోపాటు గుత్త సంస్థల సభ్యులూ అణుయుద్ధం జరిగితే నష్టపోకుండా ఇప్పటినుండే జాగ్రత్తలు తీసుకొంటున్నారనేది రహస్యమేమీకాదు. పర్వతాల కింద వారు కందకాలు తవ్వుతున్నారు. వాటిలో ఆహార పదార్థాలను నిల్వ చేస్తున్నారు. ప్రజల బారినుండి తప్పించుకోటానికి వారు పెద్ద ఎత్తున రక్షణ ఏర్పాటు చేసుకొంటున్నారు.

1979 లో అనేక అండర్ గ్రౌండ్ కందకాలు తవ్వారు. వాషింగ్టన్‌లో ఈ కందకాలు కొల్లలుగా తయారయ్యాయి. వాటిలో ఒకదానిలో కరెన్సీ నోట్ల కట్టల్ని దాచారు. ఒక పెంటగన్ సలహాదారుడు, టి. కె.—జోన్స్ కరెన్సీ నోట్ల అవసరం, అణుయుద్ధం తర్వాత ఉంటుందని నిజంగా నమ్ముతున్నాడు. అమెరికా ప్రభుత్వం పిచ్చివాళ్ళ అధికారంకింద ఉంది.

అటువంటి పిచ్చివాళ్ళు అన్నిటికీ సిద్ధపడుతున్నారు. ప్రపంచ ప్రజల ప్రాణాలతో జూద మాడుతున్నారు.

నవంబరు 6 న జరగబోయే ఎన్నికలు వేగంగా సమీపిస్తున్నాయి. ఈ రీగన్ కసాయి ముఠాని అధికారంనుండి తొలగించడానికి ఇది మంచి అవకాశం. అమెరికా ఈ అవకాశాన్ని వినియోగించుకొంటే యుద్ధ పిచ్చిగాళ్ళ రెక్కలు కత్తిరించడానికి వీలవుతుంది.



# ప్రజల విజయం, వారి సాహిత్యపు విజయం

1985 మే నాటికి నాజీ జర్మనీ ఓడిపోయి నలభై ఏళ్ళు అవుతుంది. ఆ సందర్భంగా మాస్కోలోని సవ్రెమెన్నిక్ పబ్లిషింగ్ హౌస్ 12 సంపుటాలను ప్రచురిస్తోంది. ఈ సంపుటాలన్నీ "గార్లండ్ ఆఫ్ గ్లోరీ" అనే శీర్షిక కింద ప్రచురించబడతాయి. ఇందులో రెండవ ప్రపంచ యుద్ధం గురించిన సాహిత్యం ఉంటుంది.

ప్రతి సంపుటి యుద్ధానికి సంబంధించిన ఒక ప్రత్యేక దశను సూచిస్తుంది. ఉదాహరణకి ఎరైజ్, గ్రేట్ ల్యాండ్ (ఇది యిప్పటికే ప్రచురింపబడింది) అత్యంత కష్టదాయకమైన మొదటి ఏడాది 1941 గురించి రాయబడిన నవలలు, వ్యాసాలు, కవితలు వగైరాలుంటాయి.

వీటిని ప్రచురించటానికి ఏర్పడిన సంపాదక వర్గం, సంపాదక సమితుల్లో ప్రసిద్ధ సోవియట్ రచయితలుంటారు. యూరీ బొందారెవ్, మిహాయిల్ అలెక్సేయేవ్, నికొలాయ్ గ్రిబాచెవ్, యెగోర్ ఇసాయెవ్, నికలాయ్ స్తారోషినోవ్ లాంటి ప్రముఖులుంటారు.

మొదటి సంపుటి ముందు మాటలో ఇలా పేర్కొనబడింది: ఈ సంపుటాలను పొందుపరుస్తున్న వారి లక్ష్యమేమంటే యుద్ధం గురించి సోవియట్ రచయితలు రాసిన అత్యుత్తమ రచనలను ఒక దగ్గరకు చేర్చడమే. దేశాత్మకంగా రాసిన వ్యాసాలు, యుద్ధ సమయపు కవిత్వంలో ఉత్తమమైనదాన్ని, అత్యుత్తమ కథలను, నవలా ఖండికలను, దేశవ్యాపితంగా గుర్తించబడిన వివరణలు వగైరాలు వీటిలో చోటుచేసుకొంటాయి. గార్లండ్ ఆఫ్ గ్లోరీ కేవలం ఒక సాహిత్య, ప్రచార స్మృతి చిహ్నం మాత్రమే కాదు. అది యుద్ధంలో పాల్గొన్నవారందరికీ ఒక గౌరవనీయమైన స్మృతి చిహ్నం. వీరత్వంలో తననుతానే సాటి అనిపించుకొన్న తరానికిది ఓ కానుక."

ప్ర: సోవియట్ యూనియన్‌లో దేశభక్తియుత మహా యుద్ధం గురించి రాసిన పుస్తకాలు భారీ స్థాయిలో అమ్ముడవుతుంటాయి. ఈ 12 సంపుటాలను ప్రచురించటంలో గల లక్ష్యం ఏమిటి? సంపాదక సమితి సభ్యుల్లో ఒకడైన మిహాయిల్ అలెక్సేయేవ్‌ని వరల్డ్ మార్క్సిస్టు రివ్యూ ప్రతినిధి అడిగిన మొదటి ప్రశ్న యిది.

జ : ఈ ప్రచురణను తీసుకురావటం చాలా సంతోషదాయకమైన ఘనటగా నేను భావిస్తున్నాను. దీనికి అనేక కారణాలున్నాయి. ప్రాచీన కాలంలో ఒక నానుడి వుండేది. ఫిరంగులు మాట్లాడినప్పుడు సంగీత సాధనాలు మౌనంగా వుంటాయి అనేది ఆ సామెత. అన్యాయపు యుద్ధం చేసే దేశం విషయంలో బహుశా యిది నిజమే కావచ్చు. ప్రపంచ సాహిత్యంలో ఎంచదగిన యుద్ధ గ్రంథమేదీ నాజీ జర్మనీ నుండి రాలేదు. నిజానికి ఒక నిజాయితీపరుడైన సంగీత విద్వాంసుడు అటువంటి సందర్భాల్లో పాడగలడా ? అయితే నాజీ జర్మనీ దురాక్రమణకి వ్యతిరేకంగా సోవియట్ యూనియన్ చేసిన యుద్ధం మొదటినుండీ అత్యంత న్యాయమైనది. అది దేశభక్తియుత యుద్ధం. మా మాతృభూమిని రక్షించుకోటానికి మేము పోరాడాం. అందుకనే అది ప్రజా యుద్ధమనే మాటకి సార్థకతని తీసుకొచ్చింది. అందుచేతనే మా సంగీత సాధనాలు మౌనంగాలేవు.

1941 జూన్ 22 వ తేదీన నాజీ జర్మనీ సోవియట్ యూనియన్ దురాక్రమణ చేసింది. అదేరోజు మధ్యాహ్నానికి వసిలీ లెబెదేవ్ పవిత్ర యుద్ధం అనే తన కవితని రాశాడు. ఆరోజు సాయంత్రానికల్లా అలెక్సాండర్ అలెక్సాంద్రోవ్ దానికి సంగీతం సమకూర్చాడు. యుద్ధం జరిగినంతకాలమూ ఆ పాట మా ప్రజలందరికీ ఒక పోరాట గేయంగా మారింది.

ఈ అంశంపై రాసిన గ్రంథాలకు సోవియట్ పుస్తకాల షాపుల్లో ఎప్పుడూ దుమ్ముపట్టలేదు. మహత్తర దేశభక్తియుత యుద్ధం గురించిన పుస్తకాలను కొంతమంది పోగుజేసారు. ఈ వస్తువుకి జనంలో యింకా ఆదరణ ఉంది. భవిష్యత్తులో ఈ ఆదరణ తగ్గే అవకాశమేమీలేదు. ఒకే ప్రచురణలో అత్యుత్తమమైన దాన్నంటినీ అందించాలంటే ఆ కాలంలో జీవితానికి విస్తృత చిత్రణ యివ్వాల్సి వుంటుంది. పాఠకుని ఆసక్తినినిలబెట్టి ఉంచాలంటే ఆ సాహిత్యంలోని వైవిధ్యాన్ని దృష్టిలో వుంచుకోవాలి. రెండో ప్రపంచ యుద్ధంలో మా సాహిత్యానికి అఖండ విజయం లభించిందనడానికి ఇది నిదర్శనం.

ఇందులో మరో అంశముంది. ఇంతవరకూ యుద్ధంలో వ్యక్తుల విజయాలు మొత్తం సాధించిన విజయం గురించి పేర్కొనటం జరిగింది. కాని యీ మా ప్రయత్నం యుద్ధం విషయంలో మా సాహిత్యం సాధించిన విజయానికి నిదర్శనం.

ఒక చారిత్రక సంఘటనపై ఒక కళాఖండాన్ని సృష్టించాలంటే దానికి కొంత వ్యవధి అవసరమౌతుందని అంటారు. దీనికి ఉదాహరణగా లియో టాల్‌స్టాయ్ రచించిన "యుద్ధమూ, శాంతి" అనే గ్రంథాన్ని పేర్కొనవచ్చు. ఈ సామెతలో కొంత వాస్తవం ఉన్నప్పటికీ, అదేపూర్తిసత్యం అనటానికి వీల్లేదు. అలెగ్జాండర్ ట్వార్‌దోవిస్కీ రాసిన వసేలీ త్యోర్కిన్ అలెక్సీ టాల్‌స్టాయ్ రచించిన రష్యన్ స్వభావం, మిహాయిల్ షోలహోవ్ రచించిన "దే ఫాట్ ఫర్ దెయిర్ కంట్రీ"

(వారు తమ మాతృభూమికై పోరాడారు) కళా ఖండాలు కావా? ముట్టడికి గురైన లెనిన్‌గ్రాడ్‌లో నికలాయ్ తిఖనోవ్ కవితలు. ద్మిత్రీ షస్తకోవిచ్ కూర్చిన సెవెన్త్ సింఫనీ (లెనిన్‌గ్రాడ్), మాత్వెయ్ బ్లాంటర్ రాసిన పాటలు, అనతోలీ నోవికోవ్, వసీలీసొలొవ్యోవ్ సెదొయ్‌లు రాసిన పాటలు – యివన్నీ కళా ఖండాలు కాదా? ఇవన్నీ అతి తక్కువ సమయంలో రాసినవే. కాబట్టి కళా ఖండాలకు ఎక్కువ వ్యవధి అవసరమనే సూత్రాన్ని దాటరానిదిగా, అదే సంపూర్ణ సత్యంగా చేసి మాట్లాడరాదు.

ప్ర : యుద్ధ కాలంలో సోవియట్ కళాసాహిత్యాలు అంత ఉన్నత స్థాయిలో ఉండటానికి గల కారణాలేమిటి ?

జ : దాన్ని క్లుప్తంగా వివరించటానికి ప్రయత్నిస్తాను. మా మాతృభూమిని విముక్తి చేసిన తరం ఆ యుద్ధాన్ని గెల్వటానికి కారణం కమ్యూనిస్టు పార్టీ వారిని అందుకు ప్రేరేపించటమే. సోషలిజంలోనూ, విజయంలోనూ అది అంతులేని విశ్వాసాన్ని కలిగించింది.

ఆనాటి రచయితల హృదయాలు, ప్రజల హృదయాలకు అత్యంత సన్నిహితంగా ఉన్నాయని చెప్పాల్సి ఉంది.

విమోచన యోధులకు, ప్రజలకు విజయంపై విశ్వాసం కల్గించటంలో సాహిత్యం మహత్తరమైన సేవ చేసింది. అక్టోబర్ విప్లవంలోనూ, అంతర్యుద్ధ కాలంలోనూ పోరాడిన వీరులు మాకాదర్శం. అలా ఆదర్శంగా మారటానికి కారణం వాటి గురించి రెండో ప్రపంచ యుద్ధానికి ముందు తరలొచ్చిన సాహిత్యం మాకా ప్రేరణ యిచ్చింది. అలాగే ప్రస్తుత తరానికి ప్రేరణగా 1941 – 45 సాహిత్యం తోడ్పడుతుంది.

ప్ర : యివన్నీ యుద్ధంలో పాల్గొన్నవారు రాసినవేనా ?

జ : అన్నీకాదు. దేశభక్తియుత యుద్ధం గురించి ఎంతో రాసి ఉన్నా ఇంకా చెప్పాల్సిందెంతో ఉందనిపిస్తుంది. చెప్పాల్సిందంతా ఇంకా చెప్పనేలేదని పిస్తుంది. కొన్ని సంఘటనలు ఎంతలోతైనవంటే మనువ్వెంత ప్రయత్నించినా వాటి అడుగు ఎక్కడుందో కనుక్కోలేవు. యుద్ధం తర్వాత పుట్టిన కళాకారులు సైతం రెండో ప్రపంచ యుద్ధాన్ని తమ కళావస్తువుగా తీసుకొంటున్నారు. ఆనాటి యిబ్బందులకీ, మాప్రజల విజయానికీగల కారణాలను తెలుసుకోటానికి ప్రయత్నిస్తున్నారు ఆ యుద్ధం లాంటి దారుణమైనదాన్ని వీరోచితంగా ఎదుర్కొన్న ఆ తరాన్ని వారు కుతూహలంగా పరిశీలిస్తున్నారు.

ప్ర : సోవియట్ రచయితలపై ఉన్న అపనింద మీకు తెలుసు. సోవియట్ యూనియన్‌ని ఎడల సానుభూతి ఉన్నవారు సైతం అనేదేమంటే యుద్ధ వస్తువు సోవియట్ సాహిత్యంలో మరీ అతిగా చోటు చేసుకొంటోంది అని. యుద్ధం అయిపోయి 40 ఏళ్ళయింది. ఈ నలభై ఏళ్ళుగా యూరపు శాంతియుతంగా ఉంది.

కనుక యిప్పుడు ఇక సాహిత్యంలో యుద్ధ వస్తువుకి స్వస్తి పలకటం అవసరమని వారంటారు. మీరేమంటారు ?

జ : నిజమే. నేను కూడా ఈ అపనిందల్నీ, ఫిర్యాదుల్నీ విన్నాను. పెట్టుబడిదారీ దేశాల నుండి వచ్చిన రచయితలతో సమావేశాలు జరిగినప్పుడల్లా దాదాపు ఈ ప్రశ్న వారు తీసుకొస్తుంటారు. ప్రజలకు దూరంగాఉంటే సాహిత్యం బతకదు. అది వాస్తవ సాహిత్యం కూడా కాజాలదు. రష్యన్ సాహిత్య సాంప్రదాయం దీన్ని రుజువు చేసింది. యుద్ధంలో మా ప్రజ లనుభవించిన బాధలు తరాల తరబడి మా ప్రజల స్మృతి పథంలో నుండి చెరిగిపోవు. యుద్ధ వస్తువుకి స్వస్తి చెప్పమని సలహా చెప్పే మిత్రులు ఎప్పుడూ యుద్ధ దారుణాలకు మా ప్రజలు గురైనంతగా గురయి ఉండరు. కనుక వారు తమ సొంత కొలబద్దలను ఉపయోగించటానికి ప్రయత్నిస్తున్నారు.

మేము యుద్ధం గురించి ఎందుకు రాస్తున్నాం ? దాన్ని శ్లాఘించటానికా ? ఏమాత్రంకాదు. దురాక్రమణని వీరోచితంగా తిప్పికొట్టడం అనే అంశాన్ని మాత్రమే మేము శ్లాఘిస్తున్నాం. యుద్ధం మరెప్పుడూ రాగూడదనే లక్ష్యంతోనే మేము యుద్ధం గురించి రాస్తున్నాం. మా సాహిత్యంలో ఎప్పటినుండో పాటిస్తున్న సాంప్రదాయం ఇది.

ప్ర : సాహిత్యంలో యుద్ధ వస్తువుకి ఆదరణ ఉండటాన్ని చూపించి సోవియట్ యూనియన్‌ని సైనిక వాదాన్ని ప్రోత్సహించే దేశంగా చిత్రించడానికి ప్రయత్నాలు జరుగుతున్నాయి. ఇది వింత విషయమే అయినా వాస్తవం. దీనికి మీరేమంటారు ?

జ : సోషలిజాన్ని గుడ్డిగా ద్వేషించేవాళ్ళు మాత్రమే ఇట్లా ఆరోపించగలరు. నాజీలతో యుద్ధంలో సోవియట్ ప్రజలు ఎంత నష్టపోయారు తెలిసిన వారెవరూ ఆ మాట అనరు. రష్యన్లు యుద్ధం కావాలని ఎన్నటికీ కోరరని వారికి తెలుసు. మేమెప్పుడూ యుద్ధాన్ని కోరలేము. 1917 లో మళ్ళీ పుట్టినప్పుడే మా దేశం శాంతి డిక్రీతో పుట్టింది.

అణు మిసైళ్ల వంటి భయంకరమయిన ఆయుధాలున్న నేటి పరిస్థితుల్లో ప్రపంచ వ్యాప్తంగా శాంతి కోసం పోరు జరగాలి. మొత్తం అందరం అందులో పాల్గొనాలి. యుద్ధమే వస్తే ఎవరిలూ భద్రంగా ఉండబోదు. ఇటీవల కొంతమంది అమెరికా రచయితలతో జరిగిన సమావేశంలో నేను పాల్గొన్నాను. మా సాహిత్యంలో మేము యుద్ధ వస్తువుకి అతిగా ప్రాధాన్యత యిస్తున్నామని వారు అన్నారు. అప్పుడు నేనన్నాను. పోతే "రచయితలే యుద్ధానికి వ్యతిరేకంగా నోరు కదపకఇక సాహిత్యప్రయోజనమేమిటి ? మీరు మా ప్రపంచ దృక్పథాన్ని ఆమోదించరు. మేము మీ ప్రపంచ దృక్పథాన్నిఆమోదించలేము. అయితే అంతమాత్రం చేత మనం ఒకరితో ఒకరం యుద్ధం చేసుకోవలసిన అవసరంలేదు. చరిత్రనోసారి

పరిశీలించండి. ఎన్ని వింత విషయాలుంటాయో దాన్నిండా. విభిన్న సామాజిక వ్యవస్థలు గల దేశాలు (అమెరికా, ఇంగ్లండు, సోవియట్ యూనియన్‌లు) కలిసి కట్టుగా నాజీ జర్మనీని ఓడించలేదా ? మానవజాతి నేడెదుర్కొంటున్న ప్రమాదం దృష్ట్యా అటువంటి ఐక్యత మరోసారి అవసరమౌతోంది. చరిత్ర వస్తుగతమైనది. ఎటొచ్చీ కొంతమంది చరిత్రకారులకే వస్తుగత దృష్టి లోపించింది."

ప్ర : *గార్లండ్ ఆఫ్ గ్లోరీ* సంపుటాల్లో మీరు రాసినదేమైనా ఉందా ?

జ : స్టాలిన్‌గ్రాడ్ యుద్ధం గురించిన సంపుటికి నేను బాధ్యుణ్ణి. నా యుద్ధ కాలపు డైరీలు కూడా ఆ సంపుటిలో చోటు చేసుకొంటాయి.

ప్ర : మీరు అప్పుడు స్టాలిన్‌గ్రాడ్‌లో ఉన్నారా ?

జ : అవును. మోర్టార్ దళం కమాండర్‌గా ఉన్నాను.

# దురాక్రమణదారుణ్ణి ఎండగట్టిన గ్రంథం

రావుల్ వాల్డెస్ వివ

*క్యూబా కమ్యూనిస్టు పార్టీ కేంద్ర కార్యవర్గ సభ్యుడు*

GRANADA : EL MUNDO. G.O N./TRA EL CRIMEN (గ్రెనడా : ప్రపంచం ఆ నేరాన్ని ఖండిస్తోంది) EDITORIAL DE CIENCIAS SOCIALES, HAVANA, 1983, 325 PP.

పై గ్రంథం తప్పనిసరిగా అంతర్జాతీయ పాఠకుల దృష్టిని ఆకర్షిస్తుంది. అంతర్జాతీయ పత్రికా ప్రపంచంలోనూ, క్యూబా పత్రికా ప్రపంచంలోనూ వెలువడిన సమాచారాన్ని సర్వే చేస్తూ రచించిన గ్రంథం ఇది. 1983 అక్టోబర్ 25వ తేదీన కరీబియా సముద్రంలోని గ్రెనడా అనే చిన్ని దీవిపై అమెరికా సామ్రాజ్యవాదం చేసిన పైశాచిక దాడిని ఈ గ్రంథం వివరిస్తుంది.

క్యూబా కమ్యూనిస్టు పార్టీ ద్వితీయ కార్యదర్శి రావుల్ కాస్ట్రో ఈ గ్రంథానికి ముందు మాట రాస్తూ అమెరికా గ్రెనడాల బలాబలాల్లో ఉన్న అసమానతని ఇలా వివరించారు : ప్రపంచంలోని అతి చిన్న దీవుల్లో ఒకటైన గ్రెనడా పైన ప్రపంచంలో అత్యంత బలోపేతమయిన అమెరికా దాడి చేసింది. (వైశాల్యంలో ఇరవై ఏడు వేల గ్రెనడాలు ఒక అమెరికాకు సమానం) గ్రెనడా సైన్యం అంతా కలిపినా అమెరికాలోని నగరాల్లోని ఏ నగరంలో పోలీసుల సంఖ్యకు కూడా తుల

తూగదు. దాని జనాభా అంతా కలిపినా న్యూయార్క్ నగరంలో ఒక చిన్నపేటకు కూడా తులతూగదు. (పే. 7)

అమెరికన్ సామ్రాజ్యవాదులు చేసిన నేరాలను, క్యూబన్ ప్రజల సూత్ర బద్ధ వైఖరిని ఈ గ్రంథం వివరిస్తుంది. ఆ ప్రాంతంలో పరిస్థితి తెలియని పాఠకునికి సైతం అమెరికా సామ్రాజ్యవాదపు కుట్రల సారాంశాన్ని, గ్రెనడా విషాదాన్ని తెలియజేయగలిగిన గ్రంథం యిది.

గ్రెనడాపై అమెరికా దురాక్రమణకు ముందు క్యూబా ప్రభుత్వం విడుదల చేసిన ప్రకటన ఈ గ్రంథంలో ఉంది. దాడికి సిద్ధమౌతున్న అమెరికా దుష్ట పథకాలను ఆ ప్రకటనలో క్యూబా ప్రభుత్వం వెల్లడి చేసింది.

గ్రెనడాలో నిర్మాణపు పనుల్లోనూ ఇతర రంగాల్లోనూ పనిచేస్తున్న క్యూబా పౌరులు అమెరికన్ సామ్రాజ్యవాదులకు వ్యతిరేకంగా ఎలాపోరాడింది ఈగ్రంథం వివరిస్తుంది. అమెరికా బందిపోటు దాడిని తమ మౌన కుట్రతో సామ్రాజ్యవాదులు దాయటానికి ప్రయత్నించారు. ఆ సమయంలో పత్రికలవారు గ్రెనడాలోకి ప్రవేశించకుండా అమెరికన్ సామ్రాజ్యవాదులు నిరోధించారు. అక్కడున్న గ్రెనడా పౌరులను క్యూబా పౌరులను అమెరికా నావికాదళాలు ఎలా ఊచ కోత కోసింది బయటి ప్రపంచానికి తెలియకుండా వారు జాగ్రత్తలు తీసుకొన్నారు. అమెరికా సామ్రాజ్యవాదులు తమ సొంత బంటుల్లాంటి పత్రికల వాళ్ళని కూడా రానివ్వలేదు.

అమెరికాకి స్వాతంత్ర్యం వచ్చిన నాటినుండి (1776 నుండి) ఈ నాటి వరకూ ఏ అమెరికా ప్రభుత్వమూ జర్నలిస్టుల ఎడల ఇటువంటి వైఖరి అనుసరించలేదు. అమెరికా సైనిక చర్య జరిపిన ప్రతి సందర్భంలోనూ సైనిక దళానికి చెందిన విలేకరులను కూడా అవి వెంటతీసుకువెళ్ళేది. అని ఒక ఫ్రెంచి పత్రికా ప్రతినిధి రాశాడు.

గ్రెనడాలో ప్రవేశించటానికి వీల్లేకుండా అన్ని మార్గాలనూ మూయించి రీగన్ ప్రభుత్వం 19 క్యూబా వ్యతిరేక ప్రకటనలు చేసింది. హవానాలో పదిలక్షల మంది హాజరైన బహిరంగ సభలో ఫైడల్ కాస్ట్రో అమెరికా ఆరోపణలను చదివి వినిపించగా మొత్తం పది లక్షలమంది 'అబద్ధాలు అబద్ధాలని' ఒక్కపెట్టున నినదించారు.

క్యూబాపై తన నిందా పూర్వకమైన ఆరోపణలతో అమెరికా అధ్యక్షుడు అమెరికా ప్రజాభిప్రాయాన్ని తనవైపు తెచ్చుకోగలనని ఊహించాడు. వాషింగ్టన్ పాలకులకు ఇది కొత్త పథకమేమీ కాదు. వియత్నాంపై దాడి చేయటానికి ముందు టోంకిన్‌గల్ఫ్ సంఘటన అనబడే దాన్ని సృష్టించి పచ్చి అబద్ధాలను ఆనాటి జాన్సన్ ప్రభుత్వం ప్రచారం చేసింది. తన దురాక్రమణ యుద్ధాల్లో హిట్లర్ కూడా ఇదే పద్ధతిని అనుసరించాడనేది గుర్తుచేయాల్సిఉంది.

బిషప్ మరణానికి క్యూబాయే కారణమనేది అమెరికా చేసిన దారుణమైన నీలాపనింద. (పే. 243) స్వయంగా ఒక దేశానికి అధ్యక్షుడు ఈ చౌకబారు ప్రచారం చేసి ఉండకపోతే దీన్ని కొట్టి పారేయడానికి వీలుండేది. ఆ కారణంగానే విపరంగా దాన్ని గురించి మాట్లాడాల్సిన అవసరాన్ని ఫైడల్ కాస్ట్రో గుర్తించాడు. బిషప్ ఉగ్రవాది కాడు. అతడు నిజమైన చైతన్యవంతమైన, నిజాయితీపరుడైన విప్లవకారుడు. "ఆచరణాత్మకమైన, వాస్తవ దృక్పథంతో కూడిన అతని విధానాలను క్యూబా ఏనాడూ తిరస్కరించలేదు. పైగా వాటికి మాదేశం పూర్తి మద్దతు యిచ్చింది. ఆ విధానాలు ఆ దేశ శక్తి సామర్థ్యాలకు, పరిస్థితులకు అనుగుణంగా ఉన్నాయి. కరీబియన్ ప్రాంతంలో గ్రెనడా నిజమైన స్వాతంత్ర్యాల చిహ్నంగా మారింది." కాస్ట్రో చెప్పిన ఈమాటలను మొత్తం క్యూబాప్రజలు ఏకగ్రీవంగా ఆమోదించారు.

గ్రెనడా నాయకత్వంలో వాస్తవంలో జరిగిందేమిటి అనే దాన్ని వివరిస్తూ ఫైడల్ కాస్ట్రో ఇట్లా పేర్కొన్నాడు: బిషప్‌కి వ్యతిరేకంగా కుట్ర పన్నిన వారి నైజం ఏమిటి? పార్టీలో, సైన్యంలో భద్రతా దళాలలో వారు సిద్ధాంత రాజకీయ పదాలను అరిగా వాడుతూ ఉండిన ఒక మైనారిటీ ఉగ్రవాదుల ముఠా మాత్రమేనా, లేదా గ్రెనడా విప్లవాన్ని అంతం చేయడానికి గ్రెనడా విప్లవ శ్రేణుల్లోకి ప్రవేశించిన సామ్రాజ్యవాదుల ఏజెంట్లా లేదా దురాశాపూరితులైన అవకాశవాదులా? ఈ ప్రశ్నలకు సమాధానం చరిత్ర మాత్రమే చెప్పగలుగుతుంది. అయితే పైన పేర్కొన్న వాటిలో ఏది వాస్తవమైనా ఆశ్చర్యపడాల్సింది లేదు.

"కోర్ గ్రూప్ వాస్తవంలో విప్లవాన్ని నాశనం చేసింది. అది సామ్రాజ్యవాద దురాక్రమణకు ద్వారాలు తెరిచింది. ఇది నా అభిప్రాయం వారి ఉద్దేశాలేమైనా కావచ్చు. కాని బిషప్‌నీ అతని అనుయాయుల్నీ హత్య చేయడం గ్రెనడా విప్లవ పరిస్థితుల్లో గాని, ఏ విప్లవ పరిస్థితుల్లో గాని సమర్థనీయం కాదు. విప్లవం స్వాతంత్ర్యాల పేరు మీద ఎటువంటి నేరాన్నీ చేయరాదని డిసెంబరు 20వ తేదీన విడుదలచేసిన ప్రకటనలో క్యూబా ప్రభుత్వం నిర్ద్వంద్వంగా చెప్పింది (పే 238–239).

గ్రెనడాలో వెయ్యికి పైగా క్యూబన్లు ఉన్నారనీ వారిలో అత్యధికులు, కార్మికులు కాదనీ, వారు సైనికులనీ రీగన్ ప్రభుత్వం అర్థరహితమైన ప్రచారం చేస్తోంది. గ్రెనడాపై అమెరికా దాడి చేసిన సందర్భంలో అక్కడ 784 క్యూబా వారున్నారు పై గ్రంథం వారి పేర్లు, అడ్రసులు, వయసు, వృత్తి లేదా ఉద్యోగం వగైరా వివరాలన్నీ యిచ్చింది. (పే. 300–315) పోరాటంలో గాయపడిన కార్మికులు చెప్పిన వివరాలు వింటే రక్తం ఉడుకుతుంది.

దురాక్రమణదారులు క్యూబాకి 13 మంది గ్రెనడా సైనికుల మృతదేహాలను పంపించారు. క్యూబాలో వారికై జరిగిన సంతాప సభలో ఫైడల్ కాస్ట్రో ఇలా

పేర్కొన్నాడు: "మూకుమ్మడిగా జరిగిన హత్యాకాండలో బలైన వారు కూడ కొందరు. ఈ అమరవీరుల్ని మనం మళ్ళీ వారి దేశాలకు తిప్పి పంపిస్తున్నాం." (పే. 269)

ఈ పుస్తకంలోని ప్రతి బాట, ప్రతి పేజీ అమెరికా దురాక్రమణని ఎలుగెత్తి ఖండించింది. ప్రపంచ ప్రజాభిప్రాయం అమెరికా చర్యని నిరసిస్తుంది.

ఇంతవరకూ ఏ సామ్రాజ్యవాద దేశమూ అంతర్జాతీయంగా ఇంత ఒంటరి కాలేదు. ప్రపంచం అమెరికాని ఏకకంఠంతో ఖండిస్తోంది. అమెరికా నిదాని నాటో సహచరులు సైతం ఖండించాయి. ఐక్యరాజ్యసమితి సాధారణ సమావేశంలో హాజరయిన 144 ప్రతినిధివర్గాలలో 108 అమెరికాని ఖండించాయి. 27 దేశాలు ఓటింగులో పాల్గొనలేదు. పోతే అమెరికా దాడిని సమర్థించిన దేశాలు అమెరికాతో సహా తొమ్మిది దేశాలు మాత్రమే. అవి ఏ దేశాలో తెలుసుకోవడం అవసరమే: ఇజ్రాయిల్, ఎల్ సాల్వడార్, బార్బడోస్, యాంటిగ్వా, బార్బుడా, డొమినికా, జమైకా, సెయింట్ లూసియా, సెయింట్ విన్సెంట్, గ్రెనడైన్స్.

ప్రపంచ వ్యాప్తంగా అనేక నగరాల్లో నిరసన ప్రదర్శనలు జరిగాయి. భిన్న రాజకీయ అభిప్రాయాలు కలిగిన మేధావులు ఈ దాడిని ఖండించారు. ఒక్క లాటిన్ అమెరికాలోనే ప్రపంచ ప్రఖ్యాత మేధావులు ఎనిమిది వందలమంది ఈ దాడిని ఖండించారు.

ప్రచార సాధనాలను వినియోగించుకోవటం ద్వారా, దారుణమైన అబద్ధాలు ప్రచారంలో పెట్టడం ద్వారా రీగన్ ప్రభుత్వం అమెరికాలో ప్రజాభిప్రాయాన్ని తనవైపు తెచ్చుకోగలిగింది. అయితే ప్రజాభిప్రాయ సేకరణ తెలియచేసిందేమంటే "టోంకిన్ గల్ఫ్ సంఘటన" అనబడే దాని తర్వాత జాన్సన్ ప్రభుత్వాన్ని సమర్థించిన వారికంటె గ్రెనడాపై దాడి తర్వాత రీగన్ ప్రభుత్వాన్ని సమర్థించిన వారి సంఖ్య (అమెరికాలో) చాలా తక్కువనే విషయాన్ని గమనించాలి. టోంకిన్ గల్ఫ్ సమయంలో అమెరికాలో అత్యధిక ప్రజలు వియత్నాంని "శిక్షించాలని" కోరారు. అయితే వాస్తవం బయటపడిన తర్వాత వియత్నాంలో యుద్ధానికి వ్యతిరేకంగా గొప్ప ఉద్యమం బయలేరింది. అది మొత్తం అమెరికా సమాజాన్ని కుదిపి వదిలిపెట్టింది. చరిత్ర పునరావృతమౌతుందేమో చూడాలి.

ప్రపంచ ప్రజలు అమెరికా విధానాలను ఖండిస్తున్నారు. అమెరికా అధ్యక్షుణ్ణి నిందిస్తున్నారు. మొత్తం ప్రపంచాన్ని టపాకీ చూపించి బెదిరించాలని అతడనుకొంటున్నాడు.

"తమ స్వాతంత్ర్యాన్ని, జీవితాన్నీ రక్షించుకోడం కోసం ప్రజలు తమ పోరాటాన్ని కొనసాగించి తీరుతారు. ప్రపంచం స్మశానంగా మారకుండా కాపాడటానికి వారు పోరాడుతూనే ఉంటారు. మానవజాతి సజీవంగా ఉండటం కోసం, ఎంత మూల్యం చెల్లించాల్సి వచ్చినా వారు చెల్లిస్తారు." ఇవి కాస్ట్రో మాటలు. క్యూబా ప్రజల మనసులో ఉన్న మాటలు.



# కొరడా రాజ్యమేలిన చోట

ఎస్సోప్ పహాడ్

*దక్షిణాఫ్రికా జర్నలిస్టు*

నికొలాస్ హయ్‌సమ్, రూలింగ్ విత్ ది విప్. సెయిస్కీలో మానవ హక్కుల ఉల్లంఘనపై నివేదిక-సెంటర్ ఫర్ ఆప్లయిడ్ లీగల్‌స్టడీస్, యూనివర్శిటీ ఆఫ్ విట్‌వాటర్‌స్రాండ్, దక్షిణాఫ్రికా, 1983 పేజీలు 90.

పుస్తకం శీర్షిక దక్షిణాఫ్రికాలోని నియంతృత్వ స్వభావాన్ని చాలా ఖచ్చితంగా తేల్చి చెప్పింది. ప్రపంచంలో జాత్యహంకారాధిక్యతా సిద్ధాంతం ప్రభుత్వ పాలనా వ్యవస్థకు మూలస్తంభంగా వున్న ఏకైక దేశమది. ఆఫ్రికా ప్రజల మీద సాగిస్తున్న దమనకాండనది పవిత్ర కార్యక్రమంగా ఎంచుకొంది.

దక్షిణాఫ్రికాలో జాత్యహంకారం కేవలం ఒక వర్గం ప్రజల్ని మరొక వర్గం పైకి విపక్షతా చర్యల ద్వారా రెచ్చగొట్టటం మాత్రమే కాదు. అది సైనిక, పోలీసు భయోత్పాతం ద్వారా జాతులను సామాజికంగా, ఆర్థికంగా, రాజకీయంగా విభజించటానికి అది మెలుకువతో పన్నిన పథకం. దాని లక్ష్యం ప్రధానంగా మెజారిటీగా వున్న నల్ల ప్రజల్ని అతి దారుణంగా అణచి, శ్వేతజాతీయులకు అన్ని హక్కుల్ని కల్పించడం. అత్యంత వికృతమైన విషయమేమంటే అది దేశాన్ని శ్వేత దక్షిణాఫ్రికాగా మార్చి ఆఫ్రికన్ల కోసం పది ప్రత్యేక గిరిజన ప్రాంతాలను అంటే బంటూస్థాన్లను వేరుచేసింది. ఈ బంటూస్థాన్లు కృత్రిమంగా ఏర్పాటు చేసినవే. వీటిని బీడు భూముల్లో, ఎడారి ప్రాంతాల్లో, ఖనిజాలు, ఇంధన వనరులు లేని చోట్లలో ఏర్పాటు చేశారు. ఇవి పూర్తిగా ప్రిటోరియా మీద ఆధారపడవలసిందే. దేహదారుఢ్యం కలిగిన మెజారిటీ ఆఫ్రికన్లను శ్వేతజాతీయుల పారిశ్రామికవాడల్లో పనిచేయిస్తున్నారు.

దక్షిణాఫ్రికా విట్‌వాటర్‌స్రాండ్ యూనివర్శిటీలోని సెంటర్ ఫర్ అప్లయిడ్ లీగల్ స్టడీస్ వారు ప్రచురించిన ఈ పుస్తకంలో బంటూస్థానలో ఒకటైన సెయిస్కీ[1] లోని ఆఫ్రికన్ ప్రజల జీవనం, పోరాటాలను గురించి రాశారు.

ఈ పుస్తకం రచయిత యూనివర్శిటీ అధ్యాపకుడు. దక్షిణాఫ్రికా నైజాల గురించి పుష్కలంగా లభిస్తున్న సమాచారం ఆధారంగా ఆయన బలమైన సాక్ష్యాలతో ఆ నేరాల గ్రంథాన్ని రచించాడు.

పుస్తకానికి క్లుప్తంగానైనప్పటికీ, వివరణాత్మకంగా రాసిన ఉపోద్ఘాతంలో ఆయన, సెయిస్కీకి స్వాతంత్ర్యం ప్రకటించటానికి దారితీసిన పరిస్థితులను, దాని ఆర్థిక, పాలనావ్యవస్థ, నిరంకుశ యంత్రాంగం, జాత్యహంకార శాసనాలు తదితర అంశాలను గురించి వివరించారు. ఈ నయా ప్రభుత్వ అధిపతి లెన్నాక్స్ సోబే యొక్క రాజకీయ జీవితాన్ని గురించి కూడా రాశారు. ఎంగిలిమెతుకులకు ఆశపడి తమ ప్రజలకు విద్రోహం చేసిన ఆఫ్రికన్ తొత్తుల్లో విచిత్రమైన జీవన విధానం కలిగిన వాడితను. కింగ్ విలియమ్స్ టౌన్‌లో ఒక చిన్న అధికారిగా వుండేవాడు. బానిసత్వ విధేయతను నరనరాన జీర్ణించుకొని తెల్ల యజమానుల మెప్పును సంపాదించాడు. సెయిస్కీలో క్సోసాస్‌లు (ఆఫ్రికన్ ప్రజలు) పూర్తిగా వ్యతిరేకించినప్పటికీ, అక్కడ స్థానిక ప్రభుత్వాధినేతగా సెబెను ప్రిటోరియా నియమించింది. ఆ దుర్మార్గ ప్రభుత్వం నియమించిన ఈ తొత్తుకు అధికారం వెంటనే తలకు పడింది. రెండేళ్ళ తరువాత అతను జీవితాంతం తానే అధ్యక్షుడిగా వుంటానని ప్రకటించుకొని, గొప్ప అదృష్టాన్ని తనకు తానే కల్పించుకున్నాడు. ఈ జాత్యహంకారుల అవినీతి సేవకుడు, అధికార పిపాసి. దుర్మార్గుడి పట్ల ఆఫ్రికన్ జాతీయ కాంగ్రెస్, దక్షిణాఫ్రికా కమ్యూనిస్టుపార్టీ దయనీయ విద్వేషాన్ని కలిగివున్నాయి.

సెయిస్కీ బంటూస్థాన్‌లోని దురుగున వున్న ఒక పట్టణం మడంట్సానెలో ప్రజలు జరిపిన బస్సు బహిష్కరణ గురించి ఈ పుస్తకం వివరించింది. అదివరకు ఇతర రాష్ట్రంలో వున్న "శ్వేతమండల" లోని తూర్పు లండన్ పట్టణంలో పనిచేయటానికి రోజూ మడంట్సానె నుంచి వేలకొలది కార్మికులు ప్రయాణమై పోతుంటారు.

మడంట్సానె చాలా విశాలమైన ప్రాంతం కావటంవల్ల బస్సు ప్రయాణమే చాలా అనుకూలమైన రవాణా సౌకర్యం. బస్సు సర్వీసులను సెయిస్కీ కార్పొరేషన్ వారు నడపగా అందులో ప్రభుత్వానికి 50 శాతం వాటా వుంది. సి.టి.సి. రోజుకి 650 బస్సుల్ని నడుపుతూ 50 వేల ప్రయాణికుల్ని చేరవేస్తున్నది, 1983

---

1. స్వతంత్రం ప్రకటించాల్సి వున్న నాల్గవ బంటూస్థాన్ ఇది. దీని ప్రభుత్వ సంస్థలు కొన్ని ఇంకా జాత్యహంకార దక్షిణాఫ్రికాలో వున్నాయి. ఈ నిజాన్ని బట్టే ఆ బంటూస్థాన్ స్వాతంత్ర్యం ఎంత ఊహాజనితమో తెలుస్తుంది. సెయిస్కీ దేశీయ, విదేశాంగ విధానాన్ని కూడా ఆచరణలో ప్రిటోరియానే నిర్ణయిస్తుంది.

మేలో బస్సుఛార్జీలను పెంచుతున్నట్లు సి.టి.సి. ప్రకటించింది. అప్పుడు సి.టి.సి.తో సంప్రదింపులు జరపటానికి కార్మికులు పదిమందితో కూడిన ఒక కమిటీని ఎన్నుకున్నారు. బస్సు కంపెనీవారు కార్మికులతో చర్చలు జరపటానికి నిరాకరించడంతో, బస్సులు బహిష్కరించాలని ఒక పెద్ద సభలో కార్మికులు నిర్ణయించుకున్నారు. దక్షిణాఫ్రికా కార్మికులు ఇదివరకే నిర్మించిన విజయవంతంగా అనుసరించిన పోరాటమార్గాన్నే వారు ఎంచుకున్నారు. తూర్పు లండన్ పట్టణానికి ప్రజలు రైలుమీద పోవడం ప్రారంభించారు. హాబ్సన్ రాసినట్లు ప్రయాణీకుల్లో ఎక్కువమంది రోజూ రైల్వే స్టేషన్ వెళ్ళటానికి వాళ్ళున్న ప్రాంతం నుంచి 12 నుంచి 32 కిలోమీటర్లు దాకా నడిచేవారు. అంటే ఉదయం మూడున్నరకు బయల్దేరితే రాత్రి 8 తర్వాతగానీ ఇంటికి చేరేవారు గారు." (పే. 27)

ఈ బహిష్కరణకు భయంకరమైన భయోత్పాతం ఎదురయింది. ప్రజల ప్రతిఘటనను ఆపేందుకు సెబె అతని గూండాలు వివిధ రకాలుగా వగసాధింపు, వేధింపు చర్యలకు పూనుకున్నారు. హింసకు పాల్పడ్డారు. ఈ గూండాల్లో పోలీసులున్నారు-సైనికులున్నారు-ప్రత్యేక నిఘా దళాలు కూడా వున్నారు.

మొదటి రోజునుంచే అర్ధ-ఫాసిస్టు గూండాల దాడి ప్రారంభమయింది. కార్లు, టాక్సీలు ఉపయోగించిన ప్రజల్ని వారు చితకబాదారు. రైలు ప్రయాణీకుల మీద కూడా హింసకు పాల్పడ్డారు. రోజూ ప్రయాణీకులను లేనిపోని అధికార, అనధికార డాక్యుమెంట్లు చూపమని వాదించేవారు. బంటూస్తాన్‌లో లీగల్ పని చేస్తున్న ఏకైక పార్టీ సెయిస్కి నేషనల్ ఇండిపెండెన్స్ పార్టీ సభ్యత్వ కార్డులు, జీవిత అధ్యక్షుడి విగ్రహం నెలకొల్పటానికి డబ్బులు చెల్లించినట్టు దాఖలాలు చూపమని వేధించేవారు. తన విగ్రహాన్ని నెలకొల్పాలని తనకు తానుగానే సెబె ప్రకటించుకున్నాడు. పనికి పోతున్న కార్మికులను మార్గమధ్యంలోనే విచక్షణా రహితంగా కాల్చివేసేవారు. ఈ విధంగా 1983 జులై-డిసెంబరు మధ్యలోనే 90 మందికి పైగా తుపాకి తూటాలకు బలిచేశారు. బహిష్కరణ ప్రారంభించిన మొదటి మూడు నెలల్లో వెయ్యిమందికి పైగా అరెస్టు చేశారు. చాలా పెద్ద ఎత్తున వారిని చిత్రహింసలకు గురిచేశారు. అందులో శారీరక చిత్రహింస : హెలికాప్టర్ (మోకాళ్ళు, మోచేతులు కలిపికట్టి స్తంభానికి వేలాడదీసి కొట్టడం), పాముపడగ (ముద్దాయి తలపై నుంచి భుజం దాకా పాము పడగ మాదిరి తడిగుడ్డ కప్పి స్పృహకోల్పోయేదాకా హింసించడం) ఎలక్ట్రిక్ షాక్ ఒక చేతికి సంకెళ్ళు వేసి ఒక పెద్ద క్రాస్ బీమ్‌కు వేలాడదీయటం) మొదలైనవి వున్నాయి. కొన్ని సందర్భాల్లో ముద్దాయిల చేతులకు సంకెళ్లు వేసి ఒక పడవకు కట్టి లాగుతారు. (పే. 23)

ఆ నరరూపరాక్షసులు పాల్పడిన ఈ పాశవిక చర్చలు వింటే బాధకలగ డమేకాదు ఆగ్రహం చెలరేగుతుంది. ఒక క్రీడా స్టేడియం అడుగుభాగానవున్న బట్టలు మార్చుకునే గదుల్లో తిష్టవేసిన గూండా కాపరులు ఒకేసారి 80 మంది ఖైదీలను స్త్రీలు, పురుషులనే విచక్షణ కూడా లేకుండా రెండు చిన్న గదుల్లో గొర్రెమందల్లాగా తోలేవాళ్లు. ఈ గదులు ఒక్కోటి ఏడెనిమిది చదరపుమీటర్ల వైశాల్యం కూడా వుండేవికావు. ఆ దురదృష్టవంతులకు అన్నం, మంచినీళ్లు కూడా వుండేవికావు. ఎముకలుకొరికే చలివున్నా దుప్పట్లు ఇచ్చేవారుకాదు. టాయ్‌లెట్ సౌకర్యాలు కూడా మృగ్యం. ఆ ఖైదీలు ఆ డిటెన్షన్ గదుల్లోనే అన్నీ పూర్తిచేసుకోవలసి వచ్చేది. ఖైదీల్లో చిన్నపిల్లలు, యువజనులు కూడా వున్నారు. వారిని ప్రతిరోజూ క్రమం తప్పకుండా హింసించేవారు. స్త్రీలను విపరీతంగా కొట్టేవారు, చెరిచేవారు.

ట్రేడ్‌యూనియన్ నాయకులు, ముఖ్యంగా దక్షిణాఫ్రికా అలైడ్ వర్కర్స్ యూనియన్ సభ్యులను కఠినంగా శిక్షించేవారు. ఈ యూనియన్ అధ్యక్షుడు తోసమిల గ్క్వెటాను కనీసం ఎనిమిదిసార్లు నిర్బంధించారు. ఉపాధ్యక్షుడు సిజా నెనెలెనాను ఆరుసార్లు అరెస్టు చేశారు. గ్క్వెటామీద ఎలాంటి ఆరోపణలు లేకపోయి నప్పటికీ అతన్ని దారుణంగా హింసించారు. ఆయన తల్లిని, మామను సజీవంగా దహనం చేశారు. వారు పారిపోకుండా ఇంటిచుట్టూ విద్యుత్తుతీగ కట్టారు. ఆయన స్నేహితురాలిని పోలీసులు కాల్పుల్లో చంపారు.

ఆ కసాయివాళ్లు ఆఖరికి పాఠశాల విద్యార్థులను కూడా వదిలిపెట్టలేదు. తమ తల్లిదండ్రులకు అండగా నిలిచినందుకు అనేకమందిని అరెస్టుచేసి కొట్టారు. అయినప్పటికీ కూడా విద్యార్థులు జయప్రదంగా స్కూళ్లను బహిష్కరించారు. ఒక్క వుదంట్సానేలోనే కాకుండా చుట్టుపక్కల ప్రాంతాల్లో కూడా విద్యార్థులు పాఠశాలలు బాయ్‌కాట్ చేశారు.

అధికారులు మాత్రం ప్రజలను లొంగదీసుకోలేకపోయారు. ఈ క్రింద పేర్కొన్న ఘటనలు, సెబె అతని క్రూరుల నిరంకుశ పాలనకు వ్యతిరేకంగా పోరాటం సాగిస్తున్న యోధుల వీరత్వాన్ని తెలియజేస్తాయి.

మెడంట్సాన్ స్టేషన్‌నుంచి ట్రెయిన్ ప్రారంభం కావటంతోనే ప్రజలు స్వాతంత్ర్య గీతాలు పాడుతారు. రైలు గమ్యంచేరేదాకా పాటలు సాగుతాయి. మధ్య మధ్య సమావేశాలు, సభలకు సంబంధించిన ప్రకటనలు చేస్తారు. నూతన పరిణామాలను చర్చిస్తారు. యూనియన్ సభ్యులు తోటి ప్రయాణీకుల్ని యూని యన్‌లో చేరమని ప్రోత్సహిస్తారు. అలాంటి క్యారేజీలో సెయిస్కీ నేషనల్ ఇండెపెండెన్స్ పార్టీ మద్దతుదారుడుగా బయటపడడం మరీ ప్రమాదకరం.



**మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక**

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | KRSA101M136 |
| పుస్తకం పేరు | కమ్యూనిజం |
| తారీఖు | 23 February 2025 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 117 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | Ci |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | vedavathi |
| పేజీలు విడదీసినది | vedavathi |
| స్కాన్ చేసినది | Soumya |
| పరీక్ష చేసినది | NAVYA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good. |